



ముఖచిత్రం : జై జవాన్! జై కిసాన్!
జైహింద్!

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

Member of Audit Bureau of Circulation Ltd

ధ్రప్రదేశ్ ముఖ్య కేంద్రాలలో ప్రదర్శింపబడుతోంది




# మొనగాళ్ళకు మొనగాడు

| | | |
|---|---|---|
| కమల్ | రాజేశ్వర్ | శ్రీనివాస్ |
| హైదరాబాద్ | సికింద్రాబాద్ | వరంగల్ |

ఆంధ్రప్రదేశ్ సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అనిల్ ప్రకాస్ ఎంటర్ప్రైజెస్

(నవయుగ విడుదల)

జనవరి సంచికలోని 'లవర్స్‌పాత్', 'ఎలుతురు మేసిన ఏరు', 'కుక్కతోక' చక్కని కథలు. పెద్దకథ 'జీవన వీణియ' బాగున్నది యువలోని కథలు ఆణిముత్యాలయితే సంపాదకీయం తలమానికమే. మీ సంపాదకీయాలలో చేసే సూచనలు ప్రభుత్వం పాటించినట్లయితే ప్రభుత్వం జనరంజకంగా పాలించడమే కాక, ప్రజలకు గొప్ప మేలు చేకూరగలదు.

వడ్లమాని రామం,
అల్లవరం

శ్రీ ఎన్. టి. రామారావుగారి రక్షణనిధి కార్యక్రమాల విశేషాలు యింత తొందరగా చిత్రాల రూపంలో అందించిన మీ రభినందనీయులు.

'యువ'లో యువస్నీ ఒక ఎత్తు, మీ సంపాదకీయం ఒక యెత్తు. ప్రతి నెలా మీ సంపాదకీయం ఒక ఆణిముత్యం. మీ సంపాదకీయాలు చదివిన ఫలితంగా ప్రముఖులు 'సరసమైన నిర్ణయాలు' గైకొనగలరని ఊహిస్తున్నాను

కె అరుణాదేవి,
హైదరాబాదు 7.

'యువ' జనవరి సంచిక సర్వాంగ సుందరంగా ఉంది దేశభక్తి, కుక్కతోక కథలు చాలా బాగున్నాయి. మధ్య మధ్య జోక్స్ నన్ను కడుపుబ్బ నవ్వించినవి వడ్డాదిగారి చిత్రాలు 'యువ'కు ప్రత్యేకాకర్షణ అని చెప్పక తప్పదు.

సయ్యద్ హుస్సేన్,
దేవరకొండ.

ఆంధ్రదేశమంతటా దిగ్విజయ యాత్ర సాగిస్తూ అత్యంత
వినోదాన్ని కల్గించే నవరసభరిత చిత్రం

రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్



# జమీందార్

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్
వి. మధుసూదనరావు

నిర్మాత
తమ్మారెడ్డి కృష్ణమూర్తి

వాణీ రిలీజ్

జంట నగరాలలో ప్రతి ఆటకు రికార్డు కలెక్షను

సాధించిన అపూర్వ చిత్రం

మనోజ్‌కుమార్, నందా హెలెన్ ప్రాణ్ మహమూద్ ధుమాల్ నటించిన



ఎస్. ఎస్. సిప్పీవారి

పృథ్వీ పిక్చర్స్ సమర్పించు **'గుమ్నామ్'** ఈస్ట్‌మన్ కలర్ చిత్రం

| డైరెక్షన్ | ఫొటోగ్రఫీ | మ్యూజిక్ |
| --- | --- | --- |
| రాజానవాతే | కె. హెచ్. కపాడియా, | శంకర్-జైకిషన్ |

అపూర్వ క్రిక్కిరిసిన ప్రేక్షకులతో విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది

నవరంగ్ - హైదరాబాద్ మనోహర్ - సికిందరాబాద్

(ప్రతిరోజు 3 ఆటలు)

విజయా రిలీజ్

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 13 ఫిబ్రవరి, 1966 సంచిక 2

ఊహించడానికి కూడా వీలులేనంత త్వరితగతిని నేటి చరిత్ర పరిణామం చెందుతున్నది నెహ్రూ నిర్యాణానంతరం దేశానికి దిక్కెవ్వరు అని సర్వేలూ ఆందోళన చెందుతున్న సమయంలో జాతి ప్రార్థనలకు సమాధానమా అన్నట్లు శ్రీ లాల్‌బహదూర్‌జీ నాయకు లయ్యారు అతి సంక్షిప్తమైన తరుణంలో లాల్‌బహదూర్‌జీ మన దేశ రథసారధి అయ్యారు పాకిస్తాను మన దేశంమీద దురాక్రమణ తలపెట్టి కచ్‌లో పోరాటం ప్రారంభించినప్పుడూ, తరువాత కాశ్మీరులో పెద్దఎత్తున యుద్ధం సాగించినప్పుడూ ఈ పొట్టిమనిషి జంకలేదు ఆ సమయంలో ఆయన ఆకాశమంత ఎత్తు పెరిగాడు .. వామనుడు త్రివిక్రముడు అయ్యాడు బలాన్ని బలంతోనే ఎదుర్కొంటాం అని ఈ మనిషి చెప్పినప్పుడు జాతి జీవనాడులలో విద్యుచ్ఛక్తి ప్రవహించింది ఐక్యరాజ్యసమితి జోక్యంతో పోరాటవిరమణ జరిగింది. అయినా అడపాదడపా పాకిస్తాను కాల్పులు జరుపుతున్నప్పుడు శాస్త్రీజీ 'మనం ఆక్రమించుకున్న ప్రాంతాలను వీడిపోము,' అనిస్పష్టంగా చెప్పారు. ఇంతలో సోవియట్ ప్రధాని కోసిగిన్ తాష్కెంటులో శాంతిసమాలోచనలు ఏర్పాటుచేయడం, భారత పాకిస్తాన్ భూభాగాల్లో శాంతి నెలకొల్పే సదుద్దేశంతో శాస్త్రీజీ అక్కడకు వెళ్ళడం జరిగింది చివరినిమిషంవరకూ శాస్త్రీజీ, పాకిస్తాన్ ఇండియాదేశాలు ఆగస్టు అయిదవ తేదీకి ముందువున్న స్థానాలకు సేనలు తర్లించే ప్రతిపాదనకు వొప్పుకో

లేదని అభిజ్ఞులు చెప్తున్నారు. అయితేనేం సమావేశం విజయవంతంకావడానికి ఆయన సంయుక్త ప్రకటనలో ఈ అంశం చేర్చడానికి అంగీకరించారని తెలుస్తున్నది. భారత నాయకుల శాంతికాముకతను శాస్త్రీజీ తాష్కెంటులో విదితం చేశారు. శాంతిదూత అనిపించుకున్నారు కాని మన దురదృష్టవశాత్తు సంతకం పెట్టిన కొలదిక్షణాల్లో ఈ మహనీయుడు హృద్రోగంవల్ల హఠాన్మరణం చెందారు. ఈ మహానాయకుని అకాల మరణానికి ప్రపంచం దిగ్భ్రాంతిచెందింది. విశ్వశాంతి కొరకు మానవ మహాకల్యాణంకొరకు ప్రయత్నిస్తూ ఆ మహాయజ్ఞంలో ఆత్మాహుతి అయిపోయిన శాస్త్రీజీ చేసిన కృషి చరిత్రపుటలో బంగారు అక్షరాలలో లిఖింపబడుతుంది నెహ్రూ తరవాత ఎవరు అని ఆందోళన చెందినట్లే, శాస్త్రీజీ తర్వాత ఈ దేశనౌకను నడిపించేది ఎవరు అని ప్రజలు ఆలోచిస్తున్న సమయంలో కాంగ్రెసుపార్టీ శ్రీమతి ఇందిరాగాంధిని ప్రధానపదవికి ఎన్నుకున్నది గుండెల మీదనుంచి ఏదో భారం తీసేసిన ట్లయింది.

నెహ్రూజీ కుమారితకు సామ్యవాదంలో అపారవిశ్వాసము. అతి చిన్న వయస్సులోనే ఈమె దేశస్వాతంత్ర్యోద్యమంలో అందరి కుటుంబసభ్యులతో పాల్గొన్నది. దేశాన్ని అతిచక్కగా ముందుకు నడిపించగల సామర్థ్యం ఈమెకు పుష్కలంగా వున్నది.

దేశంలో ఇప్పుడు ఎంతో దారిద్ర్యం వున్నది ఒక అమెరికన్ జర్నలిస్టు ఇటీవల ఒక అంచనా వేస్తూ భారతదేశంలో అందరికీ తలొక సైకిలు ఇవ్వాలంటే కేవలం జాతీయోత్పత్తులమీద ఆధారపడితే నాలుగువందల ఏళ్ళవరకు ఆపని సాధ్యం కాదన్నాడు. అంటే మనం అంత వెనుకబడి వున్నామన్నమాట. అన్నిరంగాల్లో స్వయంసమృద్ధిని సాధించనిదే మనకు మోక్షంలేదు. ప్రపంచంలో భారత దేశానికి గౌరవప్రపత్తులు కలగాలంటే ఊకదంపుడు ఉపన్యాసాలు లాభంలేదు. అనవరతమైన కృషివల్లనే మనం ముందుకు నడవగలుగుతాం. 'ప్రతి మానవుడి కంటిలోని అశ్రువులను తుడిచివేయడమే నా ఆశయం' అన్నాడు జాతిపిత మహాత్మా గాంధీ. సామాన్య భారతీయుడి జీవిత ప్రమాణాన్ని బాగుపరిచి జాతికి ఒక కొత్త ఉత్తేజాన్నీ, స్ఫూర్తినీ శ్రీమతి ఇందిరాగాంధి తమ పరిపాలనాకాలంలో కల్పిస్తారని దేశప్రజల ఆకాంక్ష మన ప్రగతిప్రయాణం నిరాటంకంగా కొనసాగడానికి భగవంతుడు తోడ్పడుగాత.





మన నూతన ప్రధాని

శ్రీమతి ఇందిరా గాంధీ



*నేడు ఒక జ్ఞాపకంగా మన మనస్సుల్లో మిగిలిపోయిన మహానాయకుడు*

**లాల్ బహదూర్ జీ**



నాయకత్రయం :

డా. రాధాకృష్ణన్, పండిత నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి



అక్టోబర్ నెలలో నాగార్జునసాగర్ కట్టడమువద్ద శ్రీ లాల్ బహాదూర్ శాస్త్రి.



జనవరి 12న శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి మృతదేహంతో జనసందోహం
శాంతివనం సమీపంలోని రుద్రవాటికను సమీపిస్తున్న దృశ్యం.

# మున్నాం

## సవ్యసాచి

అవి నా ట్రైనింగ్ రోజులు. నా విద్యార్థి జీవితమంతా మా అత్తగారి ఇంట్లోనే గడిపాను. ప్రత్యేకమైన అనుభవాలు నాకా రోజుల్లో కలగలేదు. అసలు అనుభవమంటే యేమిటో నా ట్రైనింగ్ జీవితంలోనే తెలుసుకున్నాను నా రెండేళ్ళ శిక్షణా జీవితంలోను మొదటి సంవత్సరం హాస్టలులోనే గడచిపోయింది. అప్పుడు నాది యాంత్రిక జీవనం క్రమశిక్షణ బలవంతంగా అతిక్రమించుకునే కాలమది

మొదటి సంవత్సరంలోనే మంగపతితో నేస్తం కుదిరింది. మంగపతి పొట్టివాడు. ప్రతిరోజూ తీవ్ర వ్యాయామము చేసేవాడు కండలు తిరిగిన అతడి శరీరం చూడ్డానికి భయంకరంగా వుండేది. ముఖం అదో నమూనాగా వుండేది. నాకు పాటలంటే చాలా ప్రీతి. నేనూ కాస్తో కూస్తో పాడగలను; ఆ అభిరుచే మాకు నేస్తాన్ని కుదిర్చింది

మంగపతిది అదే టౌను. స్కూల్ ఫైనల్ ప్యాసై ఉద్యోగాన్వేషణలో సంవత్సరాలు దొర్లిస్తున్నాడు. మా హాస్టలు టౌనకు చివరగా వున్నా, రోజూ నా దగ్గరకు వచ్చేవాడు. రోజూ పాడమని నన్నడిగేవాడు. పాడితే పాడేవాడిని లేకుంటే లేదు. ఆయే అతడిని అర్థం చేసుకోవాలని నే నెక్కువగా ప్రయత్నించలేదు. కనుక అతడిని గురించి ఏ విధమైన అభిప్రాయమూ నాలో కలగలేదు

మాకు వేసవి సెలవు లిచ్చారు. నన్ను సాగనంపడానికి ఆ రోజంతా నాతోనే వున్నాడు మంగపతి. నిజంగా మంగపతికి దూరంగా పోవడానికి నాకూ బాధగానే వుంది.

'మంగపతీ! నేను వచ్చేలోగా ఒక గది చూసి వుంచవోయ్' అని చెప్పాను. అతడు మూగగా తలవూపాడు. బస్సులో కూర్చున్న నాకు 'టా టా' చెబుతూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అతడిదెంత కఠినశరీరమో అంత సున్నితహృదయమని నాకనిపించింది.

నలభై రోజుల వేసవి సెలవులు మంగపతి తలపులతో అతని లేఖలతో గడిపేసి టౌను చేరుకున్నాను బస్ దిగగానే మంగపతి కనపడ్డాడు.

'హలో గురూ!' అని కౌగలించుకున్నాడు

హలో అంటూ 'మంగపతీ! కులాసా యేనా?' అని అడిగాను

'నా కేమిటోయ్! మనుషి కంటే ఒళ్ళు లావెక్కిందంటున్నారు పెద్దలు, అన్నాడు నవ్వుతూ.

నా పెట్టే బేడా అంతా వాళ్ళింటికే చేర్పించాడు. ఆ రోజంతా మంగపతి ఇంట్లోనే గడిపాను పాపం మంగపతి తల్లి స్కూల్లో స్వీపరు. ఆమె తన స్వల్ప వేతనంతో సాకుతూంది.

'మా అమ్మ ఈ వస్తాదుని మేపడానికి పడే శ్రమ అంతా ఇంతా కాదోయ్! ఏం చేసేది చెప్పు? ఎంత ప్రయత్నించినా ఉద్యోగమే దొరకదాయె!' అన్నాడు మంగపతి.

నాకు చాలా బాధ కలిగింది. వాళ్ళ గృహస్థితి నేను వర్ణించలేను కాని నా జీవితంలో అంత పేదవాళ్ళని యెప్పుడూ చూడలేదు ఆ నా డెలాగో గడిచి పోయింది. మరునాడు నే లేచే సరికి ఏడైంది. నా పెట్టే బేడాతోసహా మంగపతి కూడా కనిపించలేదు.

'బాబూ! అబ్బాయి నీకోసం యెక్కడో గది చూశాడు. దాంట్లో నీ సామాన్లన్నీ పెట్టడానికి పోయాడు నిన్ను స్నానం చేసి సిద్ధంగా వుండమన్నాడు,' అని వాళ్ళమ్మ చెప్పింది.

నేను స్నానాది కాలకృత్యాలు ముగించుకుని, క్రాపు దువ్వుకుంటూ కూర్చున్నాను ఇంతలో మంగపతి వచ్చాదు అతడు తెచ్చిన సైకిల్ మీదనే బయలుదేరాం

అది సిక్ వాకీ మంగపతి సైకిల్ స్పీడుగా తొక్కుతున్నాడు 'మంగపతీ! ఇదేమిటోయ్? తిరిగి తిరిగి ఈ వీధిలో చూశావేమోయ్?' అని అడిగాను

'ఔను యేం?' అన్నాడు.

నేను సమాధానమివ్వలేదు. ఒక చిన్న ఇంటిముందు సైకిల్ దిగాం మెయిన్ గేటు దాటగానే మా గది. రూం మాత్రం నేలగాదు. కరెంటు వసతైతే లేదు గాని శుభ్రంగా నాకు సరిపోయేలాగుంది. గది లోనే నా వెంకటేశ్వరస్వామి పటముంది అగరుబత్తులు దివ్యంగా వెల్గుతున్నయి

పగిలిన కొబ్బరిచక్కలు పున్నమి చంద్రుడిలాగా కనిపిస్తున్నయి. ఇదంతా మంగపతి పని అని నాకు తెలుసు.

"ఎలావుంది మన ఆరేంజిమెంటు," అన్నాడు మంగపతి.

"బ్రహ్మాండంగా ఉంది," అన్నాను

అంతలో ఇంటి యజమానురాలు వచ్చింది "నీవేనా బాబూ వుండేది, అని అడిగింది "ఔను," అన్నాను.

"బాబూ మేం పేదవాళ్ళం. అందుకే నీ కిచ్చిన గదికీ, మా గదులకూ మధ్యన

దర్వాజ పెట్టించడానికి నిర్లక్ష్యమైంది అందుకే తడక కట్టాము. యేమీ అను కోకు," అన్నది.

నే నా విషయం గమనించలేదు. తడక వైపు చూశాను. నాకు నవ్వొచ్చింది "ఫరవాలేదండీ!" అని వూరుకున్నాను

"బాబూ! ఇంటి కిరాయకుమాత్రం ఆలస్యం చేయరాదు," అన్నది.

"సరే," నన్నాను.

ఒక్కక్షణం ఆగి మళ్ళీ మొదలు పెట్టింది "బాబూ! నువ్వు పాలకూ పెరుగుకూ యెక్కడకూ పోకు. మన ఇంట్లోనే దొరుకుతాయి. మా బ్రతుకంతా మా గేదెలపైనే ఆయన చేసే పోలీసు పనికి యేం జీతం వస్తుందో చెప్పు ?" అని ముగించి వెళ్ళిపోయింది.

తన భర్త పోలీసని, వాళ్ళు పేద లనీ, పెరుగూ పాలవీ తన దగ్గరే కొన మనీ, ముఖ్యంగా అద్దె చక్కగా ఇచు కోవాలనీ చాలా సున్నితంగా చెప్పుకోవ డములోని ఆమె నేర్పు చూసి నాకు ఆశ్చర్యం వేసింది.

"మంగపతీ ! ఇంతకూ అద్దెం తన్నావ్?"—అని అడిగాను.

"పదిరూపాయలేనోయ్," అన్నాడు

నా కా ఇల్లు నచ్చింది. కాని ఒకచే బాధగా వుండేది. ఏమిటంటే మా ట్రైనింగ్ స్కూలు అక్కడికి చాలా దూరంలో వుంది. 8 గంటల స్కూలు కోసం 7 గంటలకే బయలుదేరాల్సి వచ్చేది మళ్ళీ ఐదుగంటలవరకుగాని ఇల్లు చేరేవాడినికాను. సాధారణంగా నేను వచ్చే వేళలో మంగపతి బుల్‌బుల్ సితార్‌పై పాటలు పాడుతూండేవాడు నాకు అలసట తోచేదికాదు. ఎంతటి విచారంలో ఉన్న మనిషినైనా నవ్వించ గలడు మంగపతి అది అతనిలో వున్న ఒక ప్రత్యేకత సాధారణంగా నా గది లోనే వుండేవాడు—నే నుండని వేళల్లో నా గదిలో ఉండేవాడో లేదోకాని, నే నుంటేమాత్రం నన్నొదిలి పోయేవాడు కాడు

అప్పటికి రెండు నెలలు గడిచాయి ఆ రెండు నెలల్లో మంగపతి నాకు సితారు నేర్పాడు. అప్పుడప్పుడు నేను సితారుపై పాటలు పాడుకొనేవాడిని. ఆ గది జీవితం అదొక ఆనందం కలిగించేది.

ఆనాడు ఆదివారం మంగపతీ నేనూ చదరంగం ఆటకు కూర్చున్నాము. ఆట పట్టుగా సాగుతూంది మంగపతి ఆటలో ఉద్రేకపడతాడు కనుక నే నాతనితో మనస్ఫూర్తిగా ఆడకపోయేవాడిని. దుర దృష్టవశాత్తు నేనే గెలిచాను. "ఛీ''— అంటూ కాయిన్సుని నేలకు కొట్టాడు.

అలాంటి పరిస్థితుల్లో నే నతడితో మాట్లాడకపోయేవాడిని. అతడే అనే వాడు "పెద్దప్లేయ రనుకోకోయ్. నిన్ను ఓడించేస్తానోలేదో చూడు!'' అని. కాని, అప్పుడు మాత్రం అలా అనలేదు. "మున్నా! కాసిని మంచినీళ్ళు పట్రా—"

అని కేకేశాడు. నే నాశ్చర్యంగా చూస్తూకంతా అయోమయంగా తోచింది. మళ్ళీ వుండిపోయాను. ఎవరో అందమైన యువతి నీళ్ళగ్లాసుతో మా గది ద్వారం గుండా ప్రవేశించి గ్లాసు క్రింద పెట్టింది.

మంగపతి ఒకసారి ఆమెను క్రింది వరకూ చూసి, నీళ్ళు త్రాగేశాడు గ్లాసు పుచ్చుకొని మున్నా వెళ్ళిపోయింది.

"అరె! ఈ అమ్మాయి ఎవరు? ఈతని కెలా తెలుసు," అని నా కనిపించింది. ఆనాడు సాయంత్రం మంగపతి చెప్పాడు. "ఏమోయ్! మున్నాను చూశావుగా! ఎలా ఉందనుకొంటావ్?" అన్నాడు

"చాలా బాగుంది,"—అన్నాను

"ఏరిఏరి ఆరూపు తీసుకోవడంలోని ఆంతర్యం మేమిటో అర్థమైందా."

"ఐంది"

"పీవు నా స్నేహితుడివి కనుక చెబుతున్నా. మా మధ్యన కలలోకూడా అడ్డు రాకూడదు. కఠినంగా చెబుతున్నందుకు క్షమించు.''

"అడ్డు వచ్చేంత అవివేకినా మంగపతీ." అన్నాను.

ఇక మంగపతి యేమీ మాట్లాడలేదు. అతడు మున్నాను ఎన్నాళ్ళుగా చూస్తున్నాడో, ఎన్నాళ్ళుగా ఆ కోరిక అతని మదిలో నిండివుందో యెవరికి తెలుసు! మున్నాకూడా మంగపతి అడగగానే నీళ్ళు తెచ్చిచ్చింది. అసలు సిక్కులు పరాయివాళ్ళకు కనిపించరు. ఐనా వీళ్ళ మధ్యన స్నేహం ఎలా కుదిరింది? నాకే అనిపించింది—'ఆ మాత్రానికే ఆమె మంగపతిని లవ్ చేసిందా?'— అని. వాళ్ళల్లోనూ చదువు సంస్కారాలు ఉన్నాయిగా అని అనుకొని సమాధానపడ్డాను. ఒకవేళ నా ఈ ఆలోచనే సరైనదైతే మంగపతి మోసపోతాడు. ఐనా నాకెందుకని ఊరుకొన్నాను

ఆ నెలంతా గడిచిపోయింది. ఒకటవ తారీకున నాకు స్టయిఫండ్ దొరికింది. ప్రతి వస్తుకీ మంగపతికి రెండు రూపాయలు టిప్సు ఇవ్వాలి. లేకుంటే అతడు మిత్రత్వపు హక్కులను వివరిస్తూ సమ్మె చేస్తాడు.

మంగపతీ నేనూ హోటలు కెళ్ళి తిరిగి వచ్చాం—మ్యాట్నీకి పోదామని పోరుపెట్టాడు. నా వొంట్లో అప్పే బాగ లేనందున అతడినే పొమ్మని డబ్బు ఇచ్చాను—వెళ్ళిపోయాడు. ఆ నాడంతా తలనొప్పితో బాధపడ్డాను. రాత్రి నిద్ర రాలేదు. తెల్లారేసరికి నా వొళ్ళు నాకు బరువుగా తోచింది. నన్ను నేను స్పర్శించుకొని చూస్తే శరీరం మండిపోతోంది. చాలా తీవ్రజ్వరం ఆవహించిందని అర్థమైంది ముఖం కడుక్కొని, కాఫీ తాగి వచ్చి పండుకొన్నాను. ఎంతసేపు నిద్రపోయానో నాకే తెలియదు. నేను లేచేసరికి చీకటి పడింది కడుపులో ఆకలి దహించివేస్తోంది. అన్నం తింటే జ్వరం తీవ్రమౌతుందని భయం. గదిలో



దీపం వెలిగించుకొని బజారుకెళ్ళి పళ్ళు తిని వచ్చి పడుకొన్నాను. నాన్న గురించి. క్లాసుమేట్సుని గురించి ఆలోచిస్తూంటే కునుకు పట్టింది ఎప్పుడు లేస్తున్నానో, యేం తింటున్నానో, యెప్పుడు పడుకుంటున్నానో-ఏమీ ధ్యాస లేదు. రెండు రోజులు గడిచాయి నా జ్వరం తీవ్రమైంది. లేవలేనంత బలహీనంగా తయారయ్యాను

నాన్నను జ్ఞాపకం చేసుకొని భోరున యేడ్చాను. ఆయనకు ఉత్తరం వ్రాయడానిక్కూడా నాలో శక్తిలేదు. నా మీద నాకే అసహ్యం వేసింది. కంటికి నిద్ర రాలేదు. జ్వరం భరించరాకుండా వుంది. ఏడుకొండలస్వామికి ఏడుస్తూ మొక్కుకున్నాను.

దాదాపు అది 12 గంటలవేళ. నా గది తలుపు లెవరో తట్టారు

"తోయండి" — అన్నాను, తలుపు తోసుకొని మున్నాయే వచ్చింది. నాకాశ్చర్యం వేసింది. మెల్లిగా "ఏం కావాలండీ?"- అన్నాను

"మీకు వొళ్ళు బాగా లేదనుకొంటాను." — అన్నది.

"ఔను మూడు రోజులుగా నాకు నేనే భారంగా ఉంటున్నాను," అన్నాను.

"మీ స్నేహితుడు రావడంలేదా ?"

నే నామెవైపు చూశాను తలుపు కొరిగి నిల్చున్నది. తలపైన కొంగు వేసుకున్నది. ఆమె విశాల నేత్రాలలో నే నాశించిన భావం ఏదీ కనిపించలేదు.

"ఆయన రా వ డ ం లేదండీ," అన్నాను.

"మూడు రోజులుగా మీరు నిరాహార మేనా ?"

"ఔను."

"పాలో, పండ్లో తీ సు కో లే క పోయారా ?"

"నేను లేవలేని స్థితిలో వున్నాను, ఎవరు తెస్తారు ?"

"పాలు మా ఇంట్లో దొరుకుతాయని మీకు తెలియదా ?"

నే నేమీ మాట్లాడలేదు. ఆమె వెళ్ళి పోయింది. నే నామె మంచితనం గూర్చి ఆలోచిస్తూ కళ్ళుమూసుకొన్నాను. పది నిముషాలు గడిచాయి.

"లేస్తారాండీ," అన్న మున్నా కంఠం వినిపించింది. కళ్ళు తెరిచాను నేను లేవలేను ఆ జ్వరం శత్రువులకూ్కడా రాకూడదు. నన్ను పూర్తిగా అశక్తుడిని చేసింది.

"ఎందుకూ?" అన్నాను

"పాలు త్రాగాలి," అన్నది

"ఇవ్వండి "

"పండుకొని త్రాగలేరు, కూడదు కూడా. లేవండి "

నా కళ్ళల్లో నీళ్ళు నిండాయి. "లేవ లేనండీ!" అన్నాను.

"లేవలేరూ! జ్వరం అంత తీవ్రంగా ఉందా?" అంటూ ఆమె నన్ను స్పృశించి. ఒకసారి 'అబ్బా!' అని ఊరుకొంది

"ఏమైందండీ?" అన్నాను.

"ఏంలేదండీ — మీ జ్వరం ఎక్కు వైంది. ముందునుంచే జాగ్రత్తపడితే బాగుండేది," అన్నది

"ఔను, నిజం!" అన్నాను

నా చేతులుపట్టి, వీపుపై చేయి ఆన్చి, లేపి కూర్చోబెట్టింది. ఏదో రెండు మాత్రలు మింగించింది. కాసిని మంచి నీళ్ళు గొంతులో పోసింది. వేడిపాలు త్రాగించింది. నేను దీర్ఘంగా ఆమెనే చూస్తున్నాను ఆమె అనన్యసంస్కా రానికి నా హృదయం వంగి సలాములు చేసింది నిర్మలమైన ఆమె ముఖంలో సచ్ఛీలం మూర్తీభవించిఉంది. ఆమె ముఖంలో నిర్మలత ప్రశాంతత తప్ప నా కళ్ళు ఏమీ చూడలేకపోయాయి

"కాసే పిలాగే కూర్చొని, తరువాత పడుకోం"డని చెప్పి వెళ్ళిపోయింది.

నాకు దూరమైన అమ్మ జ్ఞాపకం వచ్చింది. రెండు కన్నీటిబిందువులు రాలిపడ్డాయి ఒకఐదునిముషాల తర్వాత పడుకొన్నాను

మరునా డెనిమిది గంటల వేళ న న్నెవరో లేపారు. కళ్ళు తెరచి చూస్తే మున్నాయే కనిపించింది "ఎలా వుంది

జ్వరం?'' అని అడి గింది

నాకు నే నొక హిమాలయంలా తోచింది నిన్నటిలాగా మాట్లాడానికికూడా శక్తి లేదు. మూగగా కుడిచేయి ఆమె కందించాను. ఆమె నా చెయ్యిచూసి అదిరి పడ్డట్టుంది నా జ్వరంగురించి ఏదో మాట్లాడుతుం దనుకొన్నాను నే ననుకొన్నట్లుగా జరగలేదు,

''ముఖం కడుక్కుంటారా?'' అని అడిగింది మున్నా. నాకు నవ్వూ — బాధా రెండూ కలిగాయి.

"కడుక్కోవాలనే వుంది కాని..." అని ఆగాను.

మున్నా నన్ను లేపింది నాపై నిండుగా బ్లాంకెట్ కప్పింది. బ్రష్‌పై పేష్టుంచి బావిదగ్గరకు తీసికెళ్ళింది. నేను పళ్ళు తోముతూ కూర్చున్నాను. మున్నా వెళ్ళి వేడినీళ్ళు తీసుకొచ్చింది. ముఖం కడుక్కొని గది చేరుకున్నాను. ఒకసారి నా ముఖం అద్దంలో చూసుకున్నాను. అద్దం పగలగొట్టాలనిపించింది పెద్దగా పెరిగిన జుట్టు ముఖంమీద విచ్చలవిడిగా విహారము చేస్తోంది. కళ్ళు లోపలికి పోయి నాయి; ముఖమంతా ఈడ్చుకుపోయింది, మెల్లిగాజుట్టుదువ్వుకు పడకపై కొరిగాను

మున్నా మళ్ళీ పాలు తెస్తుందని నాకు తెలును. పాపం వాళ్ళు పేపలు నాకు పోసే అర్థశేరు పాలుమ్మకుంటే అరణా లొస్తాయి. పేదరికంలో వున్న ఔదార్యం మున్నాలో ఎలా భాసిస్తుందో నా కర్థం అయింది ముఖ్యంగా మున్నా ప్రవర్తనే నాకు విచిత్రంగా తోచింది అసలీ ఆడదానికింత ధైర్యం ఎలా కలిగిందా అని పించింది.ఇంతలో "పాలుతీసుకొండి"— అంటూ మున్నా రానే వచ్చింది నేను లేచి కూచున్నాను. పాలందుకున్నాను మున్నా వెళ్ళి తలుపు కొరిగి నిలబడింది. పలుచనైన మబ్బుచాటుకు జారుతున్న చంద్రబింబంలా ఆమె ముఖం ముసుగులో నిర్మలంగా ప్రకాశిస్తోంది. నేను పాలు త్రాగుతున్నాను — మున్నా అడిగింది. "ఏమండీ, ఇంత జబ్బుచేస్తే మీ అమ్మా నాన్నలకు జాబైనా వ్రాశారా"

''నా కమ్మ చిన్ననాడే దూరమైంది. నాన్న ఎప్పుడూ వూళ్ళో వుండడు —" అన్నాను.

"క్షమించండి, మీకు బాధ కలిగించా నేమో," అన్నది.

"లేదు" అని వూరుకున్నాను.

మున్నా సపర్యలతో 4,5 రోజులలో నా జ్వరం నయమైంది. ఆనాడు సోమవార మనుకుంటాను. నేను స్నానం అదీ ముగించుకు బడికి పోతున్నాను మెయిన్ గేటులో ప్రవేశిస్తున్న మున్నా "ఎక్కడికండీ?'' అని అడిగింది.

"స్కూలు కెళుతున్నాను—''అన్నాను

"వెళ్ళకండి," అని ఆదేశించినట్లుగా చెప్పింది

"కారణం?'' అన్నాను.

"అవి తరువాత చెబుతా,"నని లోనికి వెళ్ళిపోయింది

తిరిగి గదిలో కొచ్చి కూలబడ్డాను. టైం ఏడు ముప్పయి అయింది. మున్నా తల్లి పనులన్నీ హడావుడిగా చేసేస్తూంది. ఇంట్లో గిన్నెలచప్పుడు విపరీతంగా వినిపిస్తోంది. నాకు ఏమీ తోచలేదు. చిందర వందరగా పడివున్న పుస్తకాలన్నీ చక్కగా పెడుతూ కూర్చున్నా. ఇంతలో మున్నా తల్లి వచ్చింది.

"నమస్తే బాబూ! మీతో ఒక అవసరం ఉంది. మనం ఒకగేదెని కొన్నాం. ఒక ఇరవై రూపాయలు తక్కువై వున్నాయి. నీ దగ్గర డబ్బుంచే తప్పకుండా ఇస్తావని వచ్చాను,'' అన్నది. నా స్టయిఫండ్ డబ్బూ - ఇంటి డబ్బూ కలిసి నా దగ్గర యేభైరూపాయ లున్నాయి, కనుక లేవనలేకపోయాను.

ఇరవై రూపాయలు తీసుకొని సంతోషంగా వెళ్ళిపోయింది. మంగపతిని కలవాలని మనసు తొందర పెట్టింది. మున్నా నన్ను ఉండమని ఆదేశించింది. ఇంకొకగంట గడిస్తేనే గాని మున్నా తల్లి వెళ్ళిపోదు. అప్పుడుగాని మున్నా రాదు. మంగపతి ఇల్లు నా గదికి అట్టే దూరంలేదు. పది నిముషాల్లో వాళ్ళిల్లు చేరుకున్నాను. ఆయనతల్లి ఇంటిముందు ఊడుస్తోంది

"అమ్మా! మంగపతి వున్నాడా? వారం రోజులుగా కనిపించడం లేదేం?" అని అడిగాను.

"ఉన్నాడుబాబూ," అన్నది. ఆమె మాటల్లో నా కేదో అసాధారణత కనిపించింది. నేను లోనికి దారితీశాను.

"ఇప్పు డింట్లో లేదు బాబూ, చాలా సేపైంది వెళ్ళిపోయి. ఇంకా రాలేదు,'' అన్నది ఆయనతల్లి.

"రాగానే నే వచ్చాన్నానని చెప్పండి," అన్నాను.

"వా డిక నీ దగ్గరికి రాడు బాబూ."

"ఏం? మంగపతికి నా మీద కోపమొచ్చిందా? అస లేం జరిగిందమ్మా!"

"ఏమోబాబూ! నీ ముఖం చూస్తేనే పాప మంటాడు," అని ఊరుకుంది.

నామనస్సుకు చాలా బాధనిపించింది. నా ముఖం చూడరానంత పావం నే నేం చేశాను? అతడికి నామీద కోపం ఎందుకు కలిగిందో? ఇంకా ఏ వేవో ఆలోచనలతో మధనపడుతూ గదిలోకొచ్చి పడ్డాను.

కాసేపటికి మున్నా వచ్చింది "కూర్చో"మని కుర్చీచూపించాను. ఆమె కూర్చోలేదు. ఎప్పటిలాగే తలుపుకొరిగి నిల్చున్నది.

"స్కూలు కెళ్ళకుండా ఆపడంలో మీ ఉద్దేశ మేమిటి?'' అని అడిగాను.

"మీ కొచ్చింది మామూలు జ్వరం కాదు తగ్గిందికదా అని బయట తిరుగుతే ప్రమాదం. ఇంకొక రెండు రోజుల వరకు విశ్రాంతి అవసరం," అని చెప్పింది.

"మీరు డాక్టర్ చదువుతే బాగుండే



దేమో," అన్నాను నవ్వుతూ. ఆమె నవ్వి వూరుకున్నది. వెళ్ళిపోతుం దనుకున్నాను

కాని అలా జరగలేదు. రెండు నిముషాల పాటు గది నిశ్శబ్దంగావుంది. నేను

ఉండబట్టలేక అడిగాను — "ఏదైనా పనుండి వచ్చారా" అని.

"[illegible]" అన్నాను [illegible]స్తూ

చిన్నగా నవ్వుతూ "మంగపతిని రమ్మంటారా?'' అని అడిగాను.

''ఎందుకూ?''

''మీ కాయన స్నేహితుడు కదా! అందుకు.''

''మీలాంటి అమాయకులు తప్ప అలాంటి పశువుల్తో ఎవరు స్నేహం చేస్తారు?" అన్నది కఠినంగా.

నా కమితాశ్చర్యం వేసింది. "ఏమి టంటున్నారు?" అన్నాను.

"ఆయన శరీరంలాగే ఆయన మనసు కూడా ఒక కఠినశిల. ఆడదంటే ఆయన ఉద్దేశ మేమిటో నేను వివరించలేను. ఆయన ప్రతిరోజూ చేసే గలాటాకు పాడే ప్రేమగీతాలకూ అంతూ పంతూ లేదు. నా కాయనంటేనే ఒళ్ళుమంట."

"ఐతే మంగపతి అంటే మీకు ద్వేషమా?"

"ద్వేషం కాక పోయినా పరమ అసహ్యం. రోజుకు పదిసార్లయినా నా చేతినుంచి నీళ్లు త్రాగేవాడు; అందించ లేక చచ్చేదాన్ని. మా అమ్మ చాలై వప్పుడల్లా 'మున్నా! మంచినీళ్ళు' అని కేకేశేవాడు ఛీ, ఆ పశువును గురించి ఆలోచించడమే నేరం." అని ఊరు కున్నది మున్నా

నా కంతా అర్థమైంది నే ననుకొన్న ట్లుగా మంగపతి మోసపోయాడు. ఏదో అఘాయిత్యం చేయబోతే మంచిబుద్ధి చెప్పమంటుంది మున్నా

"పోనీండి. మీ [illegible] ఏమీ [illegible] చెప్పారుకాదు."

"అబ్బే ఏంలేదు." అంటూ బిరబిరా వెళ్ళిపోయింది

ఆ రోజంతా ఫ్రెండ్సుకు, బంధువులకు ఉత్తరాలు వ్రాస్తూ గడిపాను సాయంత్రం ఆరుగంటలవేళకు మున్నా తల్లి నా గదికి వచ్చింది. "హోటలు కెళ్ళకు బాబూ? భోజనం తయారైంది." అని చెప్పి వెళ్ళిపోయింది.

నేను డబ్బిచ్చినందుకుగాను ఆమె చేసే సత్కారం ఇది. ఎనిమిదిగంటలకు మున్నా వచ్చి భోజనానికి తీసుకెళ్ళింది.

వాళ్ళ వంటఇల్లు ఎంత చిన్నదైనా ఎంతోఅందంగా కనిపిస్తూంది అమర్పులోని నేర్పు నాకు చాలా నచ్చింది. నిశ్శబ్దంగా కూర్చున్నాను.

''బాబూ! మీరు బ్రాహ్మలు. కను కనే ఇంట్లోకి రానిచ్చాను. ఇంకొకరైతే గడప తొక్కనీయను మాకు బ్రాహ్మ డంటే చాలాభక్తి.'' అని చెప్పుకుంది వాళ్ళ అమ్మ.

సయించినంతవరకు తినివచ్చి గదిలో పడాను. తొందరగానే నిద్రపట్టింది.

ఉదయం ఎనిమిదిన్నరకి మెలకువ వచ్చింది బడివేళ దాటినందుకు విచారం కలిగింది మధ్యాహ్నం పోతే సరి అని ఊరుకున్నాను

స్నానం అదీ అరగంటలో ముగించి స్వామికి అగరువత్తులు వెలిగించాను. నాకు సరియైన ఆరోగ్యం ప్రసాదించిన స్వామి చరణాలకు హృదయాంజలు అర్పించాను చివరసారిగా నమస్కరించి వెనుదిరిగాను

తలవంచి, కళ్ళుమూసుకొని అంజలి ఘటించిన మున్నామూర్తి కనిపించింది. ఏ మహాశిల్పి మలచిన దివ్యసుందర విగ్రహమో అనిపించింది.

ఆమె కళ్ళు విప్పింది. నా చూపులు ఆమెపైనుంచి మరలిపోయినయి.

"మీరు చాలా మంచివారండీ,'' అన్నది మున్నా.

ఎందుకో ఏమో అర్థమవలేదు. ఎందుకూ అని నే నడగలేదు.

"మీరు ప్రతిరోజూ శ్లోకాలు చదువుతారు. ఈ వేళ మానేశారేం?'' అని అడిగింది.

"మనసులో చదువుకున్నాను.''

"నాకు మీ నోట జారే ప్రతి పదం వినా లనిపిస్తుంది,'' అన్నది.

"ఉహుఁ!'' అన్నాను మున్నా మాటలతీరు నాలో సంభ్రమాశ్చర్యాలను కలిగిస్తూనేవున్నాయి.

"మీ రేమీ అనుకోనిపక్షంలో ఒక పాట పాడండి,'' అని అడిగింది

"తప్పదా?" అన్నాను.

''ఉహూఁ! '

నాకు వచ్చిన పాటేదో పాడేశాను. అర్ధముకుళిత నేత్రాలతో తన్మయంగా విన్నది మున్నా.

"మీరు పాడుతుంటే నన్ను నేనే మరచిపోతానండి'' అన్నది. ఆమెలో పొంగే ఆనందావేశాలు నాలో తెలియని భయాన్ని కలిగించాయి.

"మీ ధోరణి నా కేం అర్థం కావడం లేదు," అన్నాను.

"మగవాడిలోవున్న లోపమే అది," అని బిరబిరా వెళ్ళిపోయింది. అప్పటికి మున్నా ఆంతర్యం యేమిటో నా కర్థమైంది. ఐనా ఈవిడ విడమర్చి చెప్పక చిక్కులో పెట్టిందే అనిపించింది. ఇన్ని రోజులుగా ఏ భావనా లేకుండా నిర్మలంగా వున్న నా మనసులో ఏదో భావం ప్రవేశించి గిలిగింతలు పెట్టింది. నేను పొరపడుతున్నానా? నేను చేసేది నేరమా? ఆమెను, ఆమె మాటలను తప్పుగా అర్థం చేసుకున్నానా? నాలో కాసేపు ఆత్మ విమర్శ జరిగింది నేనే గెలిచాను. మున్నా నాదే అన్న భావం నాలో దృఢపడింది. ఆమె పలికిన పలుకులు చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటే ఆమె తియ్యని సాన్నిహిత్యపు టనుభూతులు నన్ను పరవశుడిని చేశాయి. నన్ను నేనే మరచిపోయాను. ఆనాడు నా ఆనందానికి అవధులే లేవు మున్నా లాంటి విశాలహృదయం గల మనిషి నాకు ప్రపంచమంతా గాలించినా దొరకుతుందా ఆమె సుందర వదనంలోని

నిర్మలత చంద్రుడిలో గూడా కనిపిస్తుందా? అసాధ్యం... ఆనాడంతా నేను అత్యాశ్చర్యంగా అనుభవించాను.

మళ్ళీ తెల్లవారాలి. ఎప్పుడు రావాలి! మున్నా రావాలి; ఆమె హృదయంపై వాలిపోవాలి. నన్ను బ్రతికించిన మున్నా సహృదయంలో పూర్తిగా నిండిపోవాలి. నాకు నిముషం యుగంగా తోచింది. అతి కష్టంగా ఆ రాత్రి కరగిపోయింది.

పాలు తీసుకొని మున్నా తల్లి వెళ్ళిపోయింది. ఇక మున్నా వస్తుంది. నాలో ఉత్సాహం పొంగిపోయింది. మున్నా రావడానికి ఎక్కువకాలం పట్టలేదు. నిశ్శబ్దంగా వచ్చి తన స్థానంలో నిలబడింది.

మళ్ళీ అదే స్థలం. అలాగే తలపైనున్న పైట. అదే అంగకవళిక. నిజంగా మున్నా సౌందర్యరాసి. ఆనాడు నాకు తెలియకుండానే ఆమెను కలయజూశాను. అప్రయత్నంగానే ...... "మున్నా" అని పిలిచాను.

మున్నా "ఊఁ," అంది.

"నా పొరపాటు నా కర్థమైంది మున్నా," అన్నాను.

"ఐతే నా బ్రతుకు ధన్యమైంది," అన్నది.

అది నా బ్రతుకుచరిత్రలో చెదిరిపోని సంఘటన. ఆరోజునే మున్నా విశాల నేత్రాలలో నన్ను చూసుకున్నాను. ఆనంద పులకితయై ఆమె రాల్చిన బాష్పాలు బుగ్గలపై జారుతూంటే నా హస్తాలతో తుడిచివేశాను. ఆనాడే నాకు మున్నా చల్లనిహృదయంలో సంపూర్ణ స్థానం లభించింది. ఆమె నిర్మల స్వర్గలో ఆనందం ఆనాడే లభించింది.

ఆనాడు నేను పరవశించి పాడాను. మున్నా మైమరచి ఆడింది. నాకు ఆశ్చర్యమేసింది. మున్నా సంస్కారవతియే గాక కళావతి. నా భాగ్యానికి గర్వపడ్డాను.

నా కెందుకో తీవ్రంగా దగ్గుపోట వచ్చింది. దగ్గుతూ పడకపై కూలబడ్డాను. మున్నా ఆత్రంగా నన్ను చేరింది. గొంతుపై స్పర్శించింది. గ్లాసెడు నీళ్ళు త్రాగించింది. మున్నా నా పడకపక్క నిలబడివుంది. చేయిబట్టి కూచోబెట్టాను. హఠాత్తుగా నామీద వాలింది. నన్ను మ్రింగేలా చూసింది.

"ఏమిటి మున్నా! అలాచూస్తున్నావ్?" అన్నాను

"నన్ను నేను చూసుకుంటున్నాను," అన్నది.

నాకు మున్నా భావం అర్థమైంది. ఏమీ మాట్లాడకుండా వూరుకున్నాను. ఇంకా ఆమె చూపులు నాపైనుంచి మరల్చలేదు, నాకే సిగ్గనిపించింది. నేను కిటికీలో గుండా మల్లెపందిరిపైకి దృష్టి మళ్ళించాను. మున్నా నాగడ్డంపట్టి నాముఖాన్ని తనవైపు త్రిప్పుకుంది.

"ఏమిటి మున్నా!" అని అడిగాను.

"నా నోరు మూగవోయింది. నాకళ్ళతో చెబుతా వినండి." అన్నది.

"నాకా శక్తి లేదేమో!" అన్నాను

నవ్వి ఊరుకున్నది. మున్నాతో ఏవేవో మాట్లాడాలని మనసు ఆత్రపడుతున్నది. కాని యేమీ మాట్లాడలేకపోతున్నాను. కొద్దిసేపట్లో మున్నా పలకరించింది—

"ఏమండీ! నాకు మీలో స్థానం వుందా? నిజంగా చెప్పండి," అని.

"మున్నా! పరిహాస మాడుతున్నావా? నా సర్వస్వాన్నీ దోచి పైగా నాలో చోటుందా అని అడుగుతావేం—" అన్నాను.

మున్నా పరవశించిపోయింది ప్రేమామృతపరిష్వంగనంలో నన్ను పరవశింప చేసింది ఒక అరక్షణం అలాగే ఉండిపోయాం.

బయట యెవరో తలుపు తట్టారు. మున్నా భయంగా వెళ్ళిపోయింది. నేను చూస్తూవుండిపోయాను.

"మున్నా!" అని బయటినుంచి కేక వినిపించింది. ఆ కంఠం మున్నా తల్లిది మున్నా తలుపు తీసింది. వాళ్ళు లోనికి వెళ్ళిపోయారు. నామనసు కుదుటపడింది.

ఆనాడు నాకు బడిపై రోతకల్గింది. ఇంట్లోంచి బయటకైనా పోలేదు. కాలం వేగంగా ఎదుస్తున్నట్టు తోచేది. ఆ నెలంతా నేను శిక్షణాలయానికి పోలేదు. నాకు స్టయిపండ్ రాదని తెలుసు. డబ్బు కోసం నాన్నకు ఉత్తరం వ్రాశాను. డబ్బు వస్తుందని నాకు తెలుసు. నేను శిక్షణాలయాన్ని మాని మున్నాతో కాలం



గడపడం భవిష్యజ్జీవనానికి పునాదియైన అని నాకు తెలుసు. కాని నేనామెను విడిచి ఉండలేకపోయాను. మున్నా ప్రతిరోజూ స్కూలుకెళ్ళమని పోరుపెట్టేది. స్కూలు పేరుతో ఒకగంట ఆమెతో తిరిగి గది చేరేవాడిని. మున్నా నన్ను గాఢంగా విశ్వసిస్తోంది. నేను చెప్పిందల్లా నిజమనుకుంటోంది. కనుక నన్నవమానించలేదు ఆ నెలరోజులలో మా మధ్యన పెరిగిన ప్రేమ అనిర్వచనీయం మమతా అనురాగాలకు ప్రతిరూపాలుగా పూవుకు తావిలాగా మెదులుతూన్నాం

ఆనాడు శనివారం. నాన్న పంపిన యం. వో. అందింది. ఆ రోజు నాకు ఘాతవరం, కనుక ఉదయాన్నే దేవుడికి కొబ్బరికాయ కొట్టాను. దేవుడిప్రసాదం మున్నాకొరకు దాచివుంచాను. ఎనిమిది గంటల వేళకి మున్నా వచ్చింది దయామయుడైన స్వామికి నమస్కరించి ప్రసాదం స్వీకరించింది ఒకరి ప్రక్క ఒకరం నిలచి స్వామికి నమస్కరించాం. దేవుడు మమ్మల్ని దీవించినాడను కున్నాం......

మున్నా రోజూలాగా నా ప్రక్కన కూర్చున్నది. తీయని కబుర్లేవో చెబుతూంది. నా మనసానాడు నాన్నవైపు మరలింది. ఆయన దొక విషాద జీవితం. ఆయనకు డబ్బుకొరకు ఉత్తరం వ్రాసినందుకు నా మన సెంతగానో మధన పడింది.

'మున్నాకు విసుగనిపించిందో ఏమో!, "ఏమండీ, ఈవేళ పరధ్యానంగా వున్నారేం?" అని అడిగింది

మున్నా ముందు దాపరిక మేముంది? అంతా చెప్పాను పడకమీదినుండి లేచి కిటికీ దగ్గర నిల్చున్నాను. మల్లెపందిరికి ఇవ్వాళ ఒక్కపువ్వైనాలేదు. బహూశా మున్నా తెంపుకొని ఉంటుందనుకొన్నాను. నాన్న తలపులు మనసునుంచి మరల్చాలని యత్నించాను. కాని నాకు సాధ్యంకాలేదు. ఆయన మూర్తి నా కళ్ళ ముందు దీనంగా కదలిన ట్లన్పించింది నా కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

మున్నా నా భుజంమీద చేయివేసి నన్ను తనవైపు మరల్చుకుంది. నా కన్నీళ్ళు ఆమె కంట పడకూడ దనుకున్నాను. కాని తప్పలేదు.

"మీరు ఎందుకో తీవ్రంగా బాధపడుతున్నారు. నా ముం దేమో దాస్తున్నారు. చెప్పండి, నిజం చెప్పండి," అన్నది మున్నా.

"మున్నా మా నాన్న అసౌఖ్య జీవనం, ఆయన దైన్యం తలపుకు వచ్చింది. అందుకే కన్నీళ్ళువచ్చాయి," అన్నాను.

"మున్నా!" పెద్ద పిడుగుపాటులా ఎవరో అరిచారు.

ఇద్దరం మదరికిటికీలోంచి చూశాం. మున్నా తల్లి అగ్నినేత్రాలతో మమల్ని చూస్తూంది. నాకు ముచ్చెమట్లు పోశాయి.

మున్నా గబగబ నడుస్తూ గదిదాటింది. వాళ్ళు వెళ్ళిపోయారు. నేనా గదిలో ఉండలేకపోయాను. తొందరగా బయట పడ్డాను. ప్రతిరోజూ పదకొండుగంటలకు వచ్చే మున్నాతల్లి ఈవేళ ఇరవై నిమిషాల్లో తిరిగివచ్చింది' విధి మూపై కసి చూపు చూసింది ఇక నేనా గదిలో ఉండలేను. మున్నా నా కళ్ళకు కనిపించదు. అసలు మున్నా లేకుండా నేను బ్రతకడమే అసంభవం.

పిచ్చివాడిలాగా టౌనంతా తిరిగాను. సాయంత్రంవేళ పార్కుకి చేరాను. ఏవేవో ఆలోచనలు మనసును కలవర పెడుతూ వుంటే ఓర్చలేకపోయాను. బాధ గా తోచింది. సిగరెట్టుపెట్టె తెచ్చుకొన్నాను. తొమ్మిదిగంటలవరకు పార్కులోనే గడిపి భయం భయంగా యింటిదారిపట్టాను.

తలుపులు తీసేవున్నాయి. మెల్లిగా పిల్లిలా గదిలో దూరి తలుపులు దగ్గరగ వేశాను. పడకపైబడి రగ్గు తన్ని పండుకున్నాను. ఎంత కళ్ళు మూసుకున్నా నిద్రరాలేదు. కాలం బరువుగా నడుస్తూంది. వున్నకొద్దీ సిగరెట్లు అయిపోయాయి. పిచ్చిలేచినట్లుగా అనిపించింది. టౌను పోలీస్టేషన్‌లో 12 గంటలు కొట్టారు. నా కళ్ళు మండుతున్నాయి. ఆకలి దహించి వేస్తూంది. చాలా నీరసంగా వుంది.

పది నిమిషాలు గడిచాయి. ఎవరో నా తలుపు తోసుకొని లోపలి కొచ్చారు. నాకు మున్నావాళ్ళ నాన్నేమో అని భయంవేసింది. కాని. ఒక్క క్షణంలో. వచ్చింది మున్నాయే అని గమనించాను. నా భయాశ్చర్యాలకు అంతులేదు.

"మున్నా." అన్నాను మెల్లిగా

"ఉష్," అన్నది.

ఇక నే నేమీ మాట్లాడ లేదు. నా చెయ్యి పుచ్చుకొని మెయిన్‌గేటు దాటించింది. రోడ్‌పైకి తీసుకొచ్చింది.

"ఏమి టిది మున్నా! ఈ అర్ధరాత్రి వేళ ఎంత సాహసించావ్. మీ అమ్మ చూస్తే ఇంకేమైనా వుందా," అన్నాను,

"ఏం ఫరవా లేదు. మీకు చెప్పాల్సింది చాలావుంది. అందుకే వచ్చాను," అంది —

"ఏమి టదీ?" అన్నాను.

"తెల్లవారకుండానే మీరువెళ్ళిపొండి; లేకుంటే మీకు చాలా ప్రమాదం జరుగుతుంది. ఈ పాపిష్టిదాని మూలంగా మీకు యే బాధా కలుగరాదు. తప్పకుండా వెళ్ళిపొండి,'' అని ఇంటిదారి పట్టింది.

"మున్నా!" నేను గట్టిగా అరిచాను. వెనుదిరిగి చూసింది.

"మున్నా! న న్నెంతో నిష్కర్షగా వెళ్ళమంటున్నావు! నిన్ను విడచి బ్రతకడం నా కెంత కష్టమో నీకుతెలియదా? నా కే ప్రమాదం జరిగినా ఎదిరిస్తాను. మనిద్దరికీ అంగీకారమైన తరవాత యే శాస్త్రమూ అడ్డగించలేదు," అన్నాను.

"మీ పాదాలు పట్టుకుంటాను; మీరు

వెళ్ళిపోండి. లేకుంటే రేపు ఉదయమే మిమ్మల్ని గురుపీఠానికి తీసుకుపోతారు. మీ నేరానికి ఏదో శిక్ష విధిస్తారు," అని వెక్కి వెక్కి ఏడ్చింది మున్నా.

"మున్నా! మనం చేసింది నేరం కాదు అది మనం పెద్ద మనుష్యుల మధ్యన ఒప్పించలేమా?" అన్నాను ఆవేశంగా.

"మీరు అమాయకులు. నన్ను ఇంట్లో బంధించిగాని మిమ్మల్ని గురుపీఠానికి తీసుకుపోరు. మీకు నే నెక్కువగా వివరించలేను. మీరు తప్పకుండా వెళ్ళిపోండి."

"పోలేను మున్నా! నీకు దూరమై పొందే బాధకన్నా, రేపు నాకు విధించే శిక్ష హాయిగా వుంటుంది" అన్నాను.

హఠాత్తుగా మున్నా నా కాళ్ళమీద పడింది. ఆమె కన్నీళ్ళు నా పాదాల మీద రాల్తున్నాయి. నాకు భరించరాని దుఃఖం వచ్చింది. మున్నాను లేవనెత్తాను. మున్నా నా ముఖంకేసి చూసింది. ఒక నాడు ఆనందబాష్పాలతో నిండిన నయనాలు ఇప్పుడు బాధాశ్రువుల్ని వర్షిస్తున్నాయి.

మున్నా మొదలు పెట్టింది: "మీరు పసివాడిలా పట్టుపట్టక వెళ్ళిపోండి. మీ పిదపక్షపాతానం యేమైంది. మా ఇంట్లో మీ కింకా స్థానం వుందని యెందు కనుకుంటున్నారు," అని అడిగింది.

నా గుండెల్లో బండలు వర్షించినట్లు తోచింది. పొంగే దుఃఖం కళ్ళని పగలగొట్టి బయటపడుతుందేమో ననిపించింది. దుఃఖం దిగమ్రింగుతూ "నీ ఒడిలోనే ప్రాణా లొదలాలని కోరికగా వుంది మున్నా," అన్నాను.

మున్నా నాపై వ్రాలి భోరున ఏడుస్తూ అన్నది— "మీరు వెళ్ళిపోని పక్షంలో – కొన్ని గంటల్లో నా శవాన్ని చూడక తప్పదు," అని.

"మున్నా!" అని గట్టిగా అరిచాను. నాలో ఏదో బలవంతమైన ఆవేదన ఆవేశంతో మిళితమై బయటపడింది నా ధ్వని వీధిలో ప్రతిధ్వనించింది. మున్నా ఏడుస్తూ లోని కురికింది. "మున్నా!" అని మళ్ళీ అరిచాను. ద్వారం మూస్తున్న మున్నా చేతులెత్తి నమస్కరించింది. ఒకేసారి కరెంటుదీపాలు ఆరిపోయాయి. మున్నా ముఖం నా కగుపించలేదు – దుఃఖాన్ని నిగ్రహించుకోలేకపోయాను. నోటినుంచి గద్గదస్వరం – కళ్ళనుండి అనంత అశ్రుధార –

ఆ చీకటిలో – చుక్కల గుడ్డివెలుగులో నాదొక మహాప్రయాణం...






అది 1576వ సంవత్సరంలో ఫాల్గుణమాసపు ప్రథమదినం. మేవాడ్ రాజ్యపు కొండల్లోని సూర్యమహల్‌దుర్గంలో అంతా కోలాహలంగా వున్నది. సూర్యోదయం అవుతూనే, నూర్గురు ఆశ్వికులు బల్లెములు చేతబట్టి కొండపైనున్న దుర్గం నుంచి కిందికి దిగారు. వాళ్ళకు ముందుగా ఒక ఉత్తమాశ్వంమీద దుర్గాధిపతి అయిన దుర్జయసింగు వున్నాడు. అతడు రాజపుత్రుల్లో చోండావత్ వంశానికి

చెందినవాడు. అతడు దీక్ష చేసి, కళ్ళు మూసుకున్నా నిప్పుకణికల్లా అన్నివేళలా మెరుస్తూంటవి అతడు కుప్పయిపేంట్ల కనుకున్నాడు

వేటకు బయలుదేరిన దుర్జయసింగు తన అనుచరులతో అరణ్యం చేరాడు మృగాల వునికి తెలుసుకువచ్చేందుకు ముందుగా వెళ్ళిన రౌతులు కొందరు అటు క్రింద అలసి ఎదురుపడ్డా. ఆ ప్రాంతాల ఎక్కడా వేటాడదగిన జంతువు లేదని అతడికి తెలియపరిచారు. దుర్జయసింగు తన అనుచరులను అరణ్యంలోపలికి తన వెంట రావలిసిందిగా హెచ్చరించి, కొంతదూరం పోయిన తరివాత, వాళ్ళను జట్లుజట్లుగా అన్నివైపులకూ పంపాడు.

దుర్జయసింగు తన అమాత్యుణ్ణి, కొద్దిమంది అనుచరులనూ తోడు తీసుకుని మహారణ్యంలో చాలాదూరం పయనించాడు కొంతసేపటికి వారొక మైదానప్రదేశాన్ని చేరారు ఎదురుగా ఒక కొండమీద వారి కొక దుర్గం కనిపించింది. దుర్జయసింగు ఆ దుర్గాన్ని తన అమాత్యుడికి చూపుతూ; "అది, పహాడ్‌జీభూమిజా స్వాధీనంలోని దుర్గమే కదా?" అని ప్రశ్నించాడు.

"అవును' ఇలాంటి బలీయమైన దుర్గం బైరాగుల్లో బతికే భూమిజాలకిందకాక చోండాపతుల స్వాధీనంలో వుంటే, మహారాణా ప్రతాపసింహులకు యుద్ధసమయంలో ఎంతో ఉపకరించేది," అన్నాడు అమాత్యుడు.

"భూమిజాలు యుద్ధకౌశలం తెలియనివా రన్నమాట నిజమే. కాని, తమ దుర్గాలనూ, భూములనూ రక్షించుకునేందుకు వారు శత్రువులతో తెగించి పోరాడేందుకు వెనుదీయరు,'' అన్నాడు దుర్జయసింగు

"అదీ కొంతనిజమే. ఏమైనా భూమిజాలు బల్లెం పట్టటంలో కన్న, నాగలి పట్టటంలో నేర్పరులు," అన్నాడు అమాత్యుడు.

అమాత్యుడి మాటలకు దుర్జయసింగుతో పాటు, అనుచరులుకూడా పెద్దగా నవ్వారు. ఆ తరవాత అందరూ గతసంవత్సరం తమకు అడవిపందులు కనిపించిన కొండగుహలూ, రాళ్ళగుట్టలూ, ముళ్ళపొదలూ వెతకసాగారు.

రెండుజాముల పొద్దెక్కింది కాని, వారికి అడవిపంది ఒక్కటైనా కనిపించలేదు. ఆసరికి గుర్రాలూ, రౌతులూ కూడా బాగా డస్సిపోయారు. దుర్జయసింగు ఒక సెలయేటి దగ్గిరకు దారితీసి గుర్రం దిగాడు. అతడి అనుచరులుకూడా గుర్రాలు దిగారు అందరూ సెలయేటిలో కాళ్ళూ చేతులూ కడుగుకుని కొంత సేద దీరినతరవాత, పండ్లూ ఫలాలూ తీసుకురాబడినవి దుర్జయసింగు ఆచారంప్రకారం, తన అనుచరులలో ముఖ్యులైనవారికి తన పత్రంనుంచి ఫలాలు పంచియిచ్చాడు.

ఫలహారం చేస్తూ అందరూ ఆ కబుర్లూ యీకబుర్లూ చెప్పుకోసాగారు. దుర్జయ సింగు వెంటవున్నవా రందరూ లోగడ అనేక యుద్ధాల్లో పాల్గొన్న సైనికులు. మాటలసందర్భంలో వాళ్ళు, ఆ యుద్ధ విషయాలు ముచ్చటించుతూ, తాము శత్రు దుర్గ ప్రాకారాలను ఎలా లంఘించినదీ, శత్రువులను ఎలా వధించినదీ, సాంబ్రాధి పుడు తమ నెలా మెచ్చుకున్నదీ, మహారాణాప్రతాప్ స్వయంగా తమపరాక్రమాన్ని పొగుడుతూ అన్నమాటలూ చెప్పుకోసాగారు.

"మేవాడ్‌రాజ్యానికి యిప్పుడు శత్రువు లెక్కువయారు మార్వాడ్, బికానీర్. బుందీ సంస్థానాధీశులందరూ ఢిల్లీపాదుషాపక్షం చేరి, మేవాడ్‌ను జయించేందుకు వస్తున్నారు అయినా మహారాణాకు జయం తప్పదు. ఒక వేళ పరాజయమే ప్రాప్తిస్తే చోండావతులు యుద్ధరంగంలో మరణిస్తారుగాని, వెన్నుచూపి పారిపోరు." అన్నాడు దుర్జయసింగు అతడి మాటలకు అనుచరులందరూ సంతోషించి, అతణ్ణి ప్రశంసించారు.

దుర్జయసింగు కొంచెంసేపు మౌనం వహించి, తరవాత తన అనుచరులందరినీ కలయచూస్తూ, "ఎనిమిదిసంవత్సరాలక్రితం అక్బరుపాదుషా చితోడ్‌దుర్గాన్ని ముట్టడించినప్పుడు రాణా ఉదయసింగు పారిపోయినా, సాంబ్రాధిపతి అయిన షాహీదాసుమాత్రం దుర్గద్వారం విడువలేదు.'' అంటూ అనుచరుల్లో ఒకరికేసి చూసి, "చారణదేవా ! ఏదీ, ఆ యుద్ధగీతం ఒకసారి పాడు. చోండావతుల పరాక్రమం ఎటువంటిదో వినాలనివున్నది," అన్నాడు.

చారణులు రాజపుత్రుల శౌర్య పరాక్రమాలనుగురించి వీరగీతాలు పాడేకవులు. దుర్జయసింగు కోరగానే చారణుడు ఆనాటి చితోడ్‌దుర్గంకోసం జరిగిన యుద్ధాన్ని గురించి వీరగీతం పాడసాగాడు

చోండావత్ నాయకుడైన షాహీదాసు తన బంధుమిత్రులతో చితోడ్ దుర్గంలోని సూర్యద్వారాన్ని కాపాడుతూ, వేలసంఖ్యలో వున్న మొగలు బలాలను ఊచకోత కోశాడు కాని, మొగలులు అపారబలంతో వచ్చినవారు కావటంతో, కొంతసేపు పోరు జరిగినతరవాత, షాహీదాసువెంట వున్న చోండావతు లొకరొకరే నేల కొరిగారు. చివరకు షాహీదాసూ, దుర్జయసింగూ పక్కపక్కల నిలబడి మొగలు వాహినిని చాలాసేపు నిలపగలిగారు. దుర్జయసింగు నొసటిమీద బలమైన కత్తిదెబ్బ తిని, కిందపడిపోయాడు. అయినా, షాహీదాసు ఒంటరిగా పోరుతూ ద్వారంముందే వీరస్వర్గం అలంకరించాడు.

ఈ గీతం వింటూన్న చోండావతుల నేత్రాలు ధగధగ మెరవసాగినై. చారణుడు

పాట ముగించగానే అందరూ ఒక్కుమ్మడిగా సింహనాదం చేశారు.

దుర్జయసింగు తన అనుచరులతో, "యోధులారా! మన రాజ్యానికి యివి దుర్దినాలు. కాని, చోండావతులు ఆపద ఎరుగనివాళ్ళుకారు మనకు చితోడ్‌దుర్గం లేక పోయినా, పర్వతాలూ, గుహలూ వున్నవి. రాణా ఉదయసింగు మరణించినా, వారి పుత్రుడు రాణా ప్రతాప్‌సింగ్ పట్టుదలగా మొగలులతో యుద్ధం చేస్తున్నారు. వారికి జయమగుగాక! శిసోదియా వంశానికి జయమగుగాక! చోండావతులు సర్వదా విజయు లగుదురుగాక!" అన్నాడు

ఆ తర్వాత అశ్వికు లందరూ లేచి, తమతమ వాహనా లెక్కి వేటకు బయలు దేరారు కొంచెంసేపటికి వారికి ఒకపొదలో పెద్ద అడవిపంది ఒకటి కనిపించింది. అశ్వికులు దాని ఎత్తూ, బలమైనకోరలూ చూసి ఉత్సాహంగా ఒక కేకపెట్టి, దానిమీదికి గుర్రాలను దూకించారు పంది ఒక్క ఎగురున పొదలోనుంచి బయటపడి గుబురు చెట్లకేసి పరిగెత్తింది. అశ్వికులు దానివెంట పడ్డారు.

అడవిపంది అరణ్యంలో చాలాదూరం పరిగెత్తి, అశ్వికులు అన్నివైపులనుంచీ చుట్టుముట్టడంతో ఒక గుబురైన ముళ్ళపొదలో దూరి దాక్కున్నది. అశ్వికులు దాన్ని బయటికి రప్పించేందుకు రాళ్ళూ, ఎండుకొమ్మలూ పొదలోకి విసరసాగారు కాని, అది కిక్కురుమనలేదు. చివరకు అందరూ గుర్రాలు దిగి, యీటెలను ముందుకు చాచిపట్టుకుని పొదలోకి దారి చేసుకుంటూ నడవసాగారు

హఠాత్తుగా అడవిపంది పొదమధ్యనుంచి ముందు కురికి, తనవైపు వస్తున్న యిద్దరు యోధులకాళ్ళను తన కోరలతో చీల్చి, తిరిగి పారిపోసాగింది. గాయపడిన యోధులను కోటకు చేర్చేందుకు నలుగురు అనుచరులను అక్కడ వదిలి, దుర్జయసింగూ అతడి మిత్రులూ అడవిపందివెంట పరిగెత్తారు. అది వాళ్ళకు చెట్లచాటునా, పొదలచాటునా కన్పిస్తూ, అంతలోనే మాయమవుతూ చిక్కకుండా పారిపో సాగింది. దాన్ని వెంటబడి తరుముతున్న వేటగాళ్ళు చెదిరిపోయి, అక్కడా యిక్కడా చిన్నమురాలుగా వేరుపడిపోయారు. ఆ సమయానికి అరణ్యంలో సంజ చీకటి వ్యాపించసాగింది.

దర్జయసింగుమాత్రం తన గుర్రంమీద ఆ అడవిపందిని వెతుకుతూ, కనబడి నప్పుడు బల్లెంతో పొడిచేందుకు ప్రయత్నిస్తూ ఒంటరిగా అరణ్యంలో చాలాదూరం వెళ్ళిపోయాడు. చివరకు పంది అతడి కో పొదలో నక్కివుండటం కనిపించింది. తను గుర్రం దిగి దానికోసం పొదలోకి వెళ్ళటమా, మానటమా అని ఆలోచించేంతలో, పంది పెద్దగా అరిచి దుర్జయసింగుకేసి కుప్పించి దూకింది. దుర్జయసింగు

యీాటెను బలంగా దానికేసి విసిరాడు. కాని, యీాలోపల పంది అత డెక్కివున్న గుర్రాన్ని బలంగా తాకి, తన కోరలతో దాని పొట్టను చీల్చివేసింది. గుర్రం క్రింద పడేంతలో దుర్జయసింగు దానిమీదినుండి పక్కకు దుమికాడు. అదే సమయంలో అడవి పంది అతడిమీదికి దుమకబోయింది. నిరాయుధుడై వున్న దుర్జయసింగు తనకు మరణం తప్పదని భావించి, నిర్భీతిగా నిలిచాడు. కాని. అడవిపంది అతణ్ణి తాకే సమయానికి ఎవరో విసిరిన యీాటె దాని ముఖంమీద బలంగా గుచ్చుకున్నది. ఆ దెబ్బకు అది పెద్దగా అరుస్తూ, యీాటెతోపాటు అరణ్యంలోకి పారిపోయింది

దుర్జయసింగు ఆశ్చర్యపడుతూ, తనను కాపాడినవా రెవరా అని వెనక్కి తిరిగి చూశాడు. అతడి కెదురుగా ఒక దీర్ఘకాయుడు వచ్చి నిలబడ్డాడు. ఇతరుడి సహాయంవల్ల తన ప్రాణాలు కాపాడబడిన సంగతి గుర్తుకురావటంతో దుర్జయ సింగు మనసు కలవరపడింది. అతడు ఆ వచ్చిన వ్యక్తిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తూ, "మీ రెవరో తెలియదు. నన్ను కాపాడినవారు మీరే అనుకుంటాను," అన్నాడు కటువుగా.

"అవును. దుర్జయసింగు మహాయోధుడు. రాజస్థానం యిప్పు డున్న విపత్కర పరిస్థితుల్లో, దేశరక్షణకు అతడు బతికివుండటం ఎంతైనా అవసరం," అన్నా డావ్యక్తి.

త నెవరో తెలిసిన ఆ సామాన్యవ్యక్తి మాటలు దుర్జయసింగుకు మరింతగా ఆశ్చర్యం కలిగించినై. ''తమ పే రేమిటో తెలుసుకోవచ్చునా ?'' అన్నా డతడు.

''తరువాత తెలుసుకోవచ్చు. బాగా అలసివున్నారు గనక, ప్రస్తుతానికి నావెంట వచ్చి, నా కుటీరంలో కొంచెంసేపు విశ్రాంతి తీసుకోండి," అన్నాడు నూతనవ్యక్తి.

దీర్ఘకాయుడూ, మహాబలశాలీ అయిన ఆ యువకుడి వెనకగా దుర్జయసింగు అంధకారం కమ్మిన మహారణ్యంలో నడవసాగాడు. కొంతదూరం వెళ్ళిన తర వాత యువకుడు ఆగి, దుర్జయసింగుతో, ''కారణం అడగకండి; తమరు తల పాగతో కళ్ళకు గంతలు కట్టుకోండి. నేను మీ చేయి పట్టుకుని నడిపించుకు వెళతాను. ఇందుకు యిష్టం కాకపోతే, యిక్కడే మనం ఎవరిదారిన వాళ్ళం వెళ్ళి పోదాం," అన్నాడు.

దుర్జయసింగు యువకుడి ముఖంలోకి చూచాడు. ముఖం ప్రశాంతంగా వున్నది. అతడు తనను మోసం చేసి చంపాలన్న వుద్దేశం కలవాడిలా కనిపించలేదు. అలా చేయబూనినవాడైతే, అడవిపందినుంచి తనను రక్షించవలసిన అవసరమేలేదు. దుర్జయసింగు యిలా అనుకుని తన తలపాగా విప్పి యువకుడిచేతిలో పెట్టాడు.

యువకుడు వానితో దుర్జయసింగు కళ్ళకు గంతలు కట్టి చేయి పట్టుకుని ముందుకు నడిపించుకుపోయాడు

కొంత సేపటికి యువకుడు దుర్జయుడి కళ్ళకు కట్టిన తలపాగా ఊడదీసి అతడి చేతి కిచ్చాడు. ఇప్పుడు తా నొకానొక కొండగుహముందు భిల్లులమధ్య వున్నట్టు దుర్జయసింగు తెలుసుకున్నాడు. ఈసారి అతడు యువకుడి ముఖంలోకి మరింత పరీక్షగా చూశాడు ఏదో అనుమానం అతడిలో రగుల్కొన్నది — క్షత్రియ యువకుడు, భిల్లుల మధ్య నివశించటం !

ఒక భిల్లు యువకుడు దుర్జయసింగుకు కాళ్ళూ చేతులూ కడుక్కునేందుకు నీరు తెచ్చి యిచ్చాడు. ఆ పని కాగానే అతణ్ణి ఒక సువిశాలమైన గుహలోకి తీసుకు పోయాడు. దీపకాంతిలో గుహ అంతా స్పష్టంగా కనిపిస్తున్నది. ఒకమూల పులి చర్మాలు, అంబులపొదులు, ఈటెలు......

కొద్ది సేపటితరవాత భిల్లుడు ఫలాలు తెచ్చి దుర్జయసింగు ముందు పెట్టాడు. తనను అరణ్యంనుంచి అక్కడికి తీసుకువచ్చిన యువకుడికోసం దుర్జయుడు చుట్టూ కలయచూశాడు. అతడు కనిపించలేదు.

"నే నా రాజపుత్ర యువకుడి అతిధిని. గృహస్థు అతిథిముందు ఆహారపాత్ర నుంచటం రాజపుత్ర ధర్మం. చూస్తూంటే, భిల్లుల సాంగత్యంవల్ల యీ యువకుడు స్వజాతిధర్మాన్ని మరిచిపోయినట్టున్నది," అన్నాడు దుర్జయసింగు కోపంగా.

"మా నాయకుడు స్వజాతిధర్మం ఏమాత్రం మరిచిపోలేదు. ఒకానొక వ్రతం కారణంగా ఆయన చోండావతులతో కలిసి భుజించరు," అన్నాడు ఫలాలు తెచ్చిన భిల్లుడు.

ఆ మాటలతో దుర్జయసింగుకు అనుమానం మరింతగా దృఢపడింది. అతడు ఏమి చేయటయా అని ఆలోచించేంతలో యువకుడు అక్కడికి వచ్చి, "అయ్యా, ఆతిధ్యధర్మం సక్రమంగా నెరవేర్చలేకపోయాను. కారణం నా పరిచారకుడు చెప్పాడు. తమకు భోజనం చేయాలన్న కోర్కె లేకపోతే, శయ్య సిద్ధంగా వున్నది, విశ్రమించండి," అన్నాడు,

దుర్జయసింగు ఆలోచనలు పరిపరివిధాలుగా పోయినై. ఇక ఒక్కక్షణంకూడా తా నక్కడ వుండటం క్షేమం కాదనుకున్నాడు "మీ సహాయానికి కృతజ్ఞుణ్ణి. నే నిప్పుడే సూర్యమహల్‌దుర్గానికి వెళతాను. పరులయింట నివశించే అలవాటు నాకు లేదు," అన్నాడు దుర్జయసింగు.

యువకుడు చిరునవ్వు నవ్వుతూ, "అలాగే వెళ్ళవచ్చు. దాని కే అభ్యంతరమూ



లేదు కాని తమరు పరులయింట నివశించేవారని నేను భావించాను!" అన్నాడు.

"మీ రెవరో నాకు తెలియదు. కావాలనుకుంటే, మీరు యీ భిల్లులచేత నన్ను చంపించవచ్చు కాని, యీ దుర్జయసింగు అవమానాన్నీ, నిష్కారణ నిందలనూ సహించడు రారోడ్ తిలక్‌సింగుతో మాకు వంశానుగతమైన విరోధం వున్నది. ఆ కారణంవలన బహిరంగయుద్ధంలో నేను అతణ్ణుంచి సూర్యమహల్‌దుర్గాన్ని జయించుకున్నాను, అది క్షాత్రధర్మంకూడా," అన్నాడు దుర్జయసింగు.

"అవును; తమరు బహిరంగయుద్ధంలో ఘటికులు. అందువల్లనే తిలక్‌సింగు మరణించిన తరవాత, ఆయన భార్యతో యుద్ధం చేసి, ఆమెను వధించారు. స్త్రీని చంపటంలో వున్న క్షాత్రధర్మం తమకు తెలియనిది కాదు," అన్నాడు యువకుడు.

ఆ మాటలు దుర్జయసింగును శూలంపోట్లుల్లా తాకినై రోషంతో అతడి ముఖం జేవురించింది కళ్ళనుంచి నిప్పుకణాలు రాలినై. అతడు ఆపాదమస్తకం ఒక్కసారి కంపించి, పెద్దగా రంకెపెట్టి కుప్పించి వురికి యువకుడి గొంతు పట్టుకున్నాడు.

యువకుడి అనుచరులైన భిల్లులు దుర్జయసింగుకేసి యీటెలు ఎత్తేంతలో, యువకుడు వారిని ఎమడచేయెత్తి వారిస్తూ, కుడిచేతితో దుర్జయసింగును పట్టుకుని గడ్డిపోచను విసిరినట్టుగా దూరంగా విసిరివేశాడు

దుర్జయసింగు కిందపడి న్యూనతచెందాడు. యు వ కు డు ఏ మాత్రం

తొణకకుండా, గంభీరస్వరంతో, "శయ్య సిద్ధంగా వుంది, విశ్రాంతి తీసుకో వచ్చు." అన్నాడు.

దుర్జయసింగు తల వంచుకుని, "నే నిప్పుడే సూర్యమహల్ దుర్గానికి వెళ్ళాలి," అన్నాడు

యువకుడు మారుమాటాడకుండా దుర్జయుడి కళ్ళకు గంతలు కట్టి, ఆతణ్ణి చేయిపట్టి నడిపించుకుంటూ, అడనిపంది అతడిమీది కురికిన స్థళంలో అతణ్ణి వదిలి, వెనుదిరిగిపోయాడు. ఆసరికి తూర్పు తెల్లనవటంతో దుర్జయసింగు తన దుర్గం వున్న ప్రాంతం గుర్తించి, కొంతసేపటికి సూర్యమహల్ ప్రవేశించాడు

దుర్జయసింగు రాక మహల్లో అందరికీ ఆనందం కలిగించినా, అతడి ముఖ భంగిమలు చూసి భయపడి ఎవరూ అతణ్ణి సమీపించలేదు దుర్జయుడు తనగదిలోకి వెళ్ళి అమాత్యుడికోసం కబురుచేశాడు. అతడు రాగానే కూర్చోవలసిందిగా సౌజ్ఞచేసి, "అమాత్యా, యీదుర్గంలో మనం ప్రవేశించి ఎన్ని ఏళ్ళయింది ?" అని అడిగాడు

"ఎనిమిది సంవత్సరాలు దాటింది," అన్నాడు అమాత్యుడు, తనప్రభువు అడిగిన ప్రశ్నకు ఆశ్చర్యపడుతూ

"తిలకసింగుభార్య మరణించినతరవాత, అతడి కుమారు డేమయ్యాడు ?"

"ఈ గవాక్షంలోనుంచి కిందవున్న నదిలోకి దూకి మరణించాడు."

"అతడు మరణించలేదు, ఇంకా బతికేవున్నాడు"

"ఆ బాలుడు...తేజసింగు...యింకా బతికేవున్నాడా ?"

"అవును; ఇప్పు డతడు బాలుడుకాదు, నవయవ్వనుడు"

"తమరు పొరబడటంలేదుకదా ?"

"పొరపాటుకు ఆస్కారమేలేదు. తండ్రి పోలికలవల్ల అతణ్ణి మొదట్లో అనుమానించాను. మాటలవల్ల ఆ అనుమానం నిజమని తేలింది."

దుర్జయసింగు యింతచెప్పినా అమాత్యుడికి ఇంకా నమకం కల్గలేదు. అది గ్రహించిన దుర్జయుడు, "అమాత్యా, నే నేదో భ్రమపడుతున్నానని భావించకండి. అతణ్ణి బాగా గుర్తించాను. అంతేకాదు, యీరాత్రి అతడు నా ప్రాణరక్షణ చేశాడు ఇక మీరు వెళ్ళవచ్చు," అన్నాడు.

అమాత్యుడు వెళ్ళిపోయాడు. దుర్జయసింగు తలవంచుకుని దుర్గప్రాకారంమీద అటూ యిటూ తిరగసాగాడు.

## 2

సూర్యోదయం అవుతూనే ప్రయాణసన్నాహాలు ప్రారంభించిన సూర్యమహల్ దుర్గసైనికులు, జాముపొద్దెక్కేసరికి బారులుతీరి దుర్గంనుంచి బయటికివచ్చి, అరణ్యా

మార్గం పట్టారు. దుర్జయసింగు అశ్వారూఢుడై వారిమధ్య ప్రయాణిస్తున్నాడు. సేన కొంత సేపటికి అరణ్యంలోని ఒకానొక మైదానప్రదేశానికి వచ్చింది. అక్కడ అనేక గ్రామా లున్నవి. అందులో చంద్రపురము అన్నగ్రామం చాలాపెద్దది ఈ గ్రామా లన్నీ దుర్జయసింగు వశంలో వున్నవే. రారోడుతిలకసింగు సూర్యమహల్ దుర్గాధిపతిగా వున్నంతకాలం యీ గ్రామాలవాళ్ళు శాంతిసుఖాలతో జీవించారు. ఆ తరవాత చోడావతు వంశస్థుడైన దుర్జయసింగు ఆ దుర్గాన్ని జయించాడు దానితో ఆగ్రామస్థులకు అధికపన్నులపీడా, అవమానాలూ సంప్రాప్తమయినై.

చంద్రపుర గ్రామానికి సర్దార్ గోకులదాసు పెద్ద. అతడు వృద్ధుడు. అతడి కుమారుడైన కేశవదాసు దుర్జయసింగు పెట్టేబాధలు భరించలేనివా రందరినీ కూడకట్ట సాగాడు ఆసంగతి తెలిసి దుర్జయుడు, గ్రామముఖ్యులు కొందరికి జరిమానాలు విధించి, కేశవదాసును ఉరితీయించాడు. ఇది జరిగి దాదాపు మూడేళ్ళు గడిచింది. అయినా. వృద్ధగోకులదాసు తన కుమారుడి మరణానికి కారకుడైన దుర్జయసింగును మరిచిపోలేదు. పగతీర్చుకునే ఆవకాశంకోసం ఎదురుచూస్తున్నాడు.

దుర్జయసింగు సేనతో గ్రామం దాటి కొంతదూరం వెళ్ళేసరికి మార్గానికి పక్కగా పొలంపని చేస్తూ గోకులదాసు కనిపించాడు. దుర్జయుడు గుర్రాన్ని అతడి పక్కకు తోలి, "ఏం, ముసలినక్కా ! పన్ను తెచ్చి యిస్తావా, లేక ఎప్పటిలాగే ఏమైనా కుట్ర పన్నుతున్నావా ?" అని ప్రశ్నించాడు

గోకులదాసు అవమానంతో కుపితుడయ్యాడు. కాని, వృద్ధుడైన తాను ఆ సమయంలో చేయగలిగిం దేమీలేదు. అతడు చేతు లెత్తి దుర్జయుడికి నమస్కారం చేశాడు

"ఎందు కా నక్కవినయాలు ! నీ జాతికి తగ్గ విధంగా ఏవో దురాలోచనలు చేస్తున్నావనే నా అనుమానం," అన్నాడు దుర్జయుడు.

గోకులదాసు వచ్చే కోపాన్ని తొక్కిపడుతూ, "దేవా ! దురాలోచనలు చేయటం మాత్రం మా వంశాచారం కాదు," అన్నాడు.

"ఓహో, అలాగా ! నీవు వశీవంశంవాడివికదా ? ఆ వంశస్థులు ఎన్నాళ్ళనుంచీ సదాచారపరు లయ్యారు ?" అన్నాడు దుర్జయుడు హేళనగా.

"ప్రభూ ! దౌర్భాగ్యంకొద్దీ మేము వశీవంశంవాళ్ళం అయినమాట నిజమే. కాని, యింతకాలం దాసత్వంలో బతికినా, యింకా మేం పిరికివాళ్ళం మాత్రం కాలేదు. మేము రాజపుత్రులం !" అన్నాడు గోకులదాసు.

దుర్జయసిం గామాటలతో మహాగ్రహం తెచ్చుకుని, "ఓరీ, ముసలినక్కా !

కొడుకు చచ్చినా, యింకా రాజుతో ఎలా మాట్లాడాలో నీకు తెలిసినట్టులేదు దుర్జయసింగు తన దాసులకు మంచీ మర్యాదా నేర్పేపద్ధతి యిదే!'' అంటూ గోకులదాసును గట్టిగా ఒక్క తన్ను తన్నాడు ఆ తాపుకు వృద్ధుడైన గోకులదాసు వెల్లకిలా కిందపడిపోయాడు దుర్జయుడు అతడికేసి ఓ క్షణం చూసి, గుర్రాన్ని అదిలించాడు అతడి వెనకగా సైన్యం వెళ్ళిపోయింది

కొంతసేపటికి గోకులదాసు మెల్లిగా లేచి నిలబడ్డాడు అతడు ఆకాశంకేసి చేతులు జోడించి, తరవాత సైన్యం పోయిన దిక్కుకేసి దృష్టి మరల్చి, "దుర్జయా! ఒకందుకు నేను నీకు కృతజ్ఞత చెప్పుకోవాలి క్రమంగా పుత్రశోకం మరిచి పోతున్న నాకు, ఆ సంగతి గుర్తుకు తెచ్చావు ఆ పుత్రహత్యకు ఏదో ఒకనాడు నీవు నా చేతుల్లో ప్రతిఫలం అనుభవిస్తావు," అన్నాడు.

ఒక గంటకాలం గడిచింది దుర్జయసింగు తన సేనతో సాయింబ్రాపర్వతి దుర్గం చేరాడు అది ఫాల్గుణమాసము, హోళీపండుగ రోజులు దుర్గమార్గంలోని వీధులన్నీ హోళీ వేడుకలలో మునిగివున్న పౌరులతో కళకళ లాడుతున్నవి ఎక్కడ చూసినా బుక్కాపొడి. వృద్ధులూ, బాలయా-అంతా వయోభేదం లేకుండా ఒకరిమీద ఒకరు బుక్కాపొడి చల్లుకుంటున్నారు. చక్కగా అలంకరించుకున్న స్త్రీలు ఇళ్ళముందు గుంపులు గుంపులుగా చేరి రకరకాల పాటలు పాడుతున్నారు

సాయింబ్రాదుర్గాధిపతియైన రావత్‌కృష్ణసింగు, చోడావంత్ వంశస్థు లందరికీ నాయకుడు ఈ రోజున ఆ వంశస్థులైన చిన్న పెద్ద దండనాయకులూ, సామంతులూ-అంతా సాయింబ్రాదుర్గము చేరారు ఆ వచ్చినవా రందరూ తమ తమ సైన్యాలను వెంటబెట్టుకు వచ్చారు

పగటి మూడవజాము ప్రాంతాల రావత్‌కృష్ణసింగు సభాభవనానికి వచ్చాడు. అతడు రావటం చూస్తూనే, అక్కడ చేరిన చోడావత్ నాయకు లందరూ తమ తమ ఆసనాలమీదనుంచి లేచి జయజయధ్వానాలు చేశారు

వృద్ధుడైన రావత్‌కృష్ణసింగు ఆసనంమీద కూర్చుని, సభికు లందరినీ కూర్చో వలసిందిగా ఆదేశించి, యిలా అన్నాడు

"మన మందరం యీనా డిక్కడ సమావేశం కావటానికి కారణం హోళీ పండుగ ఒక్కటే కాదు, మొగల్‌సైన్యాలవల్ల మన ఆధీనంలోని ప్రాంతాలకు మళ్ళీ ప్రమాదం రానున్నది రాణా సంగ్రామసింహుడు, బాబరుతో చేసిన మహా యుద్ధంలో, మిత్రులుగా నటించి, వారు చేసిన ద్రోహం కారణంగా ఓడిపోయాడు చితోడ్ తురుష్కుల వశ మయింది

"ఆదుర్గం తిరిగి స్వాధీన పరచుకునేవరకూ తాను అరణ్యాల్లో, కొండల్లో మాత్రమే నివశించగలనని ఆయన ప్రతిజ్ఞపట్టారు. ఆ విధంగానే ఆయన జీవిత శేషాన్ని గడిపారు ఇప్పుడు రాణా ప్రతాసింహమహారాజు తిరిగి చితోడ్‌దుర్గాన్ని ఆక్రమించుకునేందుకు, అష్టకష్టాలు పడుతూ అరణ్యాల్లో కొండల్లో కాలం గడుపుతున్నారు. మొగల్ సేనాని మానసింహమహారాజు, యువరాజైన సలీముతో పెద్ద సైన్యాన్ని వెంటబెట్టుకుని మనమీద దాడికి వస్తున్నట్టు వార్త లందినవి ఒకప్పుడు సస్యశ్యామలమైన చితోడ్‌రాజ్యం, యీనాడు కారడివిగా మారింది ప్రజ లందరూ పురాలూ, పట్టణాలూ వదిలి అడవుల్లో, కొండల్లో నివశించా లనేది రాణావారి ఆజ్ఞ. మానసింహుడు మనను జయించాలంటే, యీ అరణ్యాలూ, కొండలూ ప్రవేశించాలి. సూరత్‌రేవునుంచి ఢిల్లీకి వెళ్ళే వస్తువాహనాలను మనం దోచి, ఆ రెండునగరాలకూ సరైన రాకపోకలు లేకుండా చేయగలిగాం. ఇది మొగలులకు పెద్దదెబ్బ. అందుకే వాళ్ళు మనమీదికి ఎత్తివస్తున్నారు. మన రాజ్యపర్వతభూముల్లోని ప్రతిదుర్గంలోను సైన్యం వున్నది. మన చోండావతులేకాక, ఇరత వంశాలవాళ్ళుకూడా మహారాణాకు సహాయంగా వెళ్ళుతున్నారు. అవసరం అయితే మొగలులతో ముఖాముఖి యుద్ధానికి రాణా సైన్యాన్ని సమకూర్చగలడు. దక్షిణమునుంచి భిల్లులు, తూర్పునుంచి మీరులు, పడమటినుంచి మీనాలు తురుష్కులను ఎదుర్కొంటారు."

సాలుంబ్రాధిపతి యిలా చెప్పి ముగించగానే, అక్కడ చేరిన యోధు లందరూ సింహనాదాలు చేశారు. వృద్ధచారణుడు కొంతసేపు వీరగీతాలు పాడాడు. తరవాత సాలుంబ్రాధీశుడు కృష్ణసింగు సభాభవనమంతా ఒకసారి కలయచూచి, "వీరులారా! తురుష్కులతోటి యుద్ధానికి ఎంతోకాలం వుండదు. పోరులో అన్నివేళలా మహారాణావారి దక్షిణ పార్శ్వభాగాన వుండేగౌరవం పారంపర్యంగా సాలుంబ్రాదుర్గాధిపతులకు వస్తున్నది. చోండావత్ వంశజులైన ప్రధానదండనాయకు లందరూ యిక్కడే వున్నారు. రేపు సూర్యోతయంతోపాటే, మనం యిక్కడినుంచి బయలుదేరి, ప్రస్తుతం మహారాణావారి రాజధాని అయిన కుమల్మేర్ దుర్గానికి వెళదాం. ఇప్పటికి సభ ముగిద్దాం. హోళీపండుగగదా, అందరూ యీ వార్షికోల్లాసంలో, యీ ఒక్కదినం సంతోషంగా కాలం గడపగోరుతాను. రానున్న హోళీపండుగను మనలో ఎందరం చూడగలమో చెప్పలేను," అన్నాడు.

రావత్‌కృష్ణసింగు ఆసనంమీదినుంచి లేచి, తన భవనంలోకి వెళ్ళిపోయాడు చోండావత్‌యోధు లందరూ దుర్గంనుంచి బయలుదేరి, పౌరులు చేసుకుంటున్న హోళీపండుగలో మహోత్సాహంతో పాల్గొన్నారు.

చొండావత్ నాయకుడైన కృష్ణసింగు కొన్ని రోజులతరవాత తన సైన్యంతో రాణా ప్రతాపు డున్న కుమల్మేర్‌దుర్గం చేరాడు. అక్కడికి ఆసరికే కొందరు తమ తమ సైన్యంతో వచ్చివున్నారు. దేవగఢనుంచి సంగావత్ నాయకుడు రెండువేల సేనతో వచ్చాడు బేద్నూర్‌నుంచి మర్త్యవంశనాయకులు చాలా పెద్ద సైన్యంతో వచ్చారు వాళ్ళు రారోడ్‌వంశీయులు మేవాడ్ రాజ్యంలోని రాజపుత్రుల్లో అత్యంత సాహసులు ఈ వంశంవాడైన జయమల్లు చితోడ్‌దుర్గ పతనసమయంలో అసామాన్య శౌర్య ధైర్యాలతో పోరాడి, అక్బర్ చేతిలో నిహతు డయ్యాడు. కైలవా నుంచి గజావద్వంశీయులు వందలసంఖ్యలో వచ్చారు ఈ వంశం చోండావత్ వంశ శాఖల్లో ఒకటి. ఈ వంశంవాడైన పత్తు చితోడ్‌ధ్వంససమయంలో, సాలుంబ్రాధిపతి షాహీదాస్ వీరమరణం పొందినతరవాత, ఒంటరిగా సూర్యద్వారాన్ని మొగలులనుండి రక్షిస్తూ, ఎందరో మొగలులను చంపి చివరకు వీరస్వర్గం అలంకరించాడు.

కుమల్మేర్ దుర్గ పరిసరాలు రాజపుత్రయోధులతో క్రిక్కిరిసిపోయినై. కాని, రాణాప్రతాప్ దుర్గంలో లేడు ఆయన దుర్గానికి కొంచెం దూరంలోవున్న ఒక కొండపై నివశిస్తున్నాడు అతడి కంటికి దుర్గప్రాంతాలకు వచ్చి చేరిన రాజపుత్ర సైన్యమంతా కనిపిస్తున్నది అతడు ఆ సేనకేసి సాలోచనగా చూస్తూ, మధ్యమధ్య చీకటి ముసురుకుంటున్న ఆకాశం కేసీ, మిణుకుమిణుకు మనే నక్షత్రాల కేసీ చూస్తున్నాడు. అతడి నడుముకు కత్తి వేలాడుతున్నది. ఒక పక్కగా తృణశయ్య వున్నది. ''చితోడ్‌ను స్వాధీనం చేసుకునేవరకూ, నేను తృణశయ్య తప్ప, మరెలాంటి శయ్యనూ ఉపయోగించను,'' అని ఆతడు ప్రతిజ్ఞ చేసివున్నాడు అంతే కాక, తన మనోరథం యీడేరేవరకూ ప్రతాపుడు వెండి బంగారాలను తాకడు, ఆకులతో కుట్టిన విస్తరిలో మాత్రమే భుజిస్తాడు

అర్ధరాత్రి దాటిన తరవాత, ప్రధాన సేనాపతులలో కొందరు మహారాణా దగ్గరకు వచ్చారు ప్రతాపుడు అప్పటివరకూ నిద్రించక వారి రాకకై ఎదురుచూస్తున్నాడు వారు రాగానే అందరినీ సాదరంగా కూర్చోవలసిందని చెప్పి, "మిత్రులారా! నేనీ ప్రదేశాన్నుంచి, దుర్గప్రాంతాల విడిసిన మన సైనికులనూ, వారి ఉత్సాహాన్నీ గమనిస్తున్నాను. సహాయం వచ్చిన మీ అందరికీ కృతజ్ఞతలు తెలిపేందుకే మిమ్మల్నిక్కడికి రావలసిందిగా కోరాను," అన్నాడు.

మహారాణాకు కుడివైపున కూర్చున్న రావత్‌కృష్ణసింగు, "మహారాజా! యుద్ధ

సమయంలో రాజపుత్రులు ఎప్పుడూ మీ వెంట వుండేవారేకదా. మా సర్వస్వం మీకోసం త్యాగం చేయబడగలదు," అన్నాడు.

''కృష్ణసింగ్ ! మీ ఋణం నే నెన్నటికీ తీర్చలేను. మా నాయన మరణించగానే, మా అన్న యోగమల్లు సింహాసనం అధిష్ఠించాడు. అప్పుడు మీరు, అతనితో, 'మహారాజా ! పొరబడ్డారు. ఈ సింహాసనం, మీ సహోదరుడిది,' అంటూ ఖడ్గాన్ని నా ఒరలో పెట్టారు. ఆ ఖడ్గం నా చేతిలో వున్నంతవరకూ, సాలుంబ్రాధిపతులైన మీరు, అన్నిటా నా దక్షిణపార్శ్వాన్ని అలంకరించగలరు," అన్నాడు రాణా.

''సాలుంబ్రా యింతకంటె గొప్ప బహుమానం కోరాడు. స్వామి భక్తి సాలుంబ్రా వంశానుగతంగా వస్తున్న ధర్మం,'' అన్నాడు కృష్ణసింగు.

తరవాత రాణాప్రతాప్ రారోడ్ వంశనాయకులనూ, గజద్వంశజులనూ ఉద్దేశించి," చితోడ్ దుర్గపతన సమయంలో, జయమల్లు, పత్తు వీరోచితంగా పోరాడుతూ తమ ప్రాణాలను అర్పించి సంపాదించిన కీర్తిని, మీరు తిరిగి చితోడ్‌ను స్వాధీనం చేసుకోవటంలో సంపాదించవలసివున్నది," అన్నాడు.

''మహారాజా ! జయాపజయాలు మనుష్యాధీనం కావు. మా ప్రయత్నలోపం మాత్రం వుండదు," అన్నారు, ఆ నాయకులు.

ప్రతాపుడు, కోటారిచవాణ్ కులాధిపతిని వుద్దేశించి యిలా అన్నాడు· ''హంతకుడైన రణవీరునిబారి పడకుండా నాన్నగారిని రక్షించి, యీ కుమల్మేర్ కోటకు తెచ్చిన తరవాత, వారి కులగోత్రాలను గురించీ, పుట్టువును గురించీ అందరూ సందేహాల పాలయ్యారు. అలాంటి సమయంలో చవాణ్‌వంశ నాయకుడే, నాన్నగారి సరసన భుజించి, అందరి సందేహాలూ పటాపంచలు చేశాడు చవాణ్ వంశం యిప్పటికీ స్వామిభక్తి కలిగేవున్నది."

''చవాణ్‌వంశం కలకాలమూ స్వామిభక్తి కలిగేవుంటుంది, మహారాజా !" అన్నాడు చవాణ్‌వంశనాయకుడు.

''బిజిలీ దుర్గాధిపా ! మా నాయనగారు ఎంతో దీనావస్థలో వున్నప్పుడు, మీ నాయనగారేకదా, వారికి కన్యాదానం చేసినది. జరగనున్న యుద్ధంలో మీరు నా పేరు నిలపగలరని నమ్ముతున్నాను," అన్నాడు ప్రతాపుడు.

''మహారాజావారికోసం ప్రమరవంశం ప్రాణాలను విసర్జించటానికైనా సిద్ధంగా వున్నది," అన్నాడు బిజిలీదుర్గాధిపతి.

ప్రతాపుడు, దైలవారా నాయకుడికేసి తలతిప్పి, ''ఝాలావంశము మేవాడ్

దేశానికి మూల స్తంభం లాటింది. యుద్ధంలో ఝూలావంశీయులే నా తనుప్రాణాలు."
అన్నాడు.

"ఝూలావంశం స్వామిభక్తిలో ఎవరికీ తీసిపోదు. యుద్ధంలో మహారాణావారి వెన్నంటి వుండగలదు," అన్నాడు ఝూలాప్రభువు

ప్రతాపసింహుడు యీవిధంగా తనకు సహాయపడవచ్చిన రాజపుత్రనాయకులతో కొంతసేపు సంభాషించి, చివరకు అందరినీ హెచ్చరించాడు "వీరులారా ! మిమ్మల్నందర్నీ యిక్కడికి ఆహ్వానించిన కారణం ఏమిటో మీకు స్పష్టంగా తెలిసిందేగద్మా వానాకాలం ప్రారంభానికి ముందుగానే, మొగల్ సైన్యాలు మన మేవాడ్ ప్రాంతాలపైకి దాడిచేయగలవు. మనం అప్రమత్తులుగా లేమని వారు గ్రహిస్తారు పర్వతారణ్యాలతో నిండివున్న యీ ప్రదేశానికి శత్రువులు రాగలగటమే దుర్ఘటం అంతేకాదు బప్పారావుల వంశం తురుష్కులకు ఎన్నటికీ తలవంచదు, మన పూర్వపురుషుల శౌర్య పరాక్రమాలు మనకు తెలిసినవే సమరసింహ, సంగ్రామసింహుల సంతానం ఎన్నటికీ దాస్యానికి ఒడబడదు మేవాడ్ రాజపుత్రుల్లో యింకా స్వాభిమానం, ఆత్మగౌరవం నశించలేదని అక్బరూ, మాన్‌సింగూ త్వరలోనే తెలుసుకుంటారు "

ఆనాటినుంచీ రాణాప్రతాప్ పగలనక రాత్రనక యుద్ధసన్నాహాల్లో కాలం గడపసాగాడు క్రమక్రమంగా మరికొందరు రాజపుత్రనాయకులు తమ తమ అనుచరులతో వచ్చి, రాణాను కలుసుకున్నారు. రాణా, సైనికులకు కావలసిన ఆహారవస్తులు సేకరిస్తూ, దుర్గరక్షణ ఎలావున్నవో స్వయంగా పరిశీలిస్తూ, రెండు నెలలకాలం గడిపాడు ఒక చిన్న పర్వతగుహ అతడి నివాసస్థానం భార్య పాటేశ్వరీ దేవి స్వయంగా వంటచేసి అతడికి వడ్డిస్తూవుండేది. రాణా సంతానమంతా జీర్ణ వస్త్రాలతో బక్కచిక్కి వుండేవారు. వారిని చూచినప్పుడల్లా ప్రతాపుడు, "భగవాన్ ! అమరసింగూ, అతడి మాతృదేవీ బతికివున్నంతకాలం యిలాగే గుహల్లో నివశించినా ఫరవాలేదు. కాని, మొగలులకు కప్పం కట్టి, వాళ్ళకు సామంతులుగా రాజభవనాల్లో కాలం గడిపే దుర్దశమాత్రం పట్టనీయవద్దు,'' అని ప్రార్థించేవాడు.

ఈ విధంగా నాలుగునెలలు గడిచినై. చివరకు అక్బరు పుత్రుడైన సలీమ్, రాజా మాన్‌సింగుతో కలిసి, గొప్ప సేనతో మేవాడ్ రాజ్యంపైకి దాడి వచ్చాడు. ఎక్కువ పోరాటం లేకుండానే, అతడికి రాజ్యంలోని సమతలప్రదేశాలన్నీ దొరికి పోయినై. క్రమంగా మొగల్ బలాలు పర్వత ప్రాంతాలు చేరినై ఇప్పుడు వారికి ఆ పర్వతమయ భూముల్లో ముందుకు పోవాలంటే ఒక్క హల్దీఘాట్ తప్ప

మరి మార్గంలేదు కాని, ఆ పర్వతకనుమమార్గాన్ని ఇరువదిరెండువేల రాజపుత్ర యోధులు కాపాడుతున్నారు.

రాజా మాన్‌సింగ్ కనుమద్వారానికి కొంచెం దూరంగా గుడారాలు నిర్మించవలసిందిగా మొగల్ సైనికులకు ఆజ్ఞ యిచ్చాడు క్షణాలమీద గుడారాలు నిర్మించబడినై వాటికిమధ్య, విశాలంగా యువరాజైన సలీమ్‌కు ఒక గుడారం నిర్మించబడింది సలీమ్ గుడారం మధ్య పట్టుపరుపుల కానుకుని, నృత్యగానాలు తిలకిస్తున్నాడు అలాంటి సమయంలో సేవకుడొకడు వచ్చి, అతడికి సలాం చేసి, "జహాపనా, రాజా మాన్‌సింగ్‌వారు తమతో, ఏదో ఒక ముఖ్యవిషయం మాట్లాడేందుకు వచ్చారు బయట వేచివున్నారు," అని చెప్పాడు.

సలీమ్ ఆజ్ఞ కాగానే మాన్‌సింగ్ గుడారంలో ప్రవేశించి, అతడికి సలాం చేసి ఎదురుగా కూర్చున్నాడు సలీమ్ అతడి ముఖకవళికలు పరీక్షించి, అత డేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడని భావించి, "రాజా! ఏమిటి సంగతి! ఆగ్రానుంచి బయలుదేరినప్పటినుంచీ, కార్యభారమంతా మీపైనే పెట్టాను. శత్రువుల యుద్ధసన్నాహాలు గమనించారు గదా? యుద్ధం ఎప్పుడు ప్రారంభించటం మంచిదని భావిస్తున్నారు?" అని ప్రశ్నించాడు

"రేపే యుద్ధం ప్రారంభించటం మంచిది ఈ కార్యం ఎంత త్వరితంగా నెరవేరితే, అంత మేలు," అన్నాడు మాన్‌సింగ్.

"నా అభిప్రాయంకూడా అదే మనం మేవాడ్‌రాజ్యంలో ప్రవేశించిన తరవాత యింతవరకూ రాజపుత్రులు మనతో నిలబడి ఎక్కడా గట్టిగా యుద్ధం చేయలేదు రేపైనా అంతే," అన్నాడు సలీమ్

"అలా అనుకోవటం పొరబాటవుతుంది. రాణాప్రతాపుడు పెద్ద సేనతో కనుమద్వారం దగ్గిర నిలబడివున్నాడని తెలుస్తున్నది కదూ? ఇక్కణ్ణించి అతడు యుద్ధం చేయకుండా వెనుదిరిగిపోతాడని నేను భావించాను కనుక, రేపు జరగబోయే యుద్ధం చాలా భయంకరంగా వుండే అవకాశం వున్నది," అన్నాడు మాన్‌సింగ్.

"రాణా బహిరంగ యుద్ధానికి పూనుకోవాలే గాని, యింక మనకు కావలసిందేమిటి? ముఖాముఖి యుద్ధమే తైమూర్‌లంగ్ వంశీయులమైన మాకు ఎంతో యిష్టం. చక్రవర్తి సేనల ధాటి చవిచూస్తూనే, అతడు రణరంగంనుంచి పారిపోగలడని నా నమ్మకం," అన్నాడు సలీమ్.

"మీ రన్నది ఒక విధంగా నిజం. చక్రవర్తి సేనావాహినుల ముందు నిలువగల బలం హిందూస్థాన్‌లో ఎవరికీ లేదు. కాని, ప్రతాపుడు అంత శీఘ్రంగా యుద్ధ

భూమిని వదిలి పారిపోయేతరహా వ్యక్తికాడు. అతడి సంగతి నాకు బాగాతెలుసు. అత డొకసారి......" అంటూ మాన్‌సింగ్ ఆగిపోయాడు.

"రాజా ! ఆగారేం, చెప్పండి. అది నేను వినగూడనంతటి రహశ్యం కాదు గదా ?'' అన్నాడు సలీమ్.

''ఇది చక్రవర్తికి తెలిసిన విషయమే. మీరు వినకూడని దేమీలేదు. ఆ ప్రతాపుడికి నేను కొంచెం బాకీపడివున్నాను ఆ సంగతి గుర్తురాగానే ... మాట్లాడలేక పోయాను," అన్నాడు మాన్‌సింగ్.

''ఓహో, అలాగా ! మీ రిద్దరూ హిందువులు. అలాంటివారి మధ్య స్నేహం, రుణం లాంటి సంబంధా లుండటం సహజమే మిత్రునితో యుద్ధం చేయటం మీకు మనస్కరించక పోతే – అలా దూరంగా వుండండి, నే నొక్కణ్ణే అతడితో యుద్ధం చేసి, అతడి బాహుబలం ఏపాటిదో పరీక్షిస్తాను,'' అన్నాడు సలీమ్.

"జహాపనా ! మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. ప్రతాపుడికి నేను రుణపడి వున్నమాట నిజమే; దాన్ని రేపు అతడి రుధిరంతోనే చెల్లిస్తాను. అతడు న న్నొక మారు అవమానించివున్నాడు," అన్నాడు మాన్‌సింగ్ వుద్రేకంగా.

"అలా చెప్పండి. అతడు మిమ్మ ల్నెలా అవమానించాడు ?'' అని ప్రశ్నించాడు సలీమ్.

రాజా మాన్‌సింగ్ యిలా చెప్పాడు "నేను, కొన్నేళ్ళ క్రితం షోలాపూర్ నుంచి ఆగ్రాకు వస్తూ, ప్రతాపుడు తన తండ్రిగారిదైన ఉదయపూర్ వదిలి, కుమల్నేర్ దుర్గంలో వుంటున్నట్టు విన్నాను. అత డప్పుడే సింహాసనానికి వచ్చాడు. రాణాలు సూర్యవంశీయులు. ఆవిధంగా క్షత్రియు లందరికీ పూజనీయులు. నేను, సైన్యాన్ని కొంతదూరంలో వదిలి, అక్కడికి దాపులనే వున్న ఉదయపూర్ కేసి బయలుదేరాను. నేను ఉదయపూర్ వస్తున్నవార్తతెలిసి ప్రతాపుడు అక్కడికి వచ్చి, ఉదయసాగరతీరంలో నాకు అతిధిమర్యాదలు నెరపేందుకు అన్నిఏర్పాట్లూ చేశాడు. కాని, భోజనసమయంలో అతడికి మారుగా, అతడి కుమారుడైన అమరసింగు వచ్చాడు. రాణా ఎక్కడ ? అని అడిగాను. శిరోవేదనవల్ల రాలేకపోయాడని చెప్పాడు, అమరసింగు నేను సంగతంతా గ్రహించాను మ్లేచ్ఛ చక్రవర్తితో నేను బాంధవ్యం నెరపటంవల్ల, ఆ గర్వి నాతో కలిసి భుజించటం తనకు అవమానమని భావించాడు

"నేను అమరసింగుతో యిలా అన్నాను 'నీతండ్రి శిరోవేదనకు కారణ మేమిటో నాకు తెలుసు ! కాని, మహారాణా నాముందు భోజనపాత్ర వుంచనిదే, నేను భుజిం

చను. ఈ మాట మీ తండ్రిగారితో చెప్పు.' కొంతసేపటికి ప్రతాపుడు నా దగ్గరకు వచ్చి, 'తురకవాడికి సహోదరి నిచ్చి పెండ్లిచేసినవాడు, ఏదో ఒక సమయంలో అతడితో కలిసి భుజించివుండవచ్చును. అలాంటివాడితో సహపంక్తిన, నే నెలా భుజించేది?' అని ప్రశ్నించాడు. ఆ మాటలతో నేను భోజనం అంటక లేచి నిలబడి, 'నీ గర్వాన్ని అణచకపోతే, నాపేరు మాన్‌సింగ్ కాదు,' అని చెప్పి అక్కణ్ణించి బయలుదేరివెళ్ళి, నా సేనలను కలుసుకున్నాను. ఆ ప్రతిజ్ఞ రేపు ప్రతాపుడి రక్తంతో నెరవేర్చుకుంటాను."

మాన్‌సింగ్ చెప్పినదంతా విన్న సలీమ్ ముఖం రోషంతో ఎర్రబడింది అతడు పళ్ళు కొరుకుతూ, "రాజా! చక్రవర్తి ప్రధాన సేనానులైన మిమ్మల నవమానించటమంటే, ప్రతాపుడు చక్రవర్తినీ అవమానించినట్టే! ఆ అవమానానికి రేపే ప్రతీకారం చేసితీరాలి," అన్నాడు.

రాజామాన్‌సింగ్, సలీమ్ మాటలతో తృప్తిపడి, సెలవు తీసుకుని డేరానుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

సూర్యోదయం అవుతూనే మొగల్, రాజపుత్ర సేనలమధ్య భీకరయుద్ధం ఆరంభమైంది హల్దీఘాట్‌కు రెండుప్రక్కల వున్న పర్వతాలమీదా, దిగువునా రాజపుత్రసైనికులు తమతమ వంశాధిపతుల నాయకత్వంలో పోరుకు ఉపక్రమించారు. పర్వతశిఖరాలమీదినుంచి ఆటవికులు, మొగల్‌సేనలపై బాణవర్షం కురిపించసాగారు

అపారమైన మొగల్‌సేన రాజపుత్రులపై ఫిరంగిగుండ్లను ప్రయోగిస్తూ దాడి ప్రారంభించింది. చోందావత్, రాథోడ్, చవాణ్, ఝాలా, గజావత్, ప్రమర వంశపు నాయకులు సింహనాదాలు చేస్తూ, తమ అనుచరులతో మొగల్ సేనలను ఢీకొన్నారు. మొగల్ ఫిరంగుల ధాటికి, ఏమాత్రం చలించక, ఒక దళం నేలకూలగానే, మరొక దళం ఆ శవాలమీదుగా ముందు కురికి, మొగలులను ఊచకోత కోయసాగారు

మొగలులు మరికొన్ని ఫిరంగిదళాలను రాజపుత్రులపైకి పురికించారు రాజపుత్రులు వీరావేశంతో వాటిమీదికి దుమికారు. కానీ, ఆ ఫిరంగులు వారిని వందల సంఖ్యలో హతక్షతగాత్రులను చేయసాగినై. మహారాణాప్రతాప్ యుద్ధప్రారంభం నుంచీ, తన అనుచరులకు ముందుండి పోరుతూ, రాజామానసింగ్‌పై పడేందుకు ప్రయత్నిస్తున్నాడు. కాని, తన ముందున్న అసంఖ్యాక మొగలుసైనికులను ఛేదించి మాన్‌సింగ్‌పై దుమికే అవకాశం అతడికి కలగలేదు ఇంతలో ప్రతాప్‌కు ఒక

పక్కగా ముందుకు నెట్టుకువస్తున్న శత్రుసైనికులూ, వారికి వెనుకగా ఏనుగుపై ఎక్కి యుద్ధంచేస్తున్న సలీమూ కనిపించారు రాణా వెంటనే తన అశ్వాన్ని సలీమ్ యుద్ధం చేస్తున్నవైపుకు ఉరికించాడు అది చూసిన రాజపుత్రులు సింహనాదాలు చేస్తూ మొగలువ్యూహాన్ని ఛేదించి తమ రాణాతోపాటు సలీమ్‌ను సమీపించారు

తమతమ నాయకుల రక్షణకై, మొగల్ రాజపుత్ర వీరులు ప్రాణాలకు తెగించి పోరసాగారు జయజయధ్వానాలూ, గాయపడి గుర్రాల గిట్టలకింద చిక్కుకు నలిగేవారి ఆర్తనాదాలతో, ఆ ప్రదేశం మహాభయంకరంగా కనుపట్టసాగింది ప్రతాప్ తన అశ్వాన్ని, సలీమ్ ఎక్కివున్న ఏనుగుపైకి దూకించి, యువరాజు అంగరక్షకులను నరికివేశాడు తరవార నిడుపైన ఈటె నొకదాన్ని సలీమ్‌కేసి విసిరాడు. కాని, అంబారీ పక్కనున్న ఇనుపరేకులు ఈటె సలీమ్‌కు తగలకుండా ఆపినై, తన ప్రయత్నం ఆవిధంగా వ్యర్థంకావటంతో ప్రతాపుడు కుపితుడై, మహాశక్తివంతమైన తన అశ్వం చైతక్‌ను సలీమ్ ఎక్కివున్న ఏనుగుదంతాలపై ముందుకాళ్ళరెండూ మోపేలా చేసి, తన ఖడ్గంతో మావటివాడితలను ఖండించాడు వెంటనే ఏనుగు వెనుదిరిగి పారిపోసాగింది. ప్రతాపుడు వెంటపడ్డాడు. రాజపుత్రులు సింహనాదాలు చేస్తూ తమ రాజును అనుసరించారు,

తమ యువరాజు ప్రమాదంలో చిక్కుకున్నాడని గ్రహించిన మొగలులు, "అల్లాహో అక్బర్ !'' అని భీకరంగా అరుస్తూ, రాజపుత్రులను ఎదిరించారు. తన శరీరంమీద ఏడుగాయాలు తగిలి, రక్తం స్రవిస్తున్నా లెక్కచేయక ప్రతాపుడు యింకా ముందుకు చొచ్చుకుపోతూనేవున్నాడు ''

ప్రతాపుడు మొగల్‌సైన్య మధ్యంలో చిక్కుకుపోగలడని గుర్తించిన, సిసోదియావంశ నాయకుడు, సిసోదియా పతాకాన్ని చేబట్టి, సింహనాదం చేస్తూ, శత్రువులమధ్యకు దూసుకుపోసాగాడు పతాకను గుర్తించిన అతడి అనుచరులు తమ నాయకుడివెంట ముందు కురికారు ఎంతోపోరు తరవాత, సిసోదియా నాయకుడు, ప్రతాపును మొగల్ సేనల మధ్యనుంచి బయటికి తీసుకురాగలిగాడు.

రాణాప్రతాప్ ఆనాడు విజృంభించి భయంకరమైన పోరు చేశాడు. రాజా మాన్‌సింగ్‌నుగాని, యువరాజైన సలీంనుగాని దొరికితే మట్టుపెట్టేందు కత డెన్నో ప్రయత్నాలు చేశాడు. ఆ ప్రయత్నాల్లో అతడు ప్రతిసారీ మొగల్‌సేనల మధ్యకు జొరబడి కార్చిచ్చులా వాళ్ళను దహించాడు కాని, అపారమైన మొగల్‌సేనలముందు ఇరవైరెండువేల రాజపుత్రవీరు లేపాటి ? ప్రతిఒక్క రాజపుత్రుడూ పదిమంది మొగలులతో పోరవలసిన పరిస్థితుల్లో హల్దీఘాట్ యుద్ధం జరిగింది. అయినా,

రాజపుత్రులు శత్రువులకు వెన్నివ్వక రణరంగంలో వీరవిహారం చేశారు.

ప్రతాపుడు ఆఖరి ప్రయత్నంగా మరొకసారి శత్రువులను ఛేదిస్తూ సలీం కేసి వెళ్ళే ప్రయత్నం చేశాడు. మొగలు లీసారి అతణ్ణి చుట్టుముట్టారు. అతడికీ, అతడి అనుచరులకూ మధ్యవున్నదూరం ఎక్కువయింది రాణా ప్రాణాలతో బయట పడలేడని అందరికీ అనిపించింది.

అలాంటి మహా విపత్కరసమయంలో, ఝాలవారా దుర్గాధిపతి, తన యిష్ట దేవతను స్మరించి, స్వర్ణసూర్యపతాకను సైనికుడిచేతినుంచి లాగి, చేత బట్టుకుని, పెద్దగా హుంకరించి, రాణాను చుట్టుముట్టిన మొగలులమీదికి సింహంలా ఉరికాడు

పోరు మహాభయంకరంగా జరిగింది. ఝాలవారాప్రభువు తన కడ్డువచ్చిన మొగలులను చిందరవందర చేస్తూ, ప్రతాపుణ్ణి చేరి, ఆయనను శత్రుమధ్యంనుంచి బయటికి తీసుకురాగలిగాడు. కాని ఆ ప్రయత్నంలో ఝూలా వంశస్థుడైన ఝాలవారా బాగా గాయపడిపోయి, నేల కొరిగాడు రాణా అతణ్ణి సమీపించి చేతులు పట్టుకుని, "ఝాలవారా; నా ప్రాణానికి మీప్రాణం అడ్డువేశారు," అన్నాడు సజలనేత్రాలతో.

''ఝూలావంశం స్వామిభక్తిలో ఎవరికీ తీసిపోదు. యుద్ధంలో మహారాణా వారి రక్షణే మా ప్రథమకర్తవ్యం," అన్నాడు ఝాలవారాధిపుడు ప్రాణాలు విడుస్తూ

ఆసరికి, ఇరువదిరెండువేల రాజపుత్ర సైన్యంలో, పధ్నాలుగువేలమంది రణరంగంలో వీరస్వర్గం అలంకరించారు. విధిలేక రాణాప్రతాప్ యుద్ధరంగం నుంచి వైదొలిగాడు

ప్రతాప్ రణరంగం విడిచిపోవటం చూసిన శత్రుసైనికు లిద్దరు — ఒక ముల్తానీ వాడూ, ఒక ఖొరాసానీవాడూ — తమతమ గుర్రాలమీద అతడి వెంట బడ్డారు. ప్రతాప్ అధిరోహించిన అశ్వం — చైతక్ బాగా గాయపడి దస్సివున్నది. అయినా, అది కొండవాగును సునాయసంగా లంఘించి పరిగెత్తసాగింది. ప్రతాప్‌ను వెంబడించిన శత్రుఆశ్వికు లిద్దరూ, ఆ వాగును గుర్రాలమీద దాటలేక, దిగి యీదుకుని అవతలి ఒడ్డుకు చేరటంలో కొంత ఆలశ్యమైంది. అయినా, వారు ప్రతాపును వదలదలచలేదు. వాళ్ళ గుర్రపుగిట్టలధ్వని ప్రతాపుడికి వినబడుతూనే వున్నది. ఇక శత్రువులను ఎదుర్కోవటం తప్ప మరో మార్గాంతరం లేదని రాణా నిశ్చయించుకుని, కత్తిదూసి, చైతక్‌ను వెనుదిప్పబోయేంతలో, ఆకస్మికంగా, ''హో, నీలాఘోడేకా అష్వక్ !'' అన్న కేక వినిపించింది. ప్రతాప్ వెనుదిరిగి చూశాడు తన తమ్ముడైన శకటుడు, గుర్రంమీద వేగంగా తనకేసి రావటం అతడి కంటబడింది.

ప్రతాపుడి కండ్లవెంట నిప్పులు రాలినై. అతడు కత్తి పైకెత్తి, "సంగ్రామసింహుడి పౌత్రుడవై వుండీ, నీవు మొగలులకు దాసుడ వయ్యావు. ఒకవేళ అది మహాపాపకార్యం కాదనుకున్నా, యిప్పుడు నీ అన్ననే చంపటానికి వస్తున్నావు. వంశకళంకుడవైన నీ రక్తంతో, ఆ కళంకాన్ని యిప్పుడే కడిగేస్తాను," అంటూ చైతక్‌ను శకటుడికేసి ఉరికించాడు

శకటుడు, సోదరుడిమాటలు వింటూనే గుర్రంనుంచి కిందికి దూకి, అతడికి ప్రణామం చేస్తూ తలవాల్చి నిలబడ్డాడు. ప్రతాపుడు అతణ్ణి సమీపించి, ముఖం కేసి చూశాడు. శకటుడి కళ్ళవెంట అశ్రువులు రాలుతున్నవి.

"అన్నా! ఒకనాడు నిన్ను చంపాలని ప్రయత్నం చేసినమాట నిజమే. కాని, యీ రోజున యుద్ధరంగంలో, మేవాడ్ రాజ్యంకోసం, నువ్వు మొగలులతో చేసిన పోరాటం చూసిన తరవాత, నా బుద్ధి మారింది. అందుకే నిన్ను చంపేందుకు వెంటాడిన శత్రుసైనికులిద్దరినీ, నా యీటెకు ఎరచేసి, నా దోషాలను క్షమించవలసిందిగా కోరేందుకు నీ దగ్గరకు వచ్చాను." అన్నాడు శకటుడు

ప్రతాపుడు తమ్ముణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, "శకటా! యిది నా పరాజయదినం కాదు. విజయదినం! పోయాడనుకున్న తమ్ముడు, నాకు తిరిగి లభించాడు. ఈనాటినుంచీ మనం మేవాడ్ రాజ్యంకోసం కలిసికట్టుగా పని చేద్దాం. రాజపుత్రులందరినీ ఐక్యపరచగలిగిననాడు, మనను అక్బర్‌గాని, మాన్‌సింగ్‌గాని ఏమీ చేయలేరు," అన్నాడు



## 3

దుర్జయసింగును అరణ్యమార్గంలో వదిలిపెట్టిన తరవాత, తేజసింగు భిల్లుల నివాసానికి తిరిగి

పోలేదు. అతడు ఆ చీకటిరాత్రిలో, కొండమార్గాలవెంట చాలాదూరం నడిచి, ఒకానొక ఎత్తైన పర్వతం చేరి, నక్షత్రాలవెలుగులో ఆ కొండశిఖరాన్ని చేరాడు. అక్కడ. శిఖరానికి దాపులలో ఒక గుహ వున్నది ఆ గుహద్వారాన్ని అతడు సమీపించి, పరిశీలించిచూసి, కవాటం మూయబడివున్నట్టు గ్రహించాడు



తేజసింగు ఆ కవాటాన్ని చేతితో తట్టిచూశాడు. లోపలినుంచి ప్రత్యుత్తరం రాలేదు ఈసారి బలంగా రెండుచేతులతోనూ ద్వారాలను తట్టి, చేత గల పొడవాటి ఈటెను తిప్పి, తలుపులమీద గట్టిగా తాటించాడు

"ఈ అర్ధరాత్రి సమయంలో, వ్యాఘ్రపర్వతానికి వచ్చినవా శ్వెవరు ?" అన్న గంభీరవాక్కు అతడికి, గుహలోపలినుంచి వినబడింది

"రారోడ్‌తిలకసింగు పుత్రుడు, తేజసింగు" అని తేజసింగు ప్రత్యుత్తరం యిచ్చాడు వెంటనే తలుపు తెరుచుకున్నది తేజసింగు గుహలో ప్రవేశించాడు గుహకు ఒకమూలగా ఒక చిన్నదీపం మినుకుమినుకు మంటున్నది ఆ కాంతిలో తెల్లని కేశాలతో, బక్కచిక్కిన దేహంతో వున్న, ఒక వృద్ధస్త్రీని అతడు చూశాడు ఆమే, చారణీదేవి ! వయసు ఎనభై సంవత్సరాలకు పైబడే వుంటుంది

"రారోడ్‌తిలకసింగుపేరు విననివారు మేవాడ్‌రాజ్యంలో వుండరు. అతడిపుత్రు డెలాంటిపనిమీద, చారణిదగ్గరకు వచ్చాడు ?" అని చారణీదేవి ప్రశ్నించింది.

"చితోడ్‌దుర్గాన్ని తురుష్కులనుంచి కాపాడుతూ తిలకసింగు వీరస్వర్గం అలంకరించారు. ఆ తరవాత వారి సూర్యమహల్‌దుర్గాన్ని చోండావత్ వంశజు డైన దుర్జయసింగు ఆక్రమించుకున్నాడు. ఆ ప్రయత్నంలో ఆ దుష్టుడు తిలకసింగు ధర్మపత్నినికూడా వధించాడు. ఇదంతా పదేళ్ళనాటిమాట. అప్పటికి ఎనిమిదేండ్ల వయసుగల తిలకసిగు పుత్రుడనైన నేను, దుర్గగవాక్షంనుంచి కిందవున్న నదిలోకి దూకి, ప్రాణరక్షణ చేసుకున్నాను అప్పటినుంచీ ఈ పదేండ్లుగా, నేను కొండ గుహల్లో భిల్లులమధ్య బ్రతుకుతున్నాను. ఈరాత్రి ఆ దుర్జయసింగును, ఒక మహా వరాహపుబారినుంచి కాపాడి, సూర్యమహల్‌కు దారి చూపించాను ఆ నీచుణ్ణి ఆ సమయంలో నేను చంపగలిగుండీ, ధర్మయుద్ధంలో అతణ్ణి మట్టుపెట్టేందుకు, ప్రాణాలతో పోనిచ్చాను. నీవు, భూత భవిష్యత్ వర్తమానాలు తెలిసిన మహా చారణీదేవివి. ఆ చోండావత్ హంతకుణ్ణి నేను జయించి నా పూర్వుల సూర్య మహల్‌దుర్గాన్ని తిరిగి ఆక్రమించుకోగలనేమో చెప్పకోర్తాను," అని విన్నవిం చాడు తేజసింగు.

చారణీదేవి కొద్దిసేపు మౌనం వహించి, తరవాత తేజసింగు వదనంలోకి సూటిగా చూస్తూ, "బిడ్డా! తొందరపడకు. మీ రారోడ్‌ల నివాసస్థానం మార్వాడ్ రాజ్యం. మీ పూర్వులు రాజస్థాన్‌కు తరలివచ్చి, చోండావతుల నోడించి, సూర్య మహల్‌దుర్గాన్ని ఆక్రమించుకున్నారు. ఆ తర్వాత అవకాశం చిక్కగానే, చోండావత్ దుర్జయసింగు తిరిగి రారోడులనుంచి సూర్యమహల్ చేజిక్కించు

కున్నాడు. ఇందులో వున్న అధర్మ మేమిటి ?" అని ప్రశ్నించింది.

"ఆ దుర్జయసింగు చేసినదంతా అధర్మయుద్ధమే మా తండ్రిగారు బ్రతికుండగా, సూర్యమహల్ మీదికి దాడిచేసి, ఎన్నోసార్లు ఓడిపోయాడు. కాని, నాతండ్రి మేవాడ్ రాజ్యరక్షణ ప్రయత్నంలో మరణించగానే, అది అదనుగాతీసుకుని, స్త్రీ అన్న ఆలోచనకూడాలేకుండా, దొంగలా తన అనుచరులతో దుర్గం ప్రవేశించి నా తల్లిని చంపి, దుర్గం ఆక్రమించుకున్నాడు ఇదంతా అధర్మం అనిపించుకోదా, మాతా ?" అన్నాడు తేజసింగు గద్గదస్వరంతో

"రారోడులూ, చోండావతులూ అగర్భశత్రువులు అందువల్లనే యిరుపక్షాలూ రాజపుత్ర వంశీయులే అయినా, పోరు తటస్థపడినప్పుడు వారిలో ధర్మాధర్మ విచక్షణ నశిస్తోంది కాని, నీవు పగతీర్చుకునేందుకూ, తిరిగి సూర్యమహల్ దుర్గాన్ని వశపరుచుకునేందుకూ యిది సమయంకాదు. మేవాడ్ రాజ్యం తిరిగి తురుష్కుల దండయాత్రకు గురికాబోతున్నది సుక్షత్రియులైన రారోడ్, చోండావత్ వంశజులకు, మ్లేచ్ఛజుల నెదిరించి, స్వధర్మాన్ని రక్షించుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది. దుర్జయసింగును ఖండింపదలచిన, నీ వీరఖడ్గంతో, హల్దీఘాట్ దగ్గిర అప్రమత్తుడవై వుండు. ఈ సమయంలో అంతఃకలహం నిషిద్ధం," అన్నది చారణీదేవి.

తేజసింగు మరేమో చెప్పబోయేంతలో, గుహలో మినుకు మినుకుమంటున్న దీపకాంతి చప్పున ఆరిపోయింది తేజసింగు, ఆ చీకటిలోనే చారణీదేవికి ప్రణామం చేసి, గుహనుంచి బయిటికి వెళ్ళిపోయాడు ఆ మర్నాటి ఉదయమే అతడు మహారాణా ప్రతాపసింగు సేనలతో కలిసి హల్దీఘాటుకు పోయి, అక్కడ జరిగిన యుద్ధంలో, వీరోచితంగా పోరి, ఎందరో శత్రుసైనికులను తన ఖడ్గానికి బలిచేశాడు.

## 4

హల్దీఘాట్ యుద్ధానంతరం ఒకనాడు తేజసింగు, తాను నివశించే పర్వతలోయలోని ఒక సరస్సుదగ్గిర, ఒక పెద్ద బండరాయిమీద కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు అది సాయంసమయం చుట్టూ వున్న అరణ్య వృక్షాలు గాలితాకుడుకు నిశ్శబ్దంగా కదులుతున్నవి వానాకాలం ప్రారంభం కావటంతో మొగలు సేనలు మేవాడ్ రాజ్యంలోని కొండలూ, అడవులూ వదిలి, సమతల ప్రదేశాలకు వెళ్ళిపోయినై. మరి యింతలో మొగలుల దాడిభయంలేదు

తేజసింగు, సూర్యమహల్ దుర్గాన్ని తాను వశపరుచుకునే విషయంలో చారణీదేవి యిచ్చిన సలహా గురించి తర్జన భర్జన చేస్తుండగా, హఠాత్తుగా అతడిమీద

నీటితుంపరలు పడినై. అన్యమనస్కంగా వున్న అతడు చప్పున తలఎత్తి ఆకాశం కేసి చూశాడు. ఎక్కడా మబ్బులు లేవు. అంతలో సరస్సువైపునుంచి కిలకిలమన్న నవ్వు అతడికి వినిపించింది. అటు తలతిప్పి చూసేసరికి, సరస్సులో స్నానం చేసి ఒడ్డుకు వస్తున్న భిల్లనాయకుడైన భీమచాంద్ కుమార్తె - పదునారేండ్ల బాలిక కిశోరి. అతడి కంటబడింది

"కిశోరీ ! నీ విక్కడేం చేస్తున్నావ్ ? ఒంటరిగా గూడెం వదిలి యింతదూరం రావచ్చునా ?'' అన్నాడు తేజసింగు

"నువ్వుమాత్రం రావచ్చునా, ఏం ? అసలు నీకొసమే అయ్య పంపితే, వెతుక్కుంటూ యింతదూరం వచ్చాను,'' అన్నది కిశోరి చిరుకోపంగా,

"అయ్య పంపాడా? మరి, ఆ మాటేమిటో చెప్పవ్. సరస్సులో జలక్రీడ లాడుతున్నావేం ?" అన్నాడు తేజసింగు, లేచినిలబడి,

"నా జలక్రీడలసంగతి చూడా పెట్టని నీ కెందుకు ? సరే, ఇంటికి వరిగెత్తు. నీకోసం ఇంతింత పెద్దవాళ్ళు చాలామంది వచ్చారు," అంటూ కిశోరి తిరిగి-సరస్సులోకి వెళ్ళింది.

భీమచాంద్ భిల్లుడు, తేజసింగును పదేళ్ళుగా తన ఇంట వుంచి కాపాడుతున్న గూడెంపెద్ద. అతడి ఏకైకపుత్రిక కిశోరి. వయసులో ఆట్టే తేడాలేని కిశోరీ, తేజసింగులు భీమచాంద్‌యింట చాలా చనువుగా పెరిగారు. చిన్నప్పటినుంచీ కిశోరికి, తేజసింగ్ అంటే ఎక్కడలేని ఆప్యాయత. అది వయసుతోపాటు వృద్ధి అయి, యీనాటికి ప్రేమగా మారింది; కాని, ఆసంగతి కిశోరి ఏనాడూ తేజసింగుకు తెలియనివ్వలేదు.

తనకోసం వచ్చినవారు ఎవరై వుంటారా ? అనుకుంటూ తేజసింగు తొందర తొందరగా భిల్లగూడెం చేరాడు అక్కడ భీమచాంద్ గృహంలో అతడి రాకకు ఎదురు చూస్తూ, పహాడ్ జీభూమిజా, చంద్రపుర గ్రామపెద్ద వృద్ధ గోకులదాసూ కనిపించారు. తేజసింగు ఇంట్లోకి రావటం చూస్తూనే, ఆ ఇద్దరూ లేచి వినయంగా అతడికి నమస్కరించారు.

తరవాత సంభాషణ జరిగిపోయిన హల్దీఘాట్ యుద్ధాన్నిగురించీ, మహారాణా ప్రతాపసింగును గురించీ కొంతసేపు జరిగి, చివరకు దుర్జయసింగు ఆక్రమించుకునివున్న సూర్యమహల్‌దుర్గంమీద తేజసింగ్ ఎప్పుడు దాడి చేయతలపెట్టా డన్న విషయానికి మళ్ళింది.

పహాడ్ జీభూమిజా తన భూమిజాసైన్యంతో తేజసింగుకు సాయం వస్తానన్నాడు.

గోకులదాసు తన వంశీసైనికుల సహాయం వుంటుందన్నాడు, భీమచాంద్ తన భిల్లానుచరులు అతడికోసం రక్తం ధారపోయగలరని విన్నవించాడు.

తేజసింగు అంతా శ్రద్ధగా విని, వారు చేస్తామన్న సహాయానికి కృతజ్ఞత తెలుపుకుని, 'సూర్యమహల్‌దుర్గంమీద దాడివెడలేందుకు నే నెన్నడో నిశ్చయించాను కాని, హల్దీఘాట్ యుద్ధానికి కొంచెంముందుగా, నేను వ్యాఘ్రపర్వతంమీదికి వెళ్ళి, అక్కడ చారణీదేవిని దర్శించాను ఆమె నాకు, మేవాడ్‌రాజ్యం తురుష్కుల దాడికి గురికానున్న తరుణంలో, రాజపుత్రులమధ్య అంతఃకలహాలు మంచిది కాదని సలహా యిచ్చింది ఆకారణంగా, నేను సూర్యమహల్‌దుర్గంమీద దాడి చేసే విషయం ఆలోచించటం మానుకున్నాను," అన్నాడు

''తురుష్కుల ప్రమాదం మరి యిప్పట్లో వుండదు. ఈ వానాకాలం గడిచిన తరవాతగాని, వాళ్ళు తిరిగి మేవాడ్‌రాజ్యంమీద దండెత్తేవిషయం ఆలోచించరు, దుష్టుడైన ఆ చోండావత్‌దుర్జయసింగునుంచి, నీ పూర్వుల దుర్గాన్ని ఆక్రమించుకోవటానికి, యిదే మంచితరుణం,'' అన్నాడు వృద్ధగోకులదాసు.

గోకులదాసు అభిప్రాయంతో భీమచాంద్, పహాడ్‌జీభూమిజా పూర్తిగా ఏకీభవిస్తున్నట్టు తలలు వూపి, తేజసింగు అభిప్రాయం వినేందుకు అతడి వదనంకేసి ఆసక్తిగా చూడసాగారు

తేజసింగు ఓక్షణకాలం తలవంచి వూరుకుని, తరవాత తలఎత్తి, గోకులదాసు కేసి ఎంతో గౌరవాదరాలు వుట్టిపడేలా చూస్తూ, "అయ్యా, మీ పుత్రశోకం నాకు తెలియందికాదు దుర్జయసింగు దుష్టపరిపాలనలో పౌరులందరూ నానాయిక్కట్లూ పడుతున్నారని వింటున్నాను నా తండ్రిగారి ప్రియమిత్రుడూ, రాఠోడ్ వంశీయుల్లో పయోవృద్ధుడూ అయిన, భీమగడ్‌దుర్గాధిపతి దేవసింహుడి అభిప్రాయంకూడా తెలుసుకుని, ఈ విషయంలో ఒక నిర్ణయానికి రావటం మంచిది, నేను యిప్పుడే బయలుదేరి భీమగడ్ వెళతాను,'' అంటూ లేచి కుటీరంనుంచి బయటికి వెళ్ళిపోయాడు

తేజసింగు తండ్రి అయిన తిలకసింగు అనుచరులలో దేవీసింహుడు ముఖ్యుడు. రాఠోడ్ వంశీయులు మొట్టమొదటిసారిగా, సూర్యమహల్‌దుర్గాన్ని వశపరచుకోవటంలో, దేవీసింహుడి పూర్వు డొకడు ఎంతో సహాయం చేశాడు. ఆ కారణంగా, ఆనాటి సూర్యమహల్ దుర్గాధిపతి, ఆయనకు దాపులనే వున్న భీమగడ్ దుర్గాన్ని కానుకగా యిచ్చాడు ఆనాటినుంచీ భీమగడ్ దుర్గాధిపతులు, సూర్యమహల్ దుర్గ

పరిపాలకులకు సామంతులుగా వుంటూ, అనేక యుద్ధాల్లో తమ ప్రభువుకోసం రక్తం ధారపోశారు.

తేజసింగు రాత్రి మూడవజాము ప్రాంతాల భీమగడ్‌దుర్గం చేరాడు. ఆతడి రాక భటులద్వారా ముందుగా తెలుసుకున్న దేవీసింహుడు, తన అనుచరులలో వచ్చి, దుర్గద్వారందగ్గిర అతడికి స్వాగతం పలికాడు అతడి అనుచరులైన రారోడు సైనికులు తేజసింగుకు జయజయధ్వానాలు చేశారు

అందరూ సభామంటపం చేరిన తరవాత, దేవీసింహుడు ఒక ఎత్తయిన ఆసనం మీద తిలకసింగును ఉపవిష్టుణ్ణి చేసి, చేతులు జోడించి, "ఈ దాసుడు నాయనగారి పట్టాభిషేకం చూశాడు. తమ పట్టాభిషేకంకూడా చూడాలని వున్నదే. సూర్య మహల్ పీఠంమీద తమను కూర్చోబెట్టాలనే ఒక్కగానొక్క కోర్కె, నా కింకా మిగిలి వున్నది," అన్నాడు.

"దేవీసింగ్ ! నాయనగారి అనుచరులలో నీఅంత వృద్ధులు మరెవరూ లేరు హల్దీఘాట్ యుద్ధంలో మీరు అనేకమంది యువకులకన్న గొప్పగా పోరాడటం నేను చూశాను. కాని, సూర్యమహల్ వశపరుచుకోవటం అంత తేలిక కాదేమో అని నాకు భయంగా వున్నది," అన్నాడు తేజసింగు.

"ప్రభూ, ఆ పని అంత తేలిక అని నేనూ అనుకోవటం లేదు. చోండావత్ దుర్జయసింగుకు పదివందల సైనికు లున్నారని నేను విన్నాను మనం అయిదు వందలమంది రారోడులను సమీకరించగలం. ఆ వేయిమంది చోండావతులకు యీ అయిదువందలమంది రారోడులు చాలరా?" అన్నారు దేవీసింహుడు

తేజసింగు చిరునవ్వు నవ్వి, "నీ ప్రభుభక్తికి సంతోషం. నాయనగారి మిత్రులైన మరిముగ్గురు నాయకులు, ఒక వేయిమంది సైనికులతో మనకు సహాయం రాగలరు," అన్నాడు.

"అలా అయితే, సూర్యమహల్ దుర్గంమీద దాడికి కాలయాపన చేయటం ఎందుకు?" అన్నాడు దేవీసింహుడు.

"దానికి ఒక ముఖ్యకారణమే వున్నది మేవాడ్ రాజ్యానికి యింకా మొగలుల దాడి భయం పోలేదు. రాజపుత్రులమైన మనం అందరం అంతఃకలహాలు మాని మహారాణాప్రతాపసింగుకు యుద్ధంలో సహాయపడవలసిన కాలం యిది." అన్నాడు తేజసింగు.

"తమ ఆజ్ఞప్రకారమే నడుచుకుంటాం. మొగలుల భయం పోయిన మర్నాడు,

మేమంతా మీకు అండగా వుండి, సూర్యమహల్‌దుర్గాన్ని జయించిపెట్టగలం." అన్నాడు దేవీసింహుడు

తేజసింగు సూర్యోదయకాలంవరకూ, ఛీమగడ్ దుర్గంలోనే గడిపి, సూర్యోదయం అవుతూనే, తన నివాసానికి బయలుదేరాడు దారిలో అతడకి ఎడతెగని ఒకే ఆలోచన సూర్యమహల్‌దుర్గంమీద సాధ్యమైనంత త్వరలో దాడి చేయటమా ? మానటమా ? దేశానికి యిప్పట్లో మరి మొగలుల ప్రమాదం వుంటుందా, వుండదా...?

# 5

రాణాప్రతాపుడూ, మరికొందరు రాజపుత్రనాయకులూ అనుమానించినట్టే, మొగలులు వానాకాలం పోగానే, తిరిగి మేవాడ్ రాజ్యంమీదికి దాడి వచ్చారు. ఈ దాడిలో ముందుగా మొగలుల సేనాని అయిన, షాహబాజ్‌ఖాన్ కుమల్నేర్ దుర్గాన్ని గొప్పబలంతో చుట్టుముట్టాడు. ఆ సమయంలో కుమల్నేర్, రాణా మేనమామ అయిన ప్రమరవంశనాయకుడు బిజిలీ రక్షణలో వున్నది బిజిలీ అపారమైన మొగల్ సేనతో కొన్నాళ్ళు యుద్ధం చేసి, చివరకు తన సైనికులతో పాటు పోరులో వీరమరణం పొందాడు. దుర్గం మొగలుల స్వాధీనం అయింది మరొక మొగలు సేనాముఖ్యుడైన రాజామాన్‌సింగ్ ధర్మేతీ గోగొండ దుర్గాలను వశపరుచుకున్నాడు. మహాబత్‌ఖాన్ ఉదయపూర్ దుర్గాన్నీ, ఫరీద్‌ఖాన్ అనే మొగలు సేనాని చావంద్ దుర్గాన్నీ ముట్టడించారు రాణాప్రతాప్ తనవెంటవున్న కొద్ది బలంతోనూ, భిల్లుల సాయంతోనూ తన దుర్గాలను రక్షించుకునేందుకు వీరోచితంగా పోరాడాడు. కాని, మొగలులు నష్టమైన తమ సైన్యాన్ని ఎప్పటికప్పుడు ఢిల్లీనుంచి వచ్చిన కొత్త సేనలతో భర్తీ చేసుకుని విజృంభించసాగారు ఈ దశలో రాణాప్రతాప్ తన భార్యా పిల్లలను చోండావత్ దుర్జయసింగు ఆధీనంలో వున్న సూర్యమహల్ దుర్గానికి పంపాడు

కొద్ది రోజుల తరవాత దుర్గాన్ని మొగల్‌సైనికులు ముట్టడించారు మొగలుల దాడి వృత్తాంతం తెలిసి, తేజసింగు తన రారోడు సైనికులతో సూర్యమహల్ దుర్గానికి వచ్చాడు. మహరాణీ, పిల్లలూ దుర్గంలో వుండటం వల్లా, అది రాజపుత్రులకు గొప్ప విపత్సమయం కావటంవల్లా, దుర్జయసింగు, తేజసింగును దుర్గంలోకి ఆహ్వానించాడు ప్రతాపుడి భార్యనూ, సంతానాన్నీ రహస్యంగా దుర్గంనుంచి బయటికి తీసుకుపోయి, భిల్ల నాయకుడైన భీమచాంద్ ఇంట వుంచారు ఈ కార్యం చాకచక్యంగా నెరవేర్చినవాడు తేజసింగు. రాణా భార్యా బిడ్డలతోపాటు, దుర్గంలో

వున్న మరికొందరు రాజపుత్ర కాంతలుకూడా భీమచాంద్ నివాసానికి తరలించబడ్డారు వారిలో పుష్పకుమారి అనే రాజపుత్రకన్యకూడా వున్నది ఆమె తేజసింగు చిన్న నాటి స్నేహితురాలు. ఇద్దరూ ప్రేమించుకున్నారు. కాని, తేజసింగు ఆ తరవాత పది సంవత్సరాలకాలం కనబడకుండా పోవటంతో, పుష్పకుమారిని ఆమె తలి దండ్రులు దర్జయసింగు కిచ్చి వివాహం చేయ నిశ్చయించారు ఆమె నిరాకరించింది ఆ స్థితిలో, తేజసింగూ, ఆ కన్యా తిరిగి కలుసుకుని, ఒకరి ప్రేమ ఒకరు చెప్పుకున్నారు.

స్త్రీలను భిల్లనాయకుడి గృహంలో రహస్యంగా దిగవిడిచి, తేజసింగు తిరిగి సూర్యమహల్‌కు రాగానే, మొగలులు మహా ఉధృతంగా దుర్గాన్ని ముట్టడించారు. ఆ పోరు రెండు మూడు నెలలు సాగింది మొగ్గలులను ఎదిరించటంలో తేజసింగూ, దుర్జయసింగూ ఒకరికొకరు పోటీపడి, ప్రాణాలకు తెగించి పోరాడారు ఆ కారణంగా, ఆ ఇద్దరికీ ఒకరి పౌరుష ప్రతాపా లొకరికి తెలిసే అవకాశం కలిగింది.

ముట్టడి మరోనెల సాగింది దుర్గంలో నిలవవుంచిన ఆహారపదార్థాలు అయిపోయినై. ఆ తరవాత ఒకటి రెండు రోజులకే తాగేనీరుకూడా లభించని స్థితి వచ్చింది. అది గ్రహించిన మొగలులు దుర్గద్వారాన్ని బద్దలుకొట్టి లోపల జొరబడ్డారు. చోండావత్, రాఠోడు సైనికులు తమతమ నాయకుల అధ్వర్యంలో సింహాల్లా పోరి, ఒక్కరొక్కరే మరణించసాగారు. ఆ పరిస్థితుల్లో యిక దుర్గ రక్షణ అసాధ్యమని తేజసింగుకూ, దుర్జయసింగుకూకూడా తెలిసిపోయింది ఇప్పుడేం చేయాలి ?

"మనం వృధాగా యిక్కడ మరణించేకన్న, బతికివుంటే మహారాణాకు మరొక యుద్ధంలో తోడ్పడగలం," అన్నాడు తేజసింగు.

"అది నిజమే ! కాని, దుర్గంనుంచి బయటపడటం ఎలా ? వందల సంఖ్యలో వున్న మొగలులను చీల్చుకుంటూ మనం ముందుకు వెళ్ళలేం కదా ?" అన్నాడు దర్జయుడు.

తేజసింగు, తా మున్న మేడ పై భాగం ద్వారంలోనుంచి, కింద పారుతున్న నదిని చూపించి, "ఇప్పటికి పది పన్నెండేళ్ళ క్రితం రారోడుబాలు డొకడు శత్రువునుంచి ప్రాణం కాపాడుకునేందుకు, యిక్కణ్ణించే ఆ నదిలోకి దూకి ఆరణ్యం చేరాడు. ఆ రారోడు చేసిన సాహసం, చోండావతు చేయలేడా ?" అంటూ ఎగిరి నదిలోకి దూకాడు. దుర్జయసింగుకూడా అతడికి వెనకగా నదిలోకి దూకాడు. ఆ ఇద్దరూ మొగలుబాణాలను తప్పుకుంటూ నదివాలుకు కొంతదూరం ఈదుకుపోయి

ఒడ్డు చేరారు. సూర్యమహల్‌దుర్గం మొగలుల స్వాధీనం అయిపోయింది.

క్రమక్రమంగా మేవాడ్ రాజ్యంలోని పర్వతదుర్గా లన్నీ మొగలుల స్వాధీనం అయినా రాణాప్రతాపుడు తన శక్తికొలదీ దేశరక్షణకొరకు ప్రయత్నించాడు. అయినా, మొగలుల సంఖ్యాబలంముందు అతడు ప్రతియుద్ధంలోనూ ఓడిపోక తప్పలేదు చిట్టచివరకు అతడి స్వాధీనంలో ఒక్క చావంద్‌దుర్గం మాత్రం మిగిలింది దానిమీదికి మొగలు సేనాని ఒకడు పెద్ద సైన్యంతో వస్తున్నట్టు రాణాకు వార్తలు అందినై. ఆ దశలో రాణా, అక్బర్‌పాదుషాతో సంధికి అంగీకరించటం బావుంటుందేమో అని కూడా యోచించాడు కాని, ఆఖరు నిమిషంలో అభిప్రాయం మార్చుకుని, భార్యాబిడ్డలతోనూ, తన ముఖ్యానుచరులతోనూ మేవాడ్ రాజ్యం వదిలి వెళ్ళ నిశ్చయించాడు.

రాణాప్రతాపుడి అనుచరు లందరికీ అదే సముచిత నిర్ణయంలా కనిపించింది అందరూ కుటుంబాలను వెంటబెట్టుకుని, దుర్గమారణ్యాలవెంట కొన్నాళ్ళు ప్రయాణం చేసి, ఆరావళీ పర్వతాలు దాటి, ఒక సంధ్యా సమయంలో మరుభూమిలా వున్న ఒకానొక ప్రదేశంలో విశ్రాంతి తీసుకుంటున్నారు హఠాత్తుగా అక్కడికి రాణా మంత్రి అయిన భామాషాహి కొందరు అనుచరులతో వచ్చిచేరాడు

భామాషాహి కొన్నినెలలుగా రాణాను వదిలి ధనం పోగుచేసుకు వచ్చేందుకు వెళ్ళివున్నాడు; కాని, రాణాకు అతడు ధనం తేగలడన్న నమ్మకంలేదు. కారణం, మేవాడ్‌రాజ్య మంతా ఎడతెగని యుద్ధాలతో సర్వనాశన మైవున్నది

భామాషాహి, మహారాణాకు నమస్కరించి, "మహారాజా ! మనం తిరిగి మేవాడ్ రాజ్యరక్షణకు కాయశక్తులా ప్రయత్నించవచ్చు. నేను తెచ్చినధనం ఇరవై అయిదు వేలమంది సైనికులను, పన్నెండేళ్ళపాటు పోషించేందుకు సరిపోతుంది." అన్నాడు.

"అమాత్యా, యింతధనం మీ రెలా పోగుచేయగలిగారు ?" అని అడిగాడు, ప్రతాపుడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

"ఈ ధనమంతా మా పూర్వులు మేవాడ్ మహారాణాలవద్ద ప్రధానమంత్రిత్వం నెరపి కూడబెట్టినది. ఈ కష్టకాలంలో ఆ ధనాన్ని తమద్వారా దేశస్వాతంత్ర్యరక్షణకు వినియోగించదలచాను; స్వీకరించండి." అన్నాడు భామాషాహి

ప్రతాపుడు ఆ ధనం తీసుకునేందుకు మొదట అంగీకరించకపోయినా, అనుచరుల్లో వృద్ధులైనవారు, దేశరక్షణకు యింతకంటె ఉత్తమమార్గం మరిలేదని చెప్పిన మీదట అంగీకరించాడు, కొద్దిరోజుల్లోనే రాణాప్రతాపుడు తిరిగి మేవాడ్‌రాజ్యం

ప్రవేశించి, సైన్యాలను సమకూర్చుకుని, మొగలు లాక్రమించిన దుర్గాలమీద పెను తుఫానులా విరుచుకుపడ్డాడు.

మొట్టమొదటిసారిగా రాణాకు కలిగిన విజయం దేవరీయుద్ధంలో. ఇక్కడ షాహబాజ్ ఖాన్ అనేవాడు పెద్ద మొగలుసైన్యంతో నిశ్చింతగా కాలం గడుపుతున్నాడు. రాణా మేవాడ్ రాజ్యసరిహద్దుల్ని దాటి ఎక్కడికో వలసపోయాడన్న యూథీవార్తను అతడు బాగా నమ్మాడు. కాని, రాణా హఠాత్తుగా వచ్చిపడి, అతణ్ణి ససైన్యంగా నిర్మూలించాడు

రాణా చేసిన రెండవదాడి కుమల్నేర్ దుర్గంమీద దుర్గరక్షకుడైన అబ్దుల్లా చిత్తుగా ఓడిపోయాడు ప్రాణాలతో పారిపోయిన మొగలులను వేళ్ళపై లెక్కించవచ్చు ఆ తరవాత ఉదయపూర్ ప్రాపుడి స్వాధీన మయింది. ఈ విధంగా, చితోడ్, అజ్మీర్, మండల్‌గడ్ దుర్గాలుతప్ప, రాజ్యంలోని తతిమ్మా దుర్గాలన్నీ రాణా స్వాధీనమయినై అక్బర్‌పాదుషా ఎంతో కష్టనష్టాలతో పదిసంవత్సరాలలో జయించిన దుర్గా లన్నిటినీ, రాణా పన్నెండు నెలలలో స్వాధీనపరుచుకున్నాడు.

తేజసింగ్, దుర్జయసింగులు తమ శత్రుత్వాలను మరిచి, ప్రతాపుడు తురుష్కులతో చేసిన అన్నియుద్ధాల్లోనూ పాల్గొన్నారు. ఆఖరుకు, వారిద్దరి నాయకత్వంకిందా రాజపుత్రులు, సూర్యమహల్ దుర్గాన్ని ముట్టడించి, మొగలులను నిశ్శేషంగా వధించి, దుర్గా న్నాక్రమించుకున్నారు. దుర్గంలో మొట్టమొదటగా తేజసింగు తన అనుచరులతో జొరబడ్డాడు. ఆ తరవాత దుర్జయసింగుకూడా అక్కడికి వచ్చాడు.

తేజసింగు, దుర్జయుణ్ణి చూస్తూనే, "దుర్గాధిపులైన మీ అనుమతి లేకుండా దుర్గంలో కాలుపెట్టినందుకు క్షమించండి. ఈ పొరపాటు జరగటానికి కారణం మహారాణావారి సేవలో వుండటంతప్ప మరేమీకాదు. దుర్గాన్ని ఏలుకొండి, నే వెళ్ళిపోతున్నాను," అన్నాడు

ఈ మాటలు దుర్జయసింగుకు ఎక్కడలేని కోపాన్నీ తెప్పించినై. అతడు తేజసింగుకేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూస్తూ, "రాఠోడ్ ! కాలవశాన నాకన్న నీవే ముందుగా దుర్గంలో ప్రవేశించావు. నీ అనుచరులతో దుర్గాన్ని రక్షించుకో. నేను నిన్ను బిచ్చమడగబోవటంలేదు. దుర్గద్వారాలను మూసుకో చోండావతుల బాహుబలం ఎలాంటిదో తరవాత చవిచూస్తావు," అన్నాడు

"మహారాణావారి కార్యనిర్వహణలో, నీ దుర్గంలో ప్రవేశించటం జరిగిందని ముందే చెప్పాను. వీలుదొరికింది గదా అని, నమ్మకద్రోహం చేయటం రాఠోడు వంశీయు లెరగరు. ఇంకా మొగలులతో పోరు ముగియలేదు. ప్రబలశత్రువు మనల

నందరినీ నాశనం చేయాలని చూస్తూన్న దశలో, మనలో మనకు అంతఃకలహాలు హానికరం ఆ శత్రువుల భయంపోయిన మర్నాడు రారోడులు. యీ సూర్యమహల్ దుర్గానికి రాగలరు, జాగ్రత్త, చోండావత్!" అంటూ తేజసింగు దుర్గంలోనుంచి తన అనుచరులతో బయటికి వెళ్ళిపోయాడు

సూర్యమహల్ వశమయిన కొద్దిరోజుల తరవాత రాజపుత్రులు, భీమగడ్ దుర్గాన్ని వశపరచుకున్నారు. లోగడ దుర్గాధిపనిఅయిన దేవీసింహుడు, రాణాతో కలిసి మరెక్కడో యుద్ధాలు చేస్తూండగా, మొగలులు భీమగడ్ దుర్గాన్ని ఆక్రమించుకున్నారు అప్పుడు జరిగిన యుద్ధంలో దేవీసింహుడి ఏకైకపుత్రుడు—పద్నాలుగేళ్ళవాడైన చందనసింహుడు శత్రువులతో వీరోచితంగా పోరాడి, పరివారంతో పాటు వీరశయ్య నలంకరించాడు. స్త్రీలందరూ జోహారుచేశారు. వృద్ధుడైన దేవీసింహుడి కిప్పుడు ఆ దుర్గంలో, నా అన్నవా లెవరూ లేరు. ఆతడు దుర్గంలో కూలిపోయిన భవనాలనూ, స్త్రీలు జోహారు చేసిన ప్రదేశాన్నీ చూస్తూ కండ్లనీరు పెట్టుకున్నాడు.

తేజసింగు అతణ్ణి వూరడిస్తూ, "విచారపడకండి. మీ సర్వస్వాన్నీ మహారాణా వారి సేవలో త్యాగం చేశారు. రాజపుత్రుల ధనమూ, పరివారమూ. ప్రాణమూ—అంతా ఆ మహారాణావారిదే," అన్నాడు.

దేవీసింహుడి నేత్రాలనుండి అశ్రువులు ప్రవహించ సాగినై. తేజసింగు ఆ వృద్ధుడి హస్తాన్ని తన శిరస్సుపై పెట్టుకుని, "తాతా! మీ పుత్రు డొకడు మరణించాడు, ఇంకొకడు జీవించి వున్నాడు. మీ ఆశీర్వాదం కొరకు తేజసింగు ప్రార్థిస్తున్నాడు. ఈ పుత్రు ణ్ణాశీర్వదించండి,'' అన్నాడు.

''భగవానుడు సర్వదా నిన్ను రక్షించుగాక! పితృ సింహాసనం త్వరలో నీకు తిరిగి లభించుగాక!'' అని దీవించి, దేవీసింహుడు కళ్ళనీళ్ళు తుడుచుకున్నాడు.

''మీ సహాయం లేకుండా నాయనగారి సింహాసనం నా కెలా లభిస్తుంది? మా నాయనగారి పట్టాభిషేకం చూశామని చెప్పారు, మరి నన్నా సింహాసనం మీద నిలిపేందుకు సాయపడరా?" అని అడిగాడు తేజసింగు.

దేవీసింహుడు కత్తిదూసి పైకెత్తి, ''అవును, జీవితంలో నెరవేర్చవలసిన ఇంకొక కార్యభారం నామీద వున్నది. నిన్ను, నీ తండ్రిగారి సింహాసనంమీద కూర్చోబెట్టగలనని చేసిన శపథం మరిచిపోలేదు," అన్నాడు.

# 6

మేవాడ్ రాజ్యంలోని ముఖ్యదుర్గాలు చాలా స్వాధీనమయినప్పటికీ, మహారాణా ప్రతాపుడు, కొండల్లోనే నివసిస్తున్నాడు. చితోడ్‌దుర్గం తన స్వాధీనం కానిదే తాను ఎలాంటి దుర్గంలోనూ నివసించనని ఆయన లోగడ ప్రతిజ్ఞ చేసివున్నాడు. ఇప్పుడాయన నివసిస్తున్న పర్ణశాలలాటి చిన్న ప్రదేశం, భీమచాంద్ కుటీరానికి కొద్ది దూరంలో వున్నది. సూర్యమహల్ దుర్గం మొగలుల స్వాధీనం అయేముందు, తేజసింగు ప్రేమించినపు ష్పకుమారికూడా, మహారాణితోపాటు భిల్లనాయకుడైన భీమచాంద్ కుటీరానికి చేర్చబడింది. ఆ కార్యభారం నిర్వహించినవాడు తేజసింగు

తేజసింగు తండ్రి అయిన తిలకసింగూ, పుష్పకుమారి తండ్రీ ప్రాణ సేహితుల లాటివారు. పుష్పకుమారికి ఏడేళ్ళ వయసూ, తేజసింగుకు పదేళ్ళ వయసూ వచ్చే సరికే, వా రిద్దరికీ భవిష్యత్తులో వివాహం చేయాలని వారి తండ్రు లిద్దరూ నిర్ణ యించుకున్నారు కాని, విధి వశాన, తిలకసింగూ అతని మిత్రుడూ మొగలుల నుంచి చితోడ్ దుర్గాన్ని రక్షిస్తూ మరణించారు. ఆ తరవాత తేజసింగు తన సూర్యమహల్‌ను కోల్పోయి భిల్లులమధ్య జీవించసాగాడు. పుష్పకుమారి తండ్రి మరణించిన తరవాత, దుర్జయసింగు బంధుగణంలో చేరి సూర్యమహల్‌లో నివ సించసాగింది కాని, తేజసింగుగాని, పుష్పకుమారిగాని తమ బాల్యస్నేహాన్నీ తమ తండ్రులు చేసుకున్న నిర్ణయాన్నీ మరిచిపోలేదు. దాదాపు ఎనిమిదేళ్ళపాటు, తేజసింగు బతికివున్నదీ లేక మరణించిందీకూడా పుష్పకుమారికి తెలియదు. చోండావత్‌దుర్జయసింగూ అతడి అనుచరులూ అనుకునేదాన్నిబట్టి, అతడు దుర్గ ద్వారంనుంచి నదిలో దూకి బహుశా ప్రాణాలు కోల్పోయే వుంటాడని ఆమె భావించింది.

ఈ కాలంలో దుర్జయసింగు పుష్పకుమారిని పరిణయమాడేందుకు చాలా ప్రయ త్నాలు చేశారు. ఆమె బంధుగణమంతా ఆమెను అందుకు ఒప్పించేందుకు శతధా ప్రయత్నించారు. వారందరికీ ఆమె, "నాభర్త మరణించాడు. నేను అనాథను." అనిచెప్పి, తన సమస్తాభరణాలూ విసర్జించింది. అప్పటి కామెకుపద మూడో సంవ త్సరం జరుగుతూన్నది.

కాలం గడిచినకొందికీ పుష్పకుమారిమీద అన్నివైపులనుంచీ వత్తిడి రాసా గింది. బంధువులు బెదిరించసాగారు, దుర్జయసింగు పంపినదూతిక లామెను ప్రలోభ పెట్టసాగారు, అతడి ఐశ్వర్యం, బలపరాక్రమాలూ, కీర్తిప్రతిష్టలూ ఆమెదగ్గిర



యువ

వర్ణించి, 'యింకెక్కడి తేజసింగు ? అత డేనాడో మరణించాడు.' అని చెప్ప సాగారు. 'అందువల్లనే, నే ననాథను నాదగ్గిర మీ ప్రభువును ఎంత పొగడిమాత్రం ఏం ప్రయోజనం ? నే నస్పృశ్యనుగదా ?' అని పుష్పకుమారి బదులు చెప్పసాగింది.

పుష్పకుమారి యిలాంటి సంకట పరిస్థితుల్లో వున్న దశలోనే, మొగలులు సూర్య మహల్‌దుర్గంమీద దాడిచేశారు తేజసింగు, మహారాణా ప్రతాపసింహుని భార్యా పిల్లలతోపాటు, పుష్పకుమారినికూడా దుర్గంనుంచి తప్పించి, భీమచాంద్ కుటీరంలో చేర్చాడు ఆ సమయంలో పుష్పకుమారికి తన ప్రియుడు సజీవుడే అని తెలిసిపోయింది ఒకరినొకరు గుర్తుంచుకున్నారు తేజసింగు తన ప్రేమచిహ్నంగా, పుష్పకుమారికి తన వేలివుంగరం యిచ్చాడు ఆ ఉంగరాన్ని ఆమె, వేలికి పెట్టు కుంటే జారిపోతుందేమో అన్న భయంతో, మెడలోవున్న సగ కొకదానికి కట్టి ధరించసాగింది

*　　*　　*　　*　　*

తేజసింగు, భీమగడ్ దుర్గాధిపుడైన వృద్ధదేవీసింహుడితో మాట్లాడి భీమ చాంద్ కుటీరానికి తిరిగివస్తూండగా, దారిలో భిల్లనాయకుడికుమార్తె కిశోరి అతడికి ఎదురైంది. తేజసింగు యీమధ్య, కిశోరి మాటలధోరణినిబట్టి, తన నా బాలిక ప్రేమిస్తున్నదని తెలుసుకున్నాడు కాని, ఆప్రేమ వృథా తన హృదయం ఎప్పుడో మరొకరికి అంకితమైపోయింది. కాని, కిశోరికిమాత్రం ఆశ నశించినట్టులేదు.

''ఎక్కణ్ణించి రావటం ? దుర్జయసింగు వివాహానికి సంబారాలు పోగుచేసే పనిలో తిరుగుతున్నావా ఏం ?'' అని ఎలకరించింది కిశోరి

"దుర్జయసింగు వివాహమా ? ఆసంగతి నా కేం తెలియదే అయినా, ఆ దుష్టుడి వివాహానికి నే నెందుకు తోడ్పడతాను వాడు నాకు ఆజన్మ శత్రువు." అన్నాడు తేజసింగు కోపంగా

"ఆ ఆజన్మశత్రువు పుష్పకుమారిని పెళ్ళాడబోతున్నాడు; నీ కింకా తెలియలే దన్నమాట !" అన్నది కిశోరి,

తేజసిం గా మాటలు వింటూ నిశ్చేష్టుడయిపోయాడు, కొంచెంసేపటికి తెప్ప రిల్లి, ''కిశోరీ! నీ బుద్ధి సర్వం నశించినట్టు కనబడుతున్నది యీమాటే ఎవరైనా అంటే, ప్రాణం తీసివుందును ఆడపిల్లవు ' సరే, యిక నోరు మెదపకుండా, నీ దారిన నువ్వు పో,'' అన్నాడు

"నే నెవరిదారికీ అడ్డంకాదు ఆజన్మశత్రు వన్నావే — ఆ దుర్జయసింగుకూడా నిజంగా నీకు శత్రువుకాదు ఏ కన్యఅయినా, పాపం, ప్రేమించి స్వయంగా ముద్దు

టుంగరం యిస్తానంటే, ఏ పురుషుడు వద్దని నిరాకరించగలడు? పుష్పకుమారి తన కెవరో అమాయకు డిచ్చిన వుంగరాన్ని, అతడి వేలికి తొడిగింది. అతడు వివాహానికి సమ్మతించాడు. అతణ్ణి ద్వేషించటంవల్ల నీ కొరిగే దేముంటుంది?" అన్నది కిశోరి

కిశోరి మాట పూర్తి చేసేలోపలే తేజసింగు పెద్దగా ఒక కేక పెట్టి, ఆ బాలికను రెండుచేతులతో పైకెత్తి, బలంగా పక్కనే వున్న సరస్సులోకి విసిరివేశాడు. కిశోరి భీతికొందికీ బిగ్గరగా అరిచినా, బాగా ఈతవచ్చినది గనక, సరస్సు అవతలి ఒడ్డుకు సునాయాసంగా యీదుకుపోయింది. తేజసింగు హృదయాన్ని మాత్రం కారుమేఘంలాంటి అనుమానం కప్పివేసింది. కిశోరి మరీ అంత అబద్ధం ఎలా చెప్పగలుగుతుంది? ఆమె మాటల్లో ఏ కొద్దిపాటి సత్యమో వుండవచ్చు...

తేజసింగు యిలా ఆలోచిస్తూ, రాణా కుటుంబంతో నివశిస్తున్న పుష్పకుమారిని కలుసుకునేందుకు, ఆ పర్ణశాల వున్న కొండకేసి వెళ్ళాడు. అది సాయంకాల సమయం. పుష్పకుమారి కలశం ఒకటి చేతబట్టి నీరు తీసుకుపోయేందుకు కొండవాగు కేసి నడుస్తున్నది. తేజసింగు ఆమెను చూచి, వడివడిగా ఆమెను సమీపించాడు. పుష్పకుమారి వదనం ప్రసన్నమయింది. కాని తేజసింగు కనుబొమ్మలు ముడిచి, ఆమె ముఖంకేసి తీవ్రంగా చూస్తూ, "నే నిచ్చిన ఉంగరం ఏం చేశావు?" అని కఠినంగా ప్రశ్నించాడు.

తేజసింగు ముఖభంగిమలు చూసి కలతచెందిన పుష్పకుమారి, యీ హఠాత్ప్రశ్నకు మరింత కలగుండుపడిపోయి, "ఉంగరమా! దాన్ని వేలినుంచితే ఎక్కడైనా జారిపోతుందేమోనని, మెడలో యీ కాసులపేరుతో గుచ్చి..." అంటూ కాసులపేరును వేళ్ళతో తడివిచూస్తూనే కెవ్వున కేకవేసింది. అదేసమయంలో కలశం ఆమె చేతినుంచి జారి కిందపడి పెద్దధ్వని చేస్తూ పల్లానికి దొర్లిపోయింది.

"అంతా కపటనాటకం! ఆ ఉంగరం ఎవరిదగ్గిరున్నదో నాకు తెలుసు. ఒక చపలచిత్త కోసం, నా అమూల్య కాలా న్నెంత వ్యర్ధపరచుకున్నాను," అంటూ తేజసింగు గిరుక్కున వెనుదిరిగి, పర్వతం దిగసాగాడు. పుష్పకుమారి, అతడికేసి ఓ తృటికాలం కన్నార్పకుండా చూసి, స్పృహతప్పి కింద పడి పోయింది.

# 6

తేజసింగు రాత్రి రెండుజాములవేళ భీమగడ్ దుర్గాన్ని చేరి, తన రాఠోడ్ బంధుగణాన్నీ, అనుచరులనూ ఒకచోట పోగుచేశాడు. తరవాత వారితో, "బంధువు

లారా, మిత్రులారా! ఇంత కాలానికి మనకు శత్రువుపై పగ తీర్చుకునే అవకాశం కలిగింది. మహారాణా ప్రతాపసింహులు, మొగలులను యీ సంవత్సరకాలంలో జరిగిన ప్రతి యుద్ధంలోనూ ఓడించి, కొండమార్గా లన్నీ వారికి బంద్ చేసి, అనేకానేక దుర్గాలు శత్రువులనుంచి జయించారు. మొగలులు మన తరంలో యిక మన మీద దాడికిరారు. చోండావత్ దుర్జయసింగుపై పగ తీర్చుకునేందుకు యిదే మంచి అదను. అతడు చేసిన మహాపాపా లన్నింటికీ అతడి రక్తంతోనే క్షాళనం జరుగుతుంది,'' అన్నాడు గంభీరంగా.

సైనికులందరూ మహోత్సాహంతో. "తేజసింగు మహారాజుకూ, జై!" అంటూ నినాదాలు పలికారు. తరవాత నిశ్శబ్దంగా సేన సూర్యమహల్‌దుర్గంకేసి కదిలింది. కొంతసేపటికి అందరూ దుర్గంవున్న కొండపాదంలో చేరి క్రమంగా పర్వతారోహణ చేయసాగారు. తేజసింగు అందరికన్న ముందుండి దారి తీస్తున్నాడు. సైనికులలో కొందరు అతడితో, శత్రువు అప్రమత్తుడుగా వున్న యీ రాత్రివేళ హఠాత్తుగా దాడిచేయటం బావుంటుందని సలహా యిచ్చారు.

"తన తండ్రిదైన దుర్గంలో పుత్రుడు దొంగిలా ప్రవేశించవలసిన అవసరం లేదు. అంతేకాక రాజపుత్రుడు నిద్రించే శత్రువుపై బడడు,'' అంటూ జవా బిచ్చి సైనికులందరినీ ఆగవలసిందిగా హెచ్చరించి, దుర్గ ప్రాకారాలకేసి తలఎత్తి పెద్ద గొంతుతో, ''తిలకసింగు కుమారుడు తేజసింగు దుర్గంలో ప్రవేశించేందుకు వస్తున్నాడు; చేతనైనవాళ్ళు మార్గాన్ని అరికట్టవచ్చు,'' అంటూ కేకపెట్టాడు. ఆ వెంటనే భేరీ ఝాంకారాలు మోగినై.

దుర్గప్రాకారాలమీద పహరా యిస్తున్న దుర్జయసింగుసైనికులు, తమ ప్రభువుకు తేజసింగు దాడి వస్తున్న సంగతి చెప్పారు. అతడు దుర్గప్రాకారాల మీదికి వచ్చి, దిగువవున్న రాథోడులను చూసి, ''ఓహో, తిలకుసింగు పుత్రుడు దుర్గాన్నాక్రమించుకోవాలని బయలుదేరాడన్నమాట! యిలాంటి రోజుకోసం బహుకాలంగా ఎదురుచూస్తున్నాను. ఇవాల్టితో నాకు హృదయశాంతి కలుగుతుంది. ఈ లోకంలో మా యిద్దరికీ చోటులేదు. ఎవరో ఒకరు మరణించితీరాలి,'' అనుకుంటూ, ప్రాకారం దిగిపోయి, రెండువందలమంది సైనికులను ప్రాకారం ఆవలి తట్టుకు దింపి, తేజసింగు సైనికులను ఎదిరించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

దుర్గ ప్రాకారాలమీద దివిటీలు వెలిగించబడినై. రెండువందలమంది దుర్జయసింగు సైనికులు, ప్రాకారాలనుంచి దిగి, తేజసింగు సైనికులపైకి రాసాగారు. తేజ

సింగు తన అనుచరులకు యుద్ధసన్నద్ధం కావలసిందిగా హెచ్చరించి బల్లెమూ కత్తీ చేతబట్టి శత్రువులపైకి వురికాడు.

తేజసింగు ధాటికి దుర్జయసింగు సైనికులు నిలబడలేకపోయారు. రాఠోడు సైనికుల్లో ప్రతిఒకడూ, తమ నాయకుడికి తీసిపోకుండా ఘోరయుద్ధం సాగించారు. కొద్దిసేపట్లోనే దుర్జయసింగు సైనికుల్లో సగంమంది హతులయ్యారు మిగిలినవారు భీతిల్లి దుర్గప్రాకారాలకేసి పరుగులు తీశారు.

దుర్గప్రాకారంమీద నిలబడి యిదంతా గమనిస్తున్న దుర్జయసింగు, పండ్లు కొరుకుతూ, 'తిలకసింగు కుమారుడుకూడా తండ్రిలాగా యుద్ధం చేయటం నేర్చుకున్నాడు. భయంలేదు ఈ దుర్జయసింగుహస్తాలు దుర్బలమైనవి కావు. నేటితో యీ తిలకసింగుపుత్రుడి యుద్ధమదం అణుస్తాను,' అనుకున్నాడు.

ఇంతలో తేజసింగు తన అనుచరులతో దుర్గప్రాకారాలను సమీపించాడు. సైనికులలో కొందరు ప్రాకారాలకు ఎగబాకి దుర్గంలోకి దూకేందుకు ప్రయత్నించారు. అలాంటివారిని దుర్జయసింగు సైనికులు బల్లేలతో అరికట్టసాగారు. దివిటీల వెలుగులో సంకులసమరం సాగింది. యుద్ధోత్సాహంలో దుర్జయసింగు సైనికులు కొందరు ప్రాకారాలమీదినుంచి కిందికి దుమికి తేజసింగు సైనికులతో తలపడ్డారు. రక్తం ప్రవహించసాగింది. చాలాకాలంగా శత్రుత్వం వున్న ఆ రెండువంశాల వాళ్ళూ సర్వానికీ తెగించి పోరసాగారు దుర్జయసింగు సైనికులు మాటిమాటికీ సాలుంబ్రా పేరూ, దుర్జయసింగు పేరూ ఉచ్చరిస్తూ, సింహనాదాలు చేయసాగారు. అందుకు ప్రతిగా రాఠోడులు జయమల్లూ, తిలకసింగుల నామాలు భయంకరంగా ఉచ్చరిస్తూ సింహాల్లా పోరసాగారు

తేజసింగు దుర్గద్వారాలను సమీపించి, పెద్ద గొడ్డలితో వాటిని పగలకొట్టేందుకు ప్రయత్నించసాగాడు తలుపులు అతడి గొడ్డలిదెబ్బకు దడదడలాడసాగినై. మరికొందరు రాఠోడులు అక్కడికి వచ్చి, గొడ్డళ్ళతో, పలుగులతో వాటిని పగలగొట్ట ప్రారంభించారు కొద్దిసేపట్లో ద్వారాలు ఫెళఫెళ మంటూ విరిగి వెనక్కు పడిపోయినై.

దుర్గద్వారం విరిగినసంగతి వింటూనే దుర్జయసింగు తన ముఖ్యానుచరులతో అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు ఆ సమయంలో తేజసింగు అనుచరులు సింహనాదాలు చేస్తూ దుర్గంలోకి కాలిడబోతున్నారు దుర్జయసింగు భయంకరంగా గర్జిస్తూ, ''చోండావతులారా! దుర్గద్వారం విరిగింది, కాని, మన ఆత్మాభిమానం, పౌరుషం మొక్కపోలేదు. రండి! రాఠోడులను యమపురికి పంపండి,'' అంటూ

బెబ్బులిలా తేజసింగు అనుచరులపైకి ఉరికాడు. తమ నాయకుడన్న మాటలు వింటూనే, చోండావతులు భూమ్యాకాశాలు కంపించేట్లుగా సింహనాదాలు చేసి, రాఠోడులమీద కలియబడ్డారు.

భయంకరమైన దొమ్మీయుద్ధం ప్రారంభమయింది. సర్వనాశనం తప్పదని గ్రహించిన చోండావతులు తెగించి పోరసాగారు. వాళ్ళధాటికి రాఠోడులు కొంచెం కొంచెంగా వెనకడుగు వేయసాగారు. తేజసింగు సింహనాదం చేస్తూ ఈటెను గిర గిరా తిప్పి, చోండావతులను కుమ్మసాగాడు. అయినా, చోండావతులు వెనకడుగు వేయక, మరింత ముందుకు రాసాగారు.

"తిలకసింగుపుత్రుడు తండ్రిదుర్గంలో ప్రవేశించబోతూంటే, రాఠోడులారా! ఎందుకు వెనకడుగు వేస్తారు?" అంటూ వృద్ధదేవీసింహుడు హుంకరించి కత్తితో చోండావతుల మధ్యకు దూకాడు. అతని రక్షణకై, వెనక్కు తగ్గుతున్న రాఠోడు లందరూ ముందు కురికారు. వాళ్ళధాటికి చోండావతులు నుగ్గునుగ్గయిపోయారు.

వృద్ధదేవీసింహుడి దేహం రక్తంతో తడిసిపోయింది. అతడు తేజసింగు చేయి పట్టుకుని పైకెత్తి, "తేజసింహా! నా ప్రతిజ్ఞ నెరవేరింది. ఇక నాకు సెలవు. తండ్రివలెనే కీర్తిమంతుడవుకా. ఇదే నీకు నా ఆశీర్వాదం," అన్నాడు. అదే సమ యంలో దుర్జయసింగు విసిరిన బల్లెం దేవీసింహుడి గుండెలను తాకింది. అతడు నేల కొరిగాడు.

తేజసింగు, తల తిప్పి బల్లెంవచ్చినవైపుకు చూశాడు. దుర్జయసింగు శరీరమంతా గాయాలుకాగా, విరిగిన కత్తి నొకదానిని పట్టుకుని, చావగా మిగిలిన కొద్దిమంది తన అనుచరులతో అల్లంత దూరంలో నిలబడివున్నాడు. అతడి నేత్రాలనుంచి అగ్నికణాలు రాలుతున్నవి. యుద్ధపిపాస అతడిలో చావలేదు.

వృద్ధదేవీసింహుడి మరణం చూస్తూనే, కొందరు రాఠోడులు క్రోధావేశంతో దుర్జయుడి వైపుకు పోబోయేంతలో, తేజసింగు వారిని వారించి, "దుర్జయుణ్ని వదలండి. అతడిమీద కత్తివేసినవాడు, నాకుప్రబలశత్రువు కాగలడు," అన్నాడు.

ఆ మాటలతో రాఠోడులు వెనక్కు తగ్గారు. కాని, ఆ ప్రశాంత వాతావరణంలో, "ప్రభువువారి ఆజ్ఞ శిరసా వహించదగినది కాని, ఈ దుర్మార్గుడు నా పుత్రహంత కుడు. పుత్రశోకంతో ఎంతోకాలంగా దహించుకుపోతున్నాను," అన్న గంభీర వాక్యాలు వినబడినై. అందరూ ఆటుతిరిగేంతలో వృద్ధగోకుందాసు కుప్పించి

దుర్జయసింగుకేసి దూకి, తన కత్తితో ఆతడిగుండెల్లో బలంగా పొడిచాడు. అదే సమయంలో దుర్జయసింగు విరిగిన ఖడ్గంతో గోకులదాసు తలమీద బలంగా కొట్టాడు బద్ధవైరు లిద్దరూ విగతజీవులై జంటగా నేలమీద పడిపోయారు. వృద్ధ గోకులదాసుని పుత్రశోకం చల్లారింది.

# 7

ఒకనాటి సంధ్యా సమయాన పుష్పకుమారి సెలయేటికి నీటికోసం వెళుతూండగా భిల్లకన్య కిశోరి ఆమెకు ఎదురై, నమస్కరించి, "అమ్మా! మీరు అంత విచారంగా వున్నారేం?" అని అడిగింది.

"విచారమా? నీ వెవరివి? ఓహో, భీమవాండ్ కూతురివా, మాకు కష్టసమయంలో నీతండ్రి ఆశ్రయం యిచ్చాడు. నిన్ను చూసి చాలారోజులైంది; క్షేమంగా వున్నావా?'' అని అడిగింది పుష్పకుమారి.

''అమ్మా, నా క్షేమసమాచారాని కేంగాని, తమ విచారానికి కారణం చెప్పారు కాదే,'' అన్నది కిశోరి.

''జీవితంలో నాకు విచారంతప్ప మరేం మిగిలింది, నేను సర్వం కోల్పోయాను," అన్నది పుష్పకుమారి కంటతడి పెట్టుకుంటూ,

అమ్మా, దుఃఖించకండి. మీరు సుఖపడేరోజు వస్తున్నది. ఏ ఉంగరం పోగొట్టుకుని, మీరు సర్వస్వం కోల్పోయా ననుకుంటున్నారో. ఆ ఉంగరం తిరిగి దాని యజమానికి చేరింది. ఆ ఉంగరాన్ని తమవద్దనుంచి దొంగిలించిన కిరాతకి, ఆ సంగతి దాని యజమానికి తెలియబరుస్తూ, మీమీద అన్యాయంగా చేసిన దుష్టారోపణ గురించికూడా ఆయనకు తెలిపింది. వారు తమ పూర్వులదైన దుర్గాన్ని జయించారు. తమకోసం యిక్కడికి కొద్దిసేపట్లోనే రాగలరు." అంటూ కిశోరి గిరుక్కున వెను దిరిగి, కొండదిగువకు పరుగెత్తసాగింది.

పుష్పకుమారి ఆ భిల్లబాలిక పారిపోకుండా ఆపేందుకు ఎంతో ప్రయత్నం చేసింది. ఆమె తిరిగి రమ్మని పెట్టిన కేకలను ఏమాత్రం లక్ష్యపెట్టకుండా కిశోరి




కొండదిగి, మహారణ్యంలోకి పారిపోయింది. ఆ భిల్లబాలిక చెప్పినట్లుగానే, మర్నాటి సూర్యోదయంవేళ తేజసింగు మహారాణాప్రతాపుడు నివశిస్తున్న కుటీరానికి వచ్చాడు. అతడు పుష్పకుమారిని కలుసుకుని, తను ఆమెను అనుమానించినందుకు క్షమాపణలు చెప్పుకున్నాడు. పుష్పకుమారి ఆనందాశ్రువులు రాలుస్తూ, తన బాల్యమిత్రుడూ. ప్రియుడూ అయిన తేజసింగు హృదయంపైన వాలిపోయింది.

"ఉంగరం అందంగా వున్నదని, ఆ భిల్లబాలిక దొంగిలించివుంటుంది,' అన్నది పుష్పకుమారి. తేజసింగు ఏ జవాబూ యివ్వక మౌనంగా వూరుకున్నాడు కిశోరిపైన ఆ నిమిషంలో అతడి కెంతో జాలి కలిగింది.

కొద్దిరోజుల తరవాత ఒక శుభముహూర్తాన, మహారాణా ఆధ్వర్యంలో తేజసింగుకు తన పూర్వులదుర్గమైన సూర్యమహల్‌లో పట్టాభిషేకమూ, పుష్ప కుమారితో వైభవంగా వివాహమూ జరిగిపోయినై.



# నేను ఓడిపోయాను మళ్లీ

రాచకొండ రంగనాథశర్మ

"రాణీ! ఓ రాణీ! నిన్ను చంపి నే చస్తాను" డిటెక్టివ్ పుస్తక పఠనంలో యీ బహిః ప్రపంచాన్నే మరచిపోయిన రాణి చెవుల్లో బిగ్గరగా అరిచింది నీలవేణి

ఉలిక్కిపడి నవ్వుతున్న నీలవేణి ముఖంలోకి చూసి తనూ శృతి కలిపింది.

"మంచి సస్పెన్స్ చెడగొట్టావబ్బా." అంది పేజీ మడిచిపెడుతూ.

"నీ సాహిత్యం ఓ ప్రక్కకు పెట్టు గాని యివాళ ఇరవై నాలుగో తారీఖు... పైగా ఆదివారం అని మర్చిపోయావా."

"యేఁవిటో ఆ ప్రత్యేకత," పుస్తకం అయిష్టంగానే ముడిచింది రాణి.

"ఇ దేనెల?"

"మే."

"గట్టిగా అనకు మేక లొస్తాయ్...ఆఁ యీ రోజు ఆదివారం.... ఇరవై నాల్గో తారీఖు. ఔనా?"

"ఔను,"

"ఈ రోజు మాధవి మనకు సమాధానము చెప్పాల్సిన రోజు – మర్చిపోయే వన్నమాట."




"ఓ, అయాం సారీ," అంటూ లేచింది రాణి...

"కాస్సేపు కూర్చో నువ్వేమో నీడ పట్టున కూర్చుని హాయిగా ఉన్నావ్... చచ్చి చచ్చి యెండలో వచ్చాను... అరగంట ఆయాసం తీర్చుకుంటేనేగాని కదల్లేను."

"అయితే కూర్చో. ఈ కాస్తా యీ లోపుగా చదివేస్తాను;" పుస్తకం తెరిచింది రాణి.

"కొద్దిగా మంచినీ ళ్ళివ్వు రాణీ'' అంది నీలవేణి.

పుస్తకం చదువుతూనే లోపలి కెళ్ళబోయి గుమ్మాన్ని ఢీకొక్కపోయింది.

ఫకాలున నవ్వింది నీలవేణి.

తృళ్ళిపడింది రాణి. "థెంక్యూ," అంటూ లోపలి కెళ్ళి మంచినీళ్ళు తెచ్చి యిచ్చి తిరిగి పుస్తకంలో మునిగి పోయింది

నీళ్ళు త్రాగేసి గ్లాసు టేబులుమీద ఉంచేసింది నీలవేణి.

సరిగ్గా ఆర్నెల్లక్రితం...

"ఈ మగజాతి అహంకారంతో చేసే పన్లకు తగిన గుణపాఠం చెప్పకపోతే నా పేరు మాధవి కాదు," అంది మాధవి క్రోధారుణనేత్రాలతో. జీవితంలో రెండు సార్లు మగజాతివల్ల మోసపోయిన మాధవి ఆ మాటలన్నా... ''అది సంభవమేనా," అన్పించింది రాణికి ... నీలవేణికి.

"వద్దు మధూ, అంతటి ఘోర ప్రతిజ్ఞల్ని చెయ్యి" కన్నారు యిద్దరూ.

ససేమిరా తన పట్టు వదల్లేదు మాధవి.

"ఆర్నెల్ల గడువులో నా ప్రతిజ్ఞ నెరవేర్చుకుని తీర్తాను," అంది ధీమాగా... గర్వంగా

"సరే చూస్తాంగా" అన్నారు రాణి... నీలవేణి.

'కొండతో ఢీ కొని కొండను బ్రద్దలు చేస్తావనే పొట్టేలు ప్రగల్భాలిలానే ఉకుతుం' దనుకున్నారు మనసులోనే

కాని ... యిందులో మాధవి బ్రతుకేమవుతుందో నని యిద్దరూ కూడా బాధ పడ్డారు... "వేణీ- ఓ నీలవేణీ!" పుస్తకం చదివేసిన రాణి నీలవేణి చెవుల్లో గట్టిగా అరచింది.

ఆలోచన్లనుంచి తేరుకున్న నీలవేణి అదేపనిగా నవ్వుతూన్న రాణి నవ్వుతో శృతికలిపింది "వంతు తీర్చుకున్నావ్, పద," అంది నీలవేణి - యిద్దరూ ఇంట్లోంచి బయటపడ్డారు.

* * *

గుమ్మంలో అడుగుపెడుతున్న రాణి-నీలవేణి లోపల్నుంచి విన్పిస్తున్న సంభాషణలకు ఠక్కున ఆగిపోయారు ... అక్కడే ఉన్నసోఫాలో వాలిపోయారు... లోపల సంభాషణలు సా గు తూ నే ఉన్నాయ్.

"ఔను; నిర్మల తటాకంలో రాయి విసరి అలలు సృష్టించావ్...అవి పెద్దవిగా, మరీ పెద్దవిగా...ఇంకా పెద్దవిగా నా జీవితంచుట్టూ పరిభ్రమించాయ్... అలల్లాగే కోర్కెలూ కలిగాయ్...పడగెత్తే త్రాచులా...ఉవ్వెత్తుగా లేచే కెరటాన్ని చూసినప్పుడు కల్గేఆనందమూ... అది విరుచుకుపడి నేను కరుచుకుపోతున్నప్పుడు కలిగే బాధా యీ రెండూ వర్ణనాతీతమే...అయితే నేం? దానివెంట మరోకెరటం. అదీ అంతే! ఈ జీవితమూ అలా కావల్సిందే నంటావా మాధవీ కోర్కె లెరుగని నా జీవితంలో కాలాగ్నిలాటి కోర్కెల్నెందుకు సృష్టించావ్? సృష్టిచినదానివి యెందుకు తప్పుకుంటున్నావ్? కొమ్మనికొమ్మగా ఉంచక బొమ్మగా తయారుచేస్తే .చేసి ప్రతిష్టిస్తే, ఫలితాలెంతదుర్భరంగా ఉంటాయో నీకూ తెల్సు: యిలా నా జీవితంతో చెలగాటాలాడటం నీకు సరదాయేమో? ఆ చదరంగంలో నా హృదయం రణరంగమైపో యి ం ది మాధవీ...రణరంగమైపోయింది;" వాసుదేవరావు గొంతు బాధను ప్రతిధ్వనిస్తోంది.

మాధవి గర్వంగా ఓసారి నవ్వుకుంది తనలో తనే ఒక్కసారి తీక్షణంగా వాసుదేవరావు ముఖంలోకి చూసింది. ఆయన సంగీతం మాస్టారు. గతమూణ్ణెల్లుగా మాధవి ఆయనవద్ద సంగీతం నేర్చుకుంటూంది. దానివెనుక ... మాధవి పద్మవ్యూహం??




"హుఁ, రణరంగమైపోయింది. ఎంత సులభంగా అనగలిగే రామాట ఈ జీవితాలతో చదరంగం ఆడేది నోరులేని దేవుడు కాదని ... అన్నీ తెలిసిన మానవుడేనని మీరూ ఒప్పుకుంటారు కదూ, మాస్టారూ! జీవితంలో ప్రతిక్షణం యెంత విలువైందో అంత భయంకరమైనది. ఇది నా అనుభవం నేర్పిన పాఠం మాస్టారూ! మీ రెందుకు వచ్చారు? నాకు సంగీతం చెప్పటానికి... ఔనా! అంతవరకే మీ బాధ్యత. కాని... మీరు చెప్పే సంగీతశృతుల్లో యెన్నో స్మృతులు మేళవించి చెప్తున్న సంగతి మీకు తెలియకపోవచ్చు అప్పట్లో... కాని తర్వాత...? అదే స్మృతిలో - శ్రుతిలో... ఏ ఒక్క స్వరంగానో నిలచిపోవాలనే తియ్యటికలలు ... అవి శాశ్వితం కావాలనే బలీయమైన కోరికలు ... యివన్నీ యేమిటంటారు? సున్నితమైన ఆత్మలో జరిగే ప్రేరేపణ అతిసున్నితమైనా ... అణురూపంలో ఉన్నా...ప్రతిబింబాలు పర్వాతాలకంటె ఎత్తుగా పడతాయ్... కారణం ఏమిటంటారు? మానవుడి తాలూకు బలహీనతేనేమో నన్పించటంలేదూ?

"చక్కెరపొంగలి చూపిస్తే చంటి

పిల్లాడుకూడా నోరు చప్పరిస్తాడు. దాన్ని పొందటం అనుభవంలో సాధ్యమో, అసాధ్యమో ? ఏదైనాసరే చేయిజాపి అందుకోబోతాడు. అది నేలరాలటమో... కాలరాయటమో జరుగుతుంది ఇటువంటి అతిసున్నిత ప్రభావాలే జీవితాలమీద పదింతలుగా ప్రతిబింబిస్తే ?"

"మాధవీ !" మాస్టారు బాధగా అరచి కుర్చీలోంచి లేవబోయారు.

"కూర్చోండి మాస్టారూ. నే చెబుతున్న యదార్థం కేవలంగా జీవితానికి సంబంధించినదే ? నా జీవితంలోంచి నడచివెళ్ళిన యిద్దరు స్వార్థమూర్తుల విశాలహృదయాల్ని విప్పిజెప్పుతాను

"ఒకడు రాజీవ్ ...

"నన్ను చూడకుండా ఒక్క క్షణం కూడా గడపలేననే మానవుడు. ప్రమాణాలు చేశాడు. ప్రణయ సామ్రాజ్యానికి తాను రాజయి — నన్ను రాణిగా చేస్తానని ప్రగల్భాలు పలికాడు — ప్రకృతిలో నిజమైన అందం ... ఆనందం నాలోనే ఉన్నాయన్నాడో నాడు తన జీవిత నావకు నేను చుక్కానిగా ఉండాలన్నాడు. అయితేనేం ? తన పవిత్రప్రేమకు నా బీదరికం ఆటంకమయింది. నాకంటె అందమయిన అమ్మాయి దొరకవచ్చు; కాదనను — లక్షాధికారి కూతుర్ని పెళ్ళి చేసుకోవచ్చు, తప్పులేదు — అది నాతో పరిచయానికి పూర్వమే నిర్ణయించుకోవాల్సిన విషయం...మాస్టారూ ! అతడోనా దేమన్నాడో తెలుసా ? 'మాధవీ ఆ కారులో వెళ్తుందే ఆ అమ్మాయి... పేరు ... స్వర్ణ ... బాగుందికదూ ?' ఆ క్షణంలో ఒక స్త్రీ హృదయం...... అందులోనూ తన సర్వస్వాన్నీ అర్పించడానికి సిద్ధపడిన స్త్రీ హృదయం ఎలా ఉంటుందో మీరు చెప్పండి ?

" 'ఆ అమ్మాయినే నేను పెళ్ళి చేసుకోబోతున్నాను.'

"అది హృదయమో ? కఠినశిలో ! ప్రేమించడానికి ఒకమ్మాయి — పెళ్ళి చేసుకోవటానికి ఇంకో అమ్మాయి ? ప్రేమనే పదానికదేనా అర్థం మాస్టారూ! నిజమే ఆ అమ్మాయి చాల అందకత్తె... ధనవంతురాలు.

"కావచ్చు.

"అంతకంటె అందమయినదీ—డబ్బున్నదీ కన్పిస్తే... ఈ అమ్మాయి గతీ అంతే నంటారా ?

"వండింది తినటం చేతకానివాళ్ళు వంటచేసుకుని తింటారనేది అసంభవంగా తోచదూ.

"ఇలా మానవ హృదయాలచుట్టూ స్వార్థాలు పరిభ్రమించడమే జీవితం అయితే జీవితానికో గమ్యం అంటూ ఉండదు —

"తన పురుషత్వానికి మెరుగులు దిద్ది.. తనొక్క ఉన్నతుడుగా భావించుకుంటే రాజీవ్ నన్ను ... నా ప్రేమను త్రెంచుకుంటూ వెళ్ళిపోతూ అన్నమాట లివి·




" 'మాధవీ. అందం ఆకర్షిస్తుంది అనుభవంలోమాత్రం అది శాశ్వతంగా కన్పించదు - తాత్కాలికంగా దాన్ని ఆస్వాదించటంలోనే జీవితం ముగుస్తే చరితార్థ మైనట్లే - తుమ్మెద యే ఒక్క పుష్పంలోని మకరందాన్నో పీల్చుకుంటూ శాశ్వతంగా బ్రతకాలని అనుకోదు;' పెద్దగా నవ్వుకుంటూ ఆనాడే నా జీవితంలోంచి నిష్క్రమించాడు -

''జీవితం అంటే ఒక అభిప్రాయం లేని మూర్ఖులు చెప్పే మాట లవి, ఏమంటారు ''

''మాధవీ... అవన్నీ యిప్పుడెందుకు ? నేను...''

''మాస్టారూ· నేనుచెప్పేది పూర్తిగా వినండి...''

"మాధవి అన్నమాట నిలబెట్టుకొనేట్టుందే రాణీ·" బయట సోఫాలో కూర్చున్న రాణీతో - నీలవేణి అంది.

''ఉండు కాస్సేపు మాట్లాడకు కథ క్లయిమేక్సుకు వచ్చేసింది'' అంది రాణి

''యిక రెండవవ్యక్తి భానుమూర్తి; మెడిసన్ చదివాడు - కథలు వ్రాస్తాడు - సాహిత్యరంగంలో అతనికి మంచి పేరుంది - ఆయన కథలన్నీ ప్రతీపాత్రా సజీవంగా ఉత్తేజం కలిగించేవిగా ఉంటాయ్. అంతటి సంస్కార హృదయాలు...సహృదయులు నిజాని కాయన కథల్లోనే కన్పిస్తా యనిపిస్తుంది - అటువంటి వ్యక్తితో నాకు పరిచయమైంది.

''కట్నం సాంప్రదాయంట!

''అది లేని పెళ్ళి... పెళ్ళే కాదుట!

''పవిత్ర ప్రేమబాటలో కట్నంలాటి ముళ్ళడొంక లుంటాయని ఆశించలేదు మాష్టారూ. నాన్నకు నన్నొక యింటి దాన్నిగా చేయాలనే ధ్యాస తప్పితే మరొహాటేం లేదు. మూర్తి విషయం నాన్నతో చెప్పాను.

''నాన్న వెళ్ళి మూర్తి తండ్రి జగన్నాధంగారితో మాట్లాడేరు.

''కట్నాలమొక్కను 'మెడిసన్' నీరుతో పెంచి పెద్ద చేశారట... దాని ఫలితం... మూడు పువ్వులు ఆరుకాయ లుగా అనుభవించాలని ఆయన చివరి కోరికట. పదివేలకు తక్కువైతే మళ్ళీ ఆయనతో సంప్రదించక్కర్లేదట.

''నాన్న దిగులుగా ఆ విషయాన్నే నాతో చెప్పారు.

''మూర్తి నడిగాను.

'' 'కట్నం సాంప్రదాయం మధూ! అది లేందే పెళ్ళికి సంపూర్ణ స్వరూపమే లేదు. పైగా నాన్నమాట కెదు రెలా చెప్పను?'

''ఆయన ఊహల్లో... మాటల్లో... రెండు విభిన్న ప్రకృతు లెప్పుడూ ఘోర యుద్ధాన్ని చేస్తూ ఉంటాయని అర్థమైం దానాడే;

''కనీసం తన కథల్లోని ఏ చిన్న 'పాత్ర'ను పోలినా ఆయ నన్నున్న వివాహం చేసుకునేవారు...

"చెప్పేవి శ్రీరంగ నీతులు... దూరేవి... సామెతలా అయింది.

"నన్ను ప్రేమించిన ఒక సంస్కార హృదయంలోంచి వచ్చిన మాటలకు నా హృదయం మండిపోయింది.

''ఒక హృదయం ఓర్చుకోగల బాధ ఎంత పరిణామంలో ఉంటుంది మాష్టారూ? ఆ బాధే నన్ను రెచ్చగొట్టింది. స్త్రీ జీవితాన్ని ఆటబొమ్మగా నిల బెట్ట ప్రయత్నించే పురుషుని జీవితం తోనే ఎందుకు చదరంగం ఆడకూడదా అన్పించింది.

"అది నాలో గడ్డకట్టుకుపోయిన ద్వేషంకావచ్చు, ప్రతీకారం కావచ్చు... నా తెలివితక్కువతనం మాత్రంకాదు.

"అందుకే...నా కోరిక సఫల మవ టానికి పనికివచ్చే ఒక అమాయక హృద యాన్ని యెన్నుకున్నాను. సంగీతం పేరుతో నా స్వార్థాన్ని వినియోగిం చాను."

''మాధవీ!''

"మాష్టారూ. మీ గురించి అంతా మంచిగా చెప్పుకుంటారు. ఆ మంచి మీలో ఎంత దృఢంగా ఉందో చూడా లని ప్రయత్నించాను. మీలోని సంస్కా రం ఎంతటి ఉన్నత ప్రమాణంలో ఉందో చూడాలని నిశ్చయించుకున్నాను. యిదంతా యెందుకంటారు?

"పురుషుడిమీద ఎదురుదెబ్బ కొట్టి ఆ బాధ ఎంతటి దారుణమైందో చవిచూపిం



చాలనే నా వాంఛ ఆ హృదయం అల్ల కల్లోలం అయిపోతుంటే యీ హృదయంలోని ప్రతీకార జ్వాలలు చల్లారుతాయ్... ఆ హృదయం క్షోభతో పగిలిపోతుంటే... యీ హృదయం సంతోషంతో పొంగిపోతుంది అందుకే నేను ప్రేమ నటిస్తూ మిమ్మల్ని క్షోభ పెట్టాను. అరచేతిలో స్వర్గం ఉందనిపించాను. సాధ్యమైనంతవరకూ మీ హృదయాన్ని నలిపివేశాను. ఈ నా ప్రేమబంధంలో యీ పద్మవ్యూహంలో మీరు చిక్కుకున్నారీనాడు. అందుకు మీ రనుభవిస్తున్న బాధే తార్కాణం.

"ఈ క్షణంలో నేను కాదంటే... మిమ్మల్ని ప్రేమించటం లేదంటే ? మీ ఆశ లన్నీ సమూలంగా నాశనం చేస్తే ! మీ రనుభవించే చిత్తక్షోభను చూసి నేను సంతోషంతో విరగబడి నవ్వితే - మీ హృదయం ఎలా ఉంటుంది ? ఏమైపోతుంది ?"

"మాధవీ!"

''మాధవీ ... మాధవీ' అంటూ మీరు పిచ్చివారు కావచ్చు, జీవితంమీద విరక్తి చెంది ఆత్మహత్యకు పూనుకో వచ్చు ఇన్ని అనర్థాల క్కారణం - సున్నిత హృదయాల మీద స్వార్థం చేసే దాడి అంతేకదూ. ఈ క్షణంలో మీ హృదయం ఎలాఉంది? ఎంత చిత్రహింసకు గురిఅయింది ఇప్పట్లో మీ జీవితం' లోంచి నేను తప్పుకుంటే మీ రేమయి పోతారు..."

''మాధవీ!'' బాధగా అరిచాడు వాసుదేవరావు

అప్రయత్నంగానే మాధవి కళ్ళ వెంబడి నీళ్ళు జలజలా రాలాయ్...''నేను పిచ్చిదానిలా ప్రవర్తించానా మాస్టారూ! నా హృదయం బండబారిబోయింది మాస్టారూ! దాన్ని కరిగించాలని ద్వేషాన్ని పెంచుకుని...నాలోని అగ్నిని వెదలగ్రక్కాను యిప్పుడు నా కెంతో మనశ్శాంతిగా ఉంది"

"మాధవీ!" వేయి వీణలు పలికినట్టుంది వాసుదేవరావు కంఠం

''మాస్టారూ యీ క్షణంలో మీ మీద నా కేద్వేషం లేదు. మీరు నా హృదయంలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించుకున్నారు నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను మాస్టారూ!

"మాధవీ! క్షమించు. నేను నిన్ను పెళ్ళి చేసుకోలేను''

"మాస్టారూ!'' పిడుగుపాటులా అరిచింది మాధవి

అప్పటికే గుమ్మంవరకూ వెళ్ళిపోయిన వాసుదేవరావు ఆగాడు వెనక్కు తిరక్కుండానే అక్కణ్ణుంచే సమాధానమిచ్చాడు ..

"ఏ దర్పక్వధంతో ఒక వ్యక్తిహృదయాన్ని మభ్యపరచి...ప్రేమను నటిస్తూ నీలో రగుల్తున్న ద్వేషానికి ఆధారం చేసుకున్నా నని భ్రమపడ్డావో...గర్వపడ్డావో ఆ హృదయం నీ వనుకున్నంత అమాయకమైంది కాదు మాధవీ!... పైగా నా కిదివరకే పెళ్ళయింది; వస్తాను'' చరచర నడిచి వెళ్ళిపోయాడు వాసుదేవరావు, పెద్దగా నవ్వుతూ.

మాధవి కుప్పగా కూలిపోయింది

రాణి - నీలవేణి - వాసుదేవరావు వెళ్ళిపోగానే మాధవి వున్న గదిలోకి వచ్చారు

"మాధవీ...మాధవీ''

మాధవి తలెత్తి యిద్దర్నీ చూసింది రెండు చేతుల్లోనూ ముఖాన్ని కప్పుకుని బావురుమని యేడుస్తోంది "నేను ఓడిపోయాను మళ్ళీ," అంటూ.

# జీవన వాహిని

గంగాధర్

యలమంచిలి ఝాన్సీలక్ష్మి

[జగదీశుడు కోరిన ప్రకారం, శకుంతల సర్వాంగ సుందరంగా ముస్తాబై జగదీశుని క్రొత్త యింటి గృహ ప్రవేశానికి వెళ్ళి, జగదీశుని మామ - ప్రకాశంగారికీ, ఆయన కమార్తె కాంతానికీ పరిచయం చేయబడింది. విజయ్‌బాబు శకుంతలను తనయింటికి తీసుకవెళ్ళి అపర్ణకు పరిచయం చేశాడు. శకుంతల సద్గుణాలవల్ల పరిచయస్థులతో ఆత్మీయత ఏర్పడుతుంది.

శకుంతల పుట్టినరోజునాడు ప్రకాశంగారు వచ్చి జగదీశుడు కాంతాన్ని వివాహం చేసుకునేట్టు చూడమని శకుంతలను కోరాడు. ఏదో ఆప్యాయతతో సన్నిహితమైన జగదీశుడు పరాయివాడై పోతాడని మనసు వికలమై శకుంతల నిశ్చేతన అయిపోతుంది. జగదీశుడొక రాత్రివేళ వచ్చి చూసి చలన రహితంగావున్న శకుంతల ఒడిలో తలపెట్టి పడుకుని నిద్రపోతాడు. తెల్లవారుజామున లేచిన శకుంతల అందుకాశ్చర్యంచెంది, ప్రకాశంగారివల్ల బయటపడిన విషయం నిర్ణయించుకోడానికి జగదీశుని వీపు పరీక్షించి, వీపు మీదవున్న పెద్ద పుట్టుమచ్చను బట్టి అతడే సత్యనారాయణ - తనను చిన్నతనంలో విడిచి వెళ్ళిపోయిన తన భర్తగా తెలుసుకుంటుంది.] అటుతర్వాత

## 18

మమత నిండిన హృదయాలు ఎక్కడ వున్నా ఏం చేసినా తనవారి శుభాన్నే కాంక్షిస్తాయి. ఏదయినా కీడు వాటిల్లుతుందని తెలిస్తే, ఆ మనసులు బాధతో తల్లడిల్లి, ఏదయినా చేద్దామని పరుగులు పెడతాయి

సరిగ్గా అపర్ణ మేనమామ శంకరం యిదేపని చేశాడు. 'చంద్రానికి మళ్ళీ పెళ్ళిచేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి' అన్నవార్త విన్నదగ్గర నుండీ ఆయన మనస్సు మనస్సులో లేదు ఆదరాబాదరా ఏలూరు చేరాడు విజయ్‌బాబు చదువుకోసం అయన కున్న

మూ డెకరాల్లో రెం డెకరాలు అమ్మి వేశాడు మానవుడు...

ఇంతలో ఈ అవాంతర మొచ్చిపడ్డది.

అపర్ణ ఎదురయింది శంకరానికి. మంచినీళ్ళిచ్చి యోగక్షేమా లడిగింది.

"నిజమేనా తల్లీ"! అంటూ చెదిరి పోయిన హృదయాన్ని కూడదీసు కుంటూ అడిగాడు. "నిజమే" అంది అపర్ణ సూన్యంలోకి చూస్తూ.

"మామయ్యా! యీ విషయం అమ్మకీ, విజయ్‌కి ఇంకా తెలియదు. నువ్వు ఇప్పుడే చెప్పకు" అందామె. ఆమె ధైర్యానికీ, అగ్ని పర్వతాన్ని తనలో దాచుకోగల త్యాగానికీ ఆతడు ఆశ్చర్యపోయాడు.

"మరి ఏం చేయాలమ్మా!" ఆవే దనతో అడిగాడు ఆయన.

"భగవానుణ్ణి ప్రార్థించాలి. అదే చేస్తున్నాను, చేస్తాను. నా ధైర్యం కరిగిపోకుండా నన్ను ఆశీర్వదించండి మామయ్యా!" ఆమె అతని పాదాలకు ప్రణమిల్లింది

"చంద్రం తల్లిదండ్రుల్ని ఎదిరించ లేదమ్మా!" అన్నాడాయన తలనిమురుస్తూ.

"కావచ్చు. కాని అదాయన లోపంగా నే ననుకోను," ఆమెస్వరం క్షీణించింది.

"వస్తాను తల్లీ! భవిష్యత్తును ముందే వూహించుకోకు! అది నీముందు కొచ్చే వరకూ అపర్ణగానే నిలబడు. అపర్ణగా నే హాలాహలాన్నో, అమృతాన్నో అందుకో." విజయ్, శారదాంబలను చూస్తే తనలోని దుఃఖం బయటికి ప్రవహిస్తుందని వాకిట్లోంచే వెళ్ళిపోయాడు. ఆయనవంకే చూస్తూ నిలబడ్డ దపర్ణ.

"ఏమిటక్కా యిక్కడున్నావ్!" అప్పుడే నిద్రలేచివచ్చి అడిగాడు విజయ్.

"అహఁ, ఏమీలేదు;" ఆమె తొట్రుపడింది. ఆతడు చూడకుండా కన్నులు వత్తుకుంది. లోపలికి వెళ్ళిపోయింది. కిటికీదగ్గర నిలబడి ప్రకృతిలోకి చూపు సాగించింది.

ఉత్తేజం, వుత్సాహం యిచ్చే ఉదయం... అలసటా, బద్ధకమూ జీర్ణింప చేసే మధ్యాహ్నమూ, పడిన శ్రమకి ప్రతిఫలంగ విశ్రాంతీ హాయీ చల్లదనం అదించే సాయంకాలం... యీ మూడూ ప్రకృతి రూపాలే. దేవుడు లేడనే మానవుల్ని చూసి నవ్వుతుంది, ఉన్నాడని కీర్తించే భక్తుల్ని చూసి మంచహాసం చేస్తుంది. ఆస్తికుణ్ణీ, నాస్తికుణ్ణీ తన ఒడిలో పవళింపజేసి పాట పాడుతుంది.

అపర్ణ ఆలోచిస్తూ అలాగే ఎంతో సేపు వుండిపోయింది.

## 19

శకుంతల ఆ రోజు సంవత్సరాది కావటంచేత పనులు తొందరగా తెమల్చటానికి తెల్లవారుఝామునే లేచింది. ఎక్కడికో వెళ్ళి తిరిగి వచ్చిననాటి నుండి జగదీశ్‌బాబు ఆ యింట్లోనే వుంటున్నాడు. ప్రకాశంగారు వచ్చినప్పుడు

ఆయన్ని తప్పించుకుంటూ తిరుగుతున్నాడు. శకుంతలతో ఆయన జగదీశుణ్ణి ఏవిధంగానైనా యింటికి పంపమని చెప్పాడు. జగదీశుడు రోజూ హాస్పిటల్‌కి వెళ్తున్నాడు కాని యింటికేసి చూడడు. శకుంతల ఎంత చెప్పినా వినిపించుకోడు.

చివరకు ఒకే సమాధానం చెప్పాదొకనాడు.

"శకుంతలా! యీ దుర్బలుడు మళ్ళీ నీ కంటికి కన్పించనంత దూరం వెళ్ళిపోవాలంటే ఆ యింటికి వెళ్ళమని ఆజ్ఞాపించు," అన్నాడతడు ఆ సమాధానం విని ప్రకాశంగారూ, శకుంతలా ఆశ్చర్యపడ్డారు. భయంతో ఆ ప్రసక్తి తీసుకుని రాలేదిక మాటవరుసకైనా.

ప్రకాశంగారు ఒకసారి హాస్పిటల్‌లో కలుసుకొని మాట్లాడారు.

"మామయ్యా! నీ ఋణాన్ని నేను తీర్చుకోలేను అది మేరుపర్వతంకన్న పెద్దది. ఇంక కాంతాన్ని నా చేతుల్లో పెట్టి అది మరింత వృద్ధిచేయకు. అసలు నేను కాంతానికి తగినవాణ్ని కాను మా హాస్పిటల్‌లో నేను ఆజన్మాంతం సేవ చేస్తూనే ఉంటాను. ఆ పనిని మాత్రం నువ్వేమీ అడ్డు చెప్పవద్దు," అన్నాడు జగదీశుడు.

ఆయన నేత్రాలు బాష్ప పూరితాలయ్యాయి ఉత్తరీయంతో కళ్ళు అద్దుకున్నాడు.

"చూడు బాబూ, నీ వస్తువుల్ని నువ్వు తీసుకోవటంలో ఋణ ప్రసక్తి ఎందుకయ్యా! నువ్వు లేనినాడు నాకీ హాస్పిట లెందుకూ! ఈ బాధ్యత లెందుకు? ఏదో చిన్నతనంచేత కాంతం ఆవాళ అలా అంది కాని, దానికి నీవంటే ఎంతో గౌరవమూ ప్రేమా నాయనా."

"మామయ్యా! నువ్వు యీ మాట మాత్రం అడక్కు నన్ను. కాంతాన్ని భరించగలిగిన మరొకతని కిచ్చి పెళ్ళి చేయండి. నా ఆశీస్సులు సంతోషంగా అందజేస్తాను. కాంతం క్షేమం కోరే ఈ మాట చెబుతున్నాను. మన స్తత్వాలు వేరయినపుడు, ఆ సంసారంకంటె నరకం నయం, మామయ్యా;" నచ్చ జెప్పాడు జగదీశుడు.

"అలాగే కానీ బాబు!" అని వెళ్ళి పోయాడాయన...

జగదీశుడింకా లేవలేదు కాంతమ్మ ఏదో మేలుకొలుపుల పాట పాడుతూ పెరుగు చిలుకుతున్నది. నీళ్ళు తోడి శకుంతల ఆతడిని లేపటానికి వెళ్ళింది. ఆతడు ప్రక్కమీద అటూఇటూ కదులుతున్నాడు బద్ధకంగా

"స్నానానికి రండి;" హెచ్చరించిందామె.

"ప్రొద్దున్నే లేచి నిన్నే చూశానమ్మాయ్! ఏదెలా జరిగినా నీదే బాధ్యత."

"అలాగే, స్నా నా ని కి లేవండి," అం దామె నవ్వుతూ.

స్నానాలు పూర్తయినాయి. వేప పూవు పచ్చడి తిన్నారు శకుంతల తన గదిని జగదీశునికి కేటాయించింది. అత డా గదిలో కూర్చుని ఏదో మెడికల్ మేగజైన్ చూస్తున్నాడు కొంత సేపటికి శకుంతలను పిల్చాడు చేతులో వుంచుకున్నాడు. జేబులోనుంచి డబ్బు తీసి. "ఇదిగో శకుంతలా, ఇది నీ దగ్గరుంచు," అంటూ ఆమె కా మూడునూరు రూపాయిలనోట్లను యివ్వబోయాడు.

"నా కెందు కిస్తున్నారు," అం దామె కనుబొమలు ముడిచి.

"నేను నీ పోషణలో ఉన్నందుకు ఇస్తున్నాను. ఐనా నా కెవ్వ రున్నారు శకుంతలా యివ్వటానికి, నువ్వొకర్తివి తప్ప. అదీ నీ యిష్టం వున్నన్నాళ్ళు. త రు వా త నొసటి వ్రాతా, నిర్ణయం ఈ విశాలప్రపంచంలో నీ లాగా నా పైన ఎవరయినా దయ చూపించకపోతారా!" ఆతడు బాధగా నిట్టూర్చాడు.

'ఎన్నడూ తనకోసం బాధ పడని మనిషి యీ రోజు తాను ఏకాకినని క్రుంగిపోతున్నాడు ఈయనకి యెలా చెప్పాలి? మీ పాదదాసి నని – చెప్పి ఏ విధంగా లోకాన్ని నమ్మించగలదు? ... కాంతాన్ని ఎలా అన్యాయం చెయ్యడం. ప్రకాశంబాబాయి కిక ఏ ఆశా లేకుండా చేసి ఆయన మండుతున్న హృదయంతో నిట్టూర్చుతుంటే ఏం చేయాలి తను? ఆయన కింకా కాంతాన్ని ఎగై లా నా యీయనగారి కిచ్చి వివాహం చేయాలన్న కోరిక అడుగంటలేదు భగవాన్! ఏమి టీ వింత పరిస్థితి!' ఆమె ఆవేదనతో ఆక్రోసించింది. ఆమె నేత్రాలు అశ్రుసిక్తాలయాయి. 'నా బ్రతుకు తరగని గరళం. ఈ బ్రతుకు కర్ధ మేమిటో...'

"మీరు కావాలంటే మీ పాదాల్ని పూజించేవా ళ్ళున్నారు. ఆ విషయం మీకు తెలియదేమో!" అనాలోచితంగా అనేశిం దామె.

"హుం" అతడు గంభీరంగా నవ్వాడు. "కావా లన్నంతమాత్రాననే యీ జడుడితో ఎవరు పొత్తు పెట్టుకుంటారు శకుంతలా! ఎవరిదాకో ఎందుకు, మామయ్యనే చూడు. కాంతాన్ని చేసుకోనూ అంటే అంత బాధపడ్డాడు. కాని నాబాధ ఆలోచించలేదు. నువ్వు ... నువ్వు మాత్రం," ఆతని గొంతు బాధతో పూడుకుపోయింది. శకుంతల భుజాల మీద చేతు లుంచి ఆమెను వూపివేశాడు. "కాదు కాదు, నా శకుంతల అని బంధమేర్పరచుకో గలను నేను." ఆతడామెను తన హృదయానికి అదుముకున్నాడు, ఆమె నిశ్చేష్టితయై ఆతనినంటుకపోయింది; వారించనూ లేదు; ఔనని ఒప్పుకోనూలేదు. మనసు పరవశతనతో వూగిపోయింది; ఆమెలో 'అను



రాగమయి' రూపం సంతరించుకుంది. నేత్రాలు మత్తుగా తూలిపోయాయి; ఆతని స్పర్శతో ఆమె పులకరించి పోయింది ఇరువురి హృదయాలూ స్పందించి ఒక లయతో మధురంగా శబ్దించాయి. రెండు జీవన వీణియలులా.

శకుంతల ఆతని పాదాలమీదకు జారిపోయింది పరమాత్మని శిరసుపైన నున్న సుమరాజం ... అనుగ్రహించిన భక్తునికి కాన్కలా, పున్నమివెన్నెల పోగులా ... ఆతని పాదాలమీద వివశయై వుండిపోయింది ఆతడు ఆశ్చర్య పడ్డాడు. మైమరచి పోయాడు. తనస్పర్శ ఎక్కడ తగుల్తుందోనని భయపడి వారించే ఆమె, గుండెల్లో దాచుకున్నా ఏమీ అననందుకు

"శకూ! యింత అదృష్టవంతుడి నని నే నెప్పుడూ అనుకోలేదు;" పరవశత్వంతో నిండిపోయిం దాతని గొంతు. ఆమెను రెండుచేతులతో లేవనెత్తాడు.

"మీకు కావలసింది నేను అని నాకు తెలుసు. తీసుకోండి మీలోకి నన్ను. కరిగించి మీ కళ్ళల్లో నిల్పుకోండి; ఆజ్ఞాపించండి. మీకు నమస్కరించ నివ్వండి. కాని ... కాని... ఒక్క ... మాట... మాత్రం ... యివ్వండి;" ఆమెగొంతు వణికిపోయింది.

"ఇక ఏమాటా వద్దు శకూ! నువ్వు నాలో యిమిడిపోతే చాలు నువ్వునన్ను ప్రార్థించవద్దు. ఆజ్ఞాపించు! శాసించు! నీ కేం కావాలి?" ఆత్రంగా అడిగాడు జగదీశుడు.

"లోకానికి నన్ను మీనుండి వేరుగా కనపడనివ్వండి ... కాంతాన్ని ... పెళ్ళి చేసుకోండి. .యీవాగ్దానం. .చేయండి." అందామె గంభీరంగా. ఆమె నేత్రాలు

ఆతని పెదిమలవంక చూస్తూ వుంతి పోయాయి.

"ఏమిటీ...నీవు వేరా! కాంతాన్ని పెళ్ళి చేసుకోవాలా!...వద్దు, శకుంతలా వద్దు. నాలో అగ్నిపర్వతం రగుల్కొల్పకు. నేను భరించలేను." ఆతను ఆక్రోశించాడు.

"అసలు యింత త్యాగం నీ కెందుకు శకుంతలా!" ప్రశ్నించాడు జగదీశుడు.

"త్యాగం!! మీ భ్రమ అది. కాని మీకు శకుంతల కావాలంటే, ఆమె కోరిక తీర్చాలి ... తీర్చాలంటే," పట్టుదలగా అందామె. ఆతడు మంచంపై కూర్చుని ఆమెవంక విచిత్రంగా చూశాడు.

'అమృతం కావాలంటే విషపు చుక్క నొకదాన్ని చవిచూడు—' అన్నాడట వెనకటి కొకతను. ఇదేమిటి? విచిత్రంగా వుంది నీ కోరిక! నాకు కావలసింది నీవు. కాంతం కాదు..." విశ్చలంగా వుం దా కంఠస్వరం

"అయితే మీకు నన్ను స్పృశించటానిక్కూడా అర్హత వుండదు;" ఆమె కళ్ళవెంట కన్నీళ్ళు జాలువారాయి.

"ఉండదూ! ఎందుకుండదు? స్పృశించినా, స్పృశించకపోయినా యింట్లోంచి పొమ్మన్నా నేను కదలను;"ఆతడు ఎర్రబడ్డ కళ్ళతో అరిచాడు.

"ఇదిగో చూడండి, మీకు పుణ్యం వుంటుంది. కాస్త నెమ్మదిగా మాట్లాడండి, మీకాళ్ళు పట్టుకుంటాను. ప్రకాశం బాబాయిగారి మాట కాదనకండి," అందామె తగ్గుస్థాయిలో.

"బ్రతిమాలుతున్నావా? శభాష్! మొత్తానికి స్త్రీ ననిపించావ్! నా కోరిక తీర్చలేరట – ఎవరి కోరికో తీర్చాలట – తీర్చుతాను మీ కోరిక–అయినా నే నెవణ్ణి! యింట్లో వుండి అధికారం చెలాయించటానికి, యింటి యజమానినా!" కోపంగా అంటూ గబగబా లేచి పెట్టె తెరిచి, బట్టలు సర్దేసి, పెట్టెకి తాళం వేశాడు. బెడ్డింగ్ కట్టివేశాడు.

"నీ సహాయం మరువను–యిదిగో," అంటూ ఆ మూడువందల్నీ ఆమె చేతిలో వుంచాడు. బయటికి వెళ్ళిపోబోయాడు. శకుంతల స్థాణువులా నిలబడిపోయింది.

"ఆఁ, ఆఁ, ఆగండి కొంచెం! మరి నేను ఏమైపోవా లంటారు! ఇన్నాళ్ళు ఏమీ గాని నా యింట్లో ఎందుకున్నారసలు! మీకు నే నేమీ కాకపోయినపుడు నా చుట్టూ తిరిగి మీ చూపుల్తో నన్ను లోకానికి సిగ్గుపడేటట్లు ఎందుకు చేశారు?" శకుంతల గుమ్మాని కడ్డంగా నిల్చుంది; నవ్వుతూ అంది. ఆతడు ఠక్కున ఆగిపోయాడు. తికమకపడ్డాడు.

"అయితే యిపుడు నే నేం చేయను?" తల గోక్కున్నా డాతడు.

"ఏం చేయమంటాను? ఆ ప్రయాణం మానేసి బుద్ధిగా లోపలకు వచ్చి నేను చెప్పేది వినమంటాను. పెట్టే ఫలహారాలన్నీ తినమంటాను; పదండి, ఎవరన్నా

చూస్తే నవ్వుతారు — చూడండి ఎలా వున్నారో ! షర్టుకి గుండీల్లేవు. వాచీ వూడిపోతోంది. జేబులో డబ్బుల్లేవు. ఎక్కడికో వెళ్తారట ! పాపం ! ఓచిన్న అబ్బాయి అలిగి పారిపోతున్నాడట —" ఆమె కళ్ళు ఆతడిని ఆజ్ఞాపించాయి. ఆమె ఆతడిని తీసికెళ్ళి మంచంమీద కూర్చో బెట్టింది. మంత్రముగ్ధునిలా, చిన్న పిల్లవానిలా కూర్చుండిపోయా డతడు —

"ఏవీ ! తాళా లిలా య వ్వండి;" తాళాలు తీసికొని అంతా ఎప్పటి మాదిరిలా సర్ది, తాళాలు తనబొడ్లో పెట్టేసుకుందామె. ఇకనుండి మీకు డబ్బు కావలిస్తే నన్నడగండి — మీదగ్గర డబ్బుంటే నిజంగా పారిపోతారు —" అందామె. ఆత డేమి మాట్లాడలేదు.

"ఏం, మాట్లాడరేం ! మూగనోము పట్టారా !"

"అలాగే ! ఏం కావల్సివచ్చినా నిన్నే అడుగుతాను," అన్నా డతడు.

"అలాగే అని తలూపేస్తా రిప్పుడు. తిక్క తిన్నగా లేకపోతే రైల్లో కూర్చుంటారు, వెళ్ళి టిక్కెట్టైనా లేకుండా. ఎవరెక్కమన్నారని అడిగితే 'శకుంతల' అంటారేమో అంతమందిలో; అప్పుడు నేను వచ్చి సిగ్గూ, అభిమానమూ వదిలేసి మిమ్మల్ని తీసుకురావాలి,'' అందామె గడసుగా జగదీశ్ ఆమెనే చూస్తున్నాడు ఆమెస్వరం వీణానాదంలా మధురంగా ఆతనికి వినిపించుతోంది.

"ఏమి టలా చూస్తారు ? నాముఖాన్నేమైనా తోలుబొమ్మ లాడుతున్నాయా! ఇదిగో మీరు చదివే పుస్తకం," తెచ్చి ఆతడిచేతుల్లో వుంచిది.

అతడు మాట్లాడకుండా పుస్తకంలోకి తల వంచాడు

"జాగ్రత్త ? ఎక్కడికైనా పారిపోయేరు," అంటూ హెచ్చరించి గది లోంచి వెళ్ళిపోయింది.

శకుంతల మనస్సు నలిగిపోతోంది, జగదీశ్‌బాబు తన జీవితంలో ఎందుకు ప్రవేశించాలి ! ఏవిధంగా ఆతడు తన భర్త అని లోకాన్ని నమ్మిస్తుంది? ఆధారా లేవి ! నాన్న దేశద్రిమ్మరి ! అయనైనా వుంటే గుర్తుపట్టేవాడు పెళ్ళినాడు ఫోటో తీయించారట. అదైనా వుంటే బావుండును ! దొరికినా తాను కాంతాన్ని ఎలా అన్యాయం చేస్తుంది ! తన జీవితం ఏమౌతుంది ! ఏమార్గం వుంది యీ సమస్య పరిష్కరించటానికి...ఆమెకు దిక్కూ దరీ తోచలేదు.

# 20

చదువు కొందరికి సంస్కారాన్ని నేర్పుతుంది. కొందరు మిడి మిడి జ్ఞానం అలవఱచుకుంటారు. వేష భాషలకీ, కోరికలకీ బాగా ప్రాధాన్యత నిస్తారు. పాశ్చాత్య నాగరికతలో వారికేదో 'ముక్తి' లభించినట్లనిపిస్తుంది. అన్నీ తెలుసునని విర్రవీగుతారు. తమచూట్టూ

వున్నవాళ్ళు అజ్ఞానులనీ, తామే ముందుకు పోతున్నామనీ అనుకుంటారు.

సరిగ్గా కాంతం యీ స్థితిలోనే వుంది. క్రొత్తగా యీ మధ్యనే పరిచయమైన రాజారావుతో ఆమె స్నేహం వృద్ధి అవుతోంది. ఆనాడు ఆమె రాజారావుతో మాట్లాడుతోంది వాళ్ళింట్లోనే.

"కాదోయ్ ' రాజా! తల్లిదండ్రులు ఏర్పరచిన వివాహం చేసుకోవటమంత పిచ్చిపని లేదు అమ్మమ్మల కాలంనాటి మాట అది - వాళ్ళకి ప్రేమ, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే ఏ కోశానా తెలిసి వుండదు."

"నువ్వు చెప్పింది అక్షరాలానిజం," అన్నా డాతడు యింగ్లీషులో.

"ఎంత చదువుల్లో ముందుకు పోతున్నా మనదేశం యింకా వెనుకపడే వుందోయ్. ఆ స్వేచ్ఛ రావటం లేదు" ఆమె నిట్టూర్చింది.

"సరేలే, రా! మనం యింగ్లీషు పిక్చరుకి వెళదాం," అన్నాడతడు ఆమెను మ్రింగేసేట్టు చూస్తూ.

ఆతడు ఫైనల్ బి. ఏ. లో వున్నాడు. కాంతం ఆతని క్లాసుమేటు-కుసంస్కారి చక్కగా అలంకరించుకుంటాడు. ఆతని కళ్ళల్లోని బలీయమైన ఆకర్షణకి కాంతం లొంగిపోయింది. ఆతని వలలో యింతకుముందే కొందరు పడి, అన్యాయంగా ఒకామె బలి అయిపోయింది కూడా ఇద్దరు తప్పించుకొని వెళ్ళిపోగలిగారు. ప్రకాశంగా రాతణ్ణి చూస్తూనే "తోడేలు లాంటి మనిషి యీయన అనుకున్నారు. ఒకసారి శకుంతల దూరంగా ఆతణ్ణి చూచి "యీతనిలో ప్రమాదకరమైన ఆకర్షణ వుంది" అనుకుంది.

ఇద్దరూ కలసి పిక్చరుకి వెళ్ళిపోయారు.

* * *

ఆకర్షణ చిత్రమైనది సన్నిహితంగా వుంటూంటే అది హిమాలయమంత పెరుగుతుంది విజయ్‌బాబు యీమధ్య అరుణ ఆకర్షణలో సర్వం మరిచిపోతున్నాడు. అరుణ ఇప్పుడు బి. ఏ. చదువుతోంది

వాళ్ళిద్దరూ ఒకప్పుడు స్నేహితులు. ఏదైనా విషయంమీద బాగా వాదించుకుంటారు. ఆప్తమిత్రులైనారు.

ఆరోజు శారదాంబ అన్నగార్ని చూడాలని వూరికి వెళ్ళింది అపర్ణ తలనొప్పిగా వుందని పడుకుంది. ఆమె బాధ పడుతూంటే యిద్దరూ చెరొకపక్కా కూర్చొని బాధపడ్డారు.

"అబ్బబ్బ! వూరుకోండర్రా! యీ మాత్రందానికే ఖంగారా! వెళ్ళి పడుకోండి;" ఆమె హెచ్చరించింది. అరుణ విజయ్ ప్రక్క సర్దివచ్చింది విజయ్ బాబు చాలా సేపు అక్కడగ్గరే కూర్చున్నాడు "వెళ్ళు బాబూ," అంటూ అపర్ణ పదిసార్లు చెప్పినమీదట అక్కకు నమస్కరించి తన గదిలోకి వస్తూ-



"అరుణా! కాసిని మంచినీళ్ళు తీసుకురా!" అన్నాడు విజయ్‌బాబు తన గదిలోకి వెళ్తూ ఆమె తెచ్చింది.

"కాస్త ఆకిటికీ తెరచిపో అరుణా!" అన్నా డాతడు గ్లాసు అందుకుంటూ. ఆ కిటికీ మంచంమీదనుండి అందుతుంది ఆతనికి. తన కెందుకు చెప్పటం? ఆమె ఆశ్చర్యపడింది.

"ని న్నేమీ మ్రింగేయనులే కాస్త తీసిపో" అన్నా డతడు ఆమె కిటికీ తెరుస్తూ అతనివంక చూచింది ఆమె పైటచెరుగు ఆతని ముఖం మీద పడింది ఇద్దరూ ఒక్కసారే చేతులు వేశారు దానిమీద. అరుణ చెయ్యి ఆతని చేయిలో యిమిడిపోయింది ఇద్దరి దృష్టులూ పరవశత్వంతో కలిసిపోయాయి. పవిత్ర ప్రణయభావాలతో నిండి ఇద్దరి మనసులూ మత్తుగా తూలిపోయాయి.

"ఎందు కంత భయం నే నంటే" ఆత డామెను ప్రక్కన కూచోబెట్టుకున్నాడు. ఆమె తల వాల్చుకుంది.

"క్లాసులో లెక్చరిస్తూంటే నిన్ను చూడటం నా కెంత భయమో తెలుసా? అరుణా, నిన్ను చూచానంటే ఒక్క మాటా రాదు. తడబడిపోతాను. నీలోని అందం నన్ను కళ్ళు త్రిప్పుకోనీయకుండా చేస్తుంది. అత డామె చేతిని మృదువుగా నొక్కాడు.

''వెళతాను'' ఆమె లేచి వోబోయింది నవ్వుతూ.

"ఆః ఆగుః కొద్దిగా వుండి నోట్స్ చెప్తాను. కొంచెం వ్రాసిపెట్టు," అన్నాడాతడు. అదో మిష అని ఆమెకు అర్థమైపోయింది.

"అహ మీరే వ్రాసుకోండి. నాకు నిద్ర వస్తోంది," అందామె

"కాస్త వ్రాసిపెడదూ,'' అతడు పుస్తకం తీసికొని మంచం మీద కూర్చున్నాడు. ఆమె పెన్ కోసం వెతుకుతోంది. "ఏదీ పెన్ ఎక్కడుంది? కనిపించదేం?"

"సరిగ్గా చూడు ఉండు నేను చూస్తాను," అంటూ విజయ్ ఆమెను పూర్తిగా లేవనీయకుండానే ఆమె వీపు మీదికి వంగిపోయాడు.

"అబ్బ! వుండండి," అంటూ ఆమె లేచి నిలబడింది. ఆతడామెను హృదయానికి హత్తుకున్నాడు.

"నీకు నేనంటే ఇష్టం లేదా అరుణా?"

''అవి నే నన్నానా?" ఆమె ఆతని కళ్ళలోకి చూచింది. సిగ్గూ, ప్రేమా ఆమెను ముంచివేశాయి. ఆ కళ్ళు కాంతితో వెలిగిపోతున్నాయి.

''మరి ఇంత బెదిరిపోతావేం," అన్నాడాతడామె ముంగురుల్ని సర్దుతూ.

''బెదురు కాదు. ఇంత స్వేచ్ఛ అప్పుడే మనకుండరాదు. మిమ్మల్ని అందుకోవటానికి కొంత వ్యవధి ఇవ్వండి. అంతవరకూ మీరు అపర్ణక్క తమ్ముడిగానే నిలిచిపోండి," అంటూ ఆతని పాదాలమీద వ్రాలింది.

ఆమె పవిత్ర భావాలకీ, నిర్మలానురాగానికీ ఆశ్చర్యానందాలతో నిండిపోయాడు విజయ్‌బాబు.

''కోపం వచ్చిందా?" ఆమె అడిగింది

"ఊహుఁ, నాకూ వుచితానుచితాలు తెలుసు అరుణా. అయినా నువ్వింత అందంగా ఎందు కుండాలి?" ఆతడు తన మంచంపై కూర్చున్నాడు.

ఆమె నవ్వింది "ఏం కొంత బాకీ ఇచ్చెయ్యమన్నారా,'' అంటూ, "వదిన లేస్తుందేమో? వెళతాను;" ఆమె వెళ్ళిపోయింది.

## 21

చంద్రం సరిగ్గా రావటంలేదీమధ్య ఆతడికి అంతర్యుద్ధం ఎక్కువయింది. తన అశక్తతకు కుమిలిపోతున్నాడు. తండ్రి సరిగ్గా లేవలేక పోతున్నాడీ మధ్య. పెద్దకోడలు వేరుపడిపోయింది. అది ఆయనకో అఘాతమయింది. అపర్ణకేదో అన్యాయం చేశానన్న బాధ కలుగుతోందాయనకి మనస్సులో. కాని తరతరాలుగా జీర్ణించుకుపోయిన ధనపిపాస ఆయన మనసులో భావాన్ని పైకి రానీయలేదు. ఎడమకాలూ, చేయూ సరిగ్గా కదల్చలేకపోతున్నాడు. 'పక్షవాతం' అన్నాడు డాక్టరు. అరుణంటే

అతనికి అపరిమిత వాత్సల్యం. ఆమె చదువుకి వెళ్ళిపోవటం అతని కిష్టం లేదు. కాని ఏమీ అనలేకపోయాడు రామభద్రమ్మగారి గొంతు అలాగే వుంది. కొడుకు వేరైపోయినందు కామె అతడిని కృతఘ్నుడనీ, తల్లీ తండ్రీ మీద భక్తిలేనివా డనీ ఎప్పుడూ దెప్పుతూనే వుంటుంది. ఈ పరిస్థితిలో చంద్రం తన బాధ్యతలకూ, భావాలకూ మధ్య మరింతగా నలిగిపోయాడు. మిల్లు మేనేజరగా చేస్తూ, చిన్న పిల్లలకి ట్యూషన్స్ చెబుతూ రెండువేలు ఆర్జించాడు. కాని అతని ఆరోగ్యం క్షీణించటం మొదలుపెట్టింది. అపర్ణ ఎంతగానో గోలపెట్టింది అతడు నవ్వి వూరుకున్నాడు. కళ్ళు ఎర్రబడి పోవటం, మంటలు ... అతనికి. కాని ఎవరికీ చెప్పలేదు.

ఒకనాడు జ్యోతుల్లా ఎర్రబారిన ఆ కళ్ళను చూచి పెద్దరగడ చేసింది చిక్కిపోయిన అతని ఆకారాన్ని చూచి కన్నీళ్ళు కార్చింది

'పిచ్చిదానా! ఎందుకంత బాధ పడ్తావ్. ఈ సంవత్సరం కానీ ... ఎప్పుడూ నీ ఒడిలోనే వుంటాను," అన్నా డామె కన్నీరు తుడుస్తూ.

"అప్పటివరకూ నేనున్నప్పటి మాట." కోపంగా అందామె.

"ఛ, ఏమి టా మాటలు," మందలించాడు. "నువ్విలా అయిపోతున్నావేం. ఎంత చిక్కిపోయావో తెలుసా! కళ్ళల్లో వెలుగేలేదు;" ఇరువురి హృదయాలూ బాధతో మెలిదిరిగిపోయాయి.

అపర్ణ అంత ఆరోగ్యంగా కనిపించటంలేదు. కళ్ళు లోతుకుపోయాయి. నడుం సన్నబడింది. చెక్కిళ్ళుమాత్రం మెరిసిపోతున్నాయి 'ఏం తల్లీ!' అని శారదాంబగా రడిగితే 'ఏమీ లేదులే' అని విసుక్కుంది. ఏమిటో వికారం?

చంద్రంతో మాట్లాడుతూనే...ఆమె గభాలున వెళ్ళిపోయింది. పెరట్లోకి వెళ్ళి వాంతి చేసుకుంది. చంద్రం గాభరా పడిపోయాడు. మంచినీళ్ళు త్రాగించాడు. ఆమె తిరిగివచ్చి చాపమీద పడుకుంది నీరసంగా. అత్తగార్ని పిలవబోతే వారించింది అపర్ణ ఇంట్లో అంతా నిద్రల్లో వున్నారు.

"డాక్టర్ని పిలుచుకు రానా!" ఆత్రంగా భయంగా అడిగాడు చంద్రం.

"వద్దు గానీ, మీ రిలా రండి. కూర్చోండి," ఆమె కళ్లు మూసుకుంది.

చంద్రం ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. "ఏం జరిగిం దపర్ణా? ఎందుకిలా అయిపోయావు?" భయంతో అడిగాడు.

అపర్ణ కళ్ళు విప్పింది. చిన్న దరహాస రేఖ మెరిసిం దామె పెదిమలపై. ఆమె నేత్రాలు గర్వంగా, వుజ్జ్వలంగా వెలిగిపోయాయి.

"ఏమయిందని చెప్పమంటారు? మీ లాంటి అమాయకులకి,'' మళ్ళీ నవ్విం దామె. తెల్లబోయి చూశాడు చంద్రం.

''ఏం! ఎందు కలా చూస్తారు. పాపం! మీరు ఒంటరిగా వున్నా రని పాపాయిని యిద్దా మనుకుంటున్నాను." అందామె నీరసంగా నవ్వుతూ.

''అదేమిటి'' ఆతని కేమీ అర్థం కాలేదు

''వా డెక్కడున్నాడో తెలుసా! మీ ఒడిలోని అపర్ణలో '' ఆమె తన ముఖం సిగ్గుతో కప్పుకుంది మైమరచిపోయి

"అమ్మ దొంగా! చెప్పావుకావేం! ఉండు నీ పని చెప్తాను. వాడిని నీతో మాట్లాడనివ్వను,'' చంద్రం ఆమె పెదాల్ని ముద్దు పెట్టుకున్నాడు. ఆమె పరవశత్వంతో తూలిపోయింది.

నిరాసతో క్రుంగిపోతున్న ఆమె మనసు, యీ మాతృత్వంమీది మమకా రంతో ఉజ్జ్వల భవిష్యత్తుకోసం కలలు కంటోంది. మురిసిపోతోంది

''ఏం బహుమానం కావాలో కోరు కోండి దేవిగారూ!'' చంద్రం చిలిపిగా అడిగాడు.

''ఇచ్చినవి చాల్లెండి అయినా అడి గారు కాబట్టి చెప్తున్నా మీకు తోడుగా వుండనివ్వండి విజయవాడలో;" సూటిగా భర్త కళ్ళల్లోకి చూచింది.

''అదేమి టపూ!" ఆత డాశ్చర్య పడ్డాడు. "నీ కక్క డేమి సౌకర్యంగా వుంటుంది?" అన్నాడు.

"బాబు రోజూ మీ కంఠం వినాలని ఉవ్విళ్ళూరుతున్నాడు.''

"ఓహో ! ఒకళ్ళ కిద్ద రయ్యారు. సరే." మృదువుగా ఆమె చేతుల్ని నిమి రాడు ఆమె 'హమ్మయ్య!' అని నిట్టూ ర్చింది.

"కోడలికోసం ప్రయత్నాలు అక్క ర్లేదులెండి. మన యింట్లోనే తెలుస్తుంది అప్పటికి ''

''ఎలా! అదేమిటి? మరో చదరం గపు ఎత్తు ''

''మీ చెల్లెలుగారు ప్రణయ గీతాలు పాడేస్తున్నా రీ మధ్య...''

"మీ తమ్ముడుగారు విరహ గీతా లాలపిస్తున్నారా! శేక అడవుల్లో ఘోర తపస్సు చేస్తున్నారా!''

''లేదు. యిద్దరూ మన ఆజ్ఞకోసం కాచుకూర్చున్నారు," అందామె.

"అమ్మ కీ విషయం తెలిస్తే;" భయం ప్రకటించాడు చంద్రం.

"ఆమె అరుణ; చంద్రం కాదు, అమ్మకీ నాన్నకీ భయపడటానికి;'' వెక్కిరించిం దామె.

"నేను భయపడతానా!" చంద్రం ముఖం చిన్నబోయింది.

''ఆహా, అది భక్తి, భయం కాదు. సరే, యింతకూ వీళ్ళ వివాహం ఎలా జరగాలంటారు!''

"అది మీ వదినా మరదళ్ళ యిష్టం. మధ్యన నన్నిరికించి తమాషా చూడ కండి,'' అన్నా డతడు



అపర్ణ, తల్లి కాబోతూం దన్నవార్త విని అరుణా విజయ్‌ల ఉత్సాహానికి కవధులు లేకుండా పోయాయి.

"అపర్ణ ఏదైనాపని చేయబోతే వదినా కదలకు'' అంటుం దరుణ.

"ఎత్తుకొని తిరుగుతావేమిటి?" అంటుం దపర్ణ.

"నీవు ఒప్పుకుంటే సరే," అంటుం దరుణ.

"అరుణా! అక్క నేపనీ ముట్టుకోనీయకు;" ఆజ్ఞాపించాడు విజయ్.

అపర్ణ మనస్సు ఆర్ద్రమైంది.

నిరాశామయమైన జీవితంలో ఆశాదీపిక మెరిసింది. ఈ తొమ్మిదినెలలూ ఆ చిన్నారికోసం, అతని రూపురేఖల్ని ఆలోచిస్తూ తన్మయత్వంతో గడుపుతూంది. అతనికి టోపీ, స్వెట్టరు అల్లుతూ...బాబుకు చెడు తెలియకుండా మంచినే చూపుతూ...మంచినే నిర్మించి లోకమంతా మంచే అని చూపాలని ఆలోచించింది.

రాను రాను నీరసం అయిపోతోంది అపర్ణ. అయినా ఆ ఆనందానుభూతిలో ఆమె దేన్నీ లెక్కచేయలేదు. రత్నం బయటపడటానికి ఎంత మెరుగు కావాలో"! అనిఆశ్చర్య పడుతుం దామె.

అ నెలలో చంద్రం అపర్ణను తీసికెళ్తానన్నాడు. అంతా ఆశ్చర్యపోయారు.

"కాదమ్మా! వారికి యిబ్బందిగా వుందట. అందుకనినేనువెళ్తాను,'' అంది అపర్ణ. అలాగే అన్నా రందరూ. ఇక

రేపు వెళ్తా ననగా ఆ రోజు అపర్ణ శకుంతల యింటి కెళ్ళింది.

## 22

అపర్ణ రిక్షా దిగేసరికి – ఎదురుగా జగదీశ్ బాబు వచ్చాడు.

"అరే! వదినగా రివాళ ఉదయాన్నే సాక్షాత్కరించారే! మా అదృష్టం పండింది. రండి రండి," అంటూ ఆతడు లోనికి దారితీశాడు.

అపర్ణ నవ్వుకుంది అతని చేష్టలకు.

"మా శకుంతల ఏదయ్యా మరిది గారూ!" అందామె పరిహాసంగా.

"రాచకాంత కదండీ! అంతః పురంలో ఆటలాడు కుంటున్నారు." అంతలో శకుంతల రానేవచ్చింది. ఆమె వదనం కలువలా విచ్చుకుంది అపర్ణను చూచి.

"అక్కా! ఏమి టింత దయ చెల్లెలిపై. కబురంపితే రానూ! ఆయాసపడుతూ నీవు రావటమెందుకు?" అమెను కౌగలించుకొని లోపలికి తీసుకువచ్చింది. వారి పవిత్ర స్నేహానికి మురిసిపోయాడు జగదీశ్ బాబు.

అపర్ణా, శకుంతలా గదిలో కూర్చున్నారు...

"అక్కా! అనుక్షణం నీరూపం నా కంటిముందు వుండి నీస్మృతి నామనసుకి గిలిగింతలు పెడుతుంది నిన్ను చూస్తే ఏదో పులకింపు నాకు;" ఆమె చేతుల్ని తన చెంపలకు ఒత్తుకుంటూ అంది శకుంతల.

అటుగా వచ్చిన జగదీశుణ్ణి చూస్తూ అపర్ణ అంది. "మరిదిగారికి ఫలహారం పూర్తయిందా? ప్రొద్దున్నేవచ్చి ఆయన గారికి కోపం తెప్పించలేదు గద!"

"ఇక నావిషయం గుర్తుండటం కల్ల. మీ సమక్షంలో వుంటే ఆమె అన్నీ మరిచిపోతుం దనుకుంటా," అన్నా డాతడు పరిహాసంగా.

"అందుకే పాపం మీరంత చిక్కి పోయారు ప్చ్! ప్చ్! ఎంతగా హింసించాను మిమ్మల్ని. పుష్టుగా కాఫీ, టిఫిన్ ఆరగించి నైవేద్యం తిని, తినని దేవుడిలా ఆకలి చూపులు చూస్తున్నారు. ఎంత నైవేద్యం అయినా ఆ వుదరం నిండదక్కా!" శకుంతల నేరం ఆరోపించింది.

"అలాగైతే ఎలాగండీ మరది గారూ! మా శకుంతలనే తినేయరుగదా కొంపతీసి," అంది అపర్ణ నవ్వుతూ. జగదీశుడు పగలబడి నవ్వాడు ఆ మాటలకి. శకుంతల మూతి బిగించుకుంది.

"చూశారా! వదినా! ఆ మూతి బిగింపులో తలప్రాణం తోకకి వస్తుంది. నే నేదో తిక్కపనులు చేస్తూంటాను. మీ చెల్లెలిగారు కాస్సేపు మూతి బిగించి, తరువాత నన్నోదారుస్తారు. మీ ముందే నన్నింత హడలగొడుతోంది. ఇక మీరు లేకపోతే నా పని హుళక్కి." అతి

ప్రయత్నంమీద నవ్వు ఆపుకొన్నా డాతడు

శకుంతల ఫక్కున నవ్వేశింది. అపర్ణా నవ్వింది – కళ్ళల్లో నీళ్ళు నిలిచేంత వరకూ. "సరే, నే వెళ్తున్నాలెండి." ఆతడు వెళ్ళిపోయాడు

'ఎలా భరించుతున్నావ్ శకూ, యీ అల్లరి పిల్లాణ్ణి? అంత నిర్మలుడు కాఒట్టే నీ మనస్సు జయించాడు. అతనికి స్త్రీగా కనిపించింది నీ వొకదానివే. సృష్టిలో స్త్రీ పురుష భేదం నీ ముఖంలోనే కన్పించిం దా డాక్టరుగారికి,'' అందామె.

శకుంతల మౌనం వహించింది. అపర్ణ ఆశ్చర్యపడింది ఇదివరకిటిలా జగదీశుని పేరెత్తితే వ్యతిరేకించనందుకు ఆమెకి కారణం వూహ కందలేదు. శకుంతల అనుకుంది. 'అసలురహస్యం చెబితే ఎవరు జగదీశుడు? ఎవరు సత్యానారాయణ. నీకు నచ్చినవాళ్ళల్లోకూడా పాతకాలంనాటి బురదవంటి బుద్ధుల్ని ప్రవేశపెట్టకు, భగవంతు డేదియిచ్చాడో దాన్ని అత్యంత భక్తితో గ్రహించు." అంటుందని ఆమె భయం. అస లలా అనాలనే ఆమె హృదయం కోరుతున్నది. అందువల్ల రహస్యం రహస్యంగానే వుండిపోయింది.

"చూడు శకూ! సూదంటురాయి మంచినాణెం ఐతేనే ఆకర్షిస్తుంది కదూ!"

"అయితే నన్ను సూదంటురాయి అంటావు. ఏం అక్కా!"

'తప్పేముందమ్మా! మనసులోని మంచికోరికను సంఘానికని బలిపెట్టటం పతివ్రతాధర్మం కాదు సుమా! అప్పుడది ఆర్షేయధర్మ మనీ అనిపించుకోదు. పున్నమి వెలుగులో చీకటికి చోటెలా వుంటుందమ్మా! వెన్నెలకన్నా స్వచ్ఛమైన నీ మనస్సు కోరరాని కోర్కెతో 'అసహజాన్ని' ఎందుకు కావాలంటుంది? అవినీతి నెలా హర్షిస్తుంది? జగదీశుని సంయమనశక్తి అద్భుతం; అతనిలాంటి వాళ్ళు ప్రపంచంలో చాలా అరుదు."

'అక్కా! నీ అభిప్రాయం నాకు తెలుసు! కాని కత్తుల వంతెనమీద నిలబడి చోద్యం చూడమంటూంది సంఘం. కొన్నాళ్ళు నన్నీ అందీ అందని సుఖం కోసమే పరుగెత్తనివ్వు. అసలు సుఖం అందిననాడు, భగవానుడిచ్చిన వరం తిరిగి లభ్యమైననాడు నీ పాదాలు పూజించటానికి వస్తాను " అపర్ణ ఒడిలో పసిపాపలా ఒదిగిపోయింది శకుంతల ... కన్నీటి బిందువులు తళుక్కు మన్నాయి.

"రేపు నేను వెళ్తున్నాను శకూ !"

ఆమె కంఠం గద్గదికమైంది.

శకుంతల త్రుళ్ళిపడింది మాట విని.

ఆమె కనులవెంట అవిరళంగా స్రవించాయి అశ్రుధారలు.

"పిచ్చీ ! ఏమి టిది ? మళ్ళీ కొన్నాళ్ళలో రానూ, జగదీశుని ఆలయంలో నీ రూపం చూడటానికి. ఏదీ ఒక్కసారి

నవ్వు:'' నవ్వుతూన్న ఆమె నేత్రాల్ని ముద్దుపెట్టుకుని సెలవు తీసికొన్న దపర్ణ.

## 23

ఆరోజు కాంతం రాత్రి కూడా యింటికి రాలేదు. కాశంగారు ఎంత వెదికినా జాడ తెలియలేదు2 రాజారావ్ జాడ కన్పించలే దాయనకు.

తెల్లవారింది. ఎనిమిది గంటలకు నెమ్మదిగా అడుగులో అడుగు లేసు కుంటూ దొంగలా వచ్చిం దామె.

ఆమె కళ్ళలోకి సూటిగా చూశా డాయన. "కాంతం, నీకు యింకా నీతీ, నిజాయితీ వుందా ?" అని గర్జించాడు, ఆమె వాలకాన్నిచూచి - ఆమె తల ఎగరేసుకుంటూ లోపలికి వెళ్ళింది ఆయన శకుంతలదగ్గరికి వెళ్ళి కాంతం యిలా పిచ్చిగా తిరుగుతోందని బాధగా చెప్పాడు. కొన్నాళ్ళపాటు నా దగ్గరకు పంపించమం దామె.

## 24

కాంతం శకుంతల యింట్లో ఎవర్నీ లెక్కచేయటంలేదు. జగదీశుడంటే ఆమెకి లక్ష్యంలేదు. శకుంతల మాటల్నీ, సలహాల్నీ లెక్కపెట్టదు షికార్లు మాన లేదు మరింత ఎక్కువైనాయి. వింత వింత స్నేహాలు ఎక్కువైనాయి. రాజు మాత్రం ఒక్కసారీ రాలేదు. శకుంత లకి కనబడలేదు.

ఆ రోజు కాంతం చీకటి పడుతూండగా వచ్చి భోజనం చేసి రెండు పుస్త కాలు పుచ్చుకొని మళ్ళీ పోతుంటే శకుంతల అడ్డుపడింది.

''రాజారావు ఎన్నింటికి రమ్మన్నాడు చెల్లీ తన రూమ్‌కి.''

"నేను వనజ దగ్గరికి వెళ్తున్నా;" కోపంగా అంది కాంతం "నేనెక్కడికి వెళ్తే నీకెందుకు?'' విసుక్కుంది.

"త్వరగా వచ్చేయి చెల్లీ; రాత్రికి అక్కడ వుండకు," సౌమ్యంగా చెప్పింది శకుంతల.

''మీ సలహాలు నాకేం అక్కర్లేదు." విసురుగా దూసుకుపోయింది కాంతం శకుంతల నిర్ఘాంత పోయింది 'రాజా రావు వూళ్ళోంచి త్వరలో వెళ్ళిపోతాట్ట' అని విజయ్ చెప్పా డామెకు.

ఆ రాత్రి ఏమైనా సరే కాంతం విషయం తేల్చుకోవా లనుకుంది శకుం తల. కాంతము నెలా దారికి తీసుకు రావాలా అని ఆమె బుర్ర బద్దలై పోతోంది. జగదీశుడిపైకూడా కొంచెం శ్రద్ధ తగ్గింది ఈ నూత్న సమస్యతో.

ఆ రాత్రి విజయ్‌ని వెంటబెట్టుకుని ఆమె రాజారావు గదికి వెళ్ళింది. వాళ్ళు వెళ్ళేసరికి రాజా కాంతం ఇద్దరూ మంచంమీద కూర్చుని లోకాన్ని అప హాస్యం చేస్తున్నారు. వాళ్ళని చూచి రాజారావు మంచం దిగాడు. కాంతం కాళ్ళూపుకుంటూ అలాగే కూర్చుని చూస్తోంది.

ఇవాళ ఇన్‌స్పెక్షనుంది, రావడానికి
ఆలస్యమవుతుందన్నా — మా
ఆవిడ కంటనీరు తిరిగింది -
తలుపు విసురుగా వెయ్యగా
జోయి వేళ్ళనలిగాయి



"ఏం బాబూ ఆడపిల్లనింత సేపు కూర్చోబెట్టుకోటం మంచిదేనటయ్యా? మీ అమ్మ నీకింత మంచిబుద్ధిని ఎన్నాళ్ళు కష్టపడి నేర్పిందయ్యా" సరళంగానే అడిగింది శకుంతల ఆతడు తెల్లబోయి తల వంచుకున్నాడు

గదినిండా చిందరవందరంగా పుస్తకాలు పడివున్నాయి 'ఏమయ్యా! యిలాగేనా పుస్తకాలు పారవేసేది... మీరు పైనా, అవి క్రిందా అవి బ్రతకలేక మీ నీడన తల దాచుకుంటున్నాయా?" ఆమె ఆ పుస్తకాలు ఎత్తింది ఆ హేళన యీసారి రాజారావు కింకా ఘాటుగా తగిలింది

'కాదక్కా, ఇప్పుడే పడిపోయాయి," అన్నాడతడు. 'అక్కా' అని పిలిచినందుకు తనలో తానే ఆశ్చర్యపోతూ.

"ఈ అక్కకిక తమ్ముళ్లు అనవసరమయ్యా బాబూ! నువ్వు అక్కా అని పిలిస్తే నీ అప్యాయతకి కరిగిపోవటానికి నాలో ఇక శక్తి లేదయ్యా రాజూ!'' ఆ వ్యంగ్యం సూటిగా వచ్చి సంస్కారపు నేత్రాల్లో గుచ్చుకుంది విజయ్‌కి కుర్చీ యిచ్చి ఆమె అలా నిలబడే వుంది

"అవును, మా అక్కయ్యగారికి తమ్ముళ్ళంటే అసహ్య రాజా! మరుదులంటే అతి ఇష్టం పాపం, విశాల హృదయులు కదూ," కాంతం వెటకారంగా అంది.

విజయ్ కోపంగా చూశాడామెవంక. శకుంతల చిన్నగా నవ్వింది "అవును చెల్లీ! నాకు తమ్ముళ్ళంటే నిజంగా అయిష్టమే లేనిగుణాల్ని వున్నవని

ఆకాశానికి ఎత్తేస్తారు వాళ్లు మరుదులైతే వేళాకోళంగానైనా లోపాల్ని ఎత్తిచూపు తారు నీతి నియమాల్ని విడిచి ప్రవర్తించటానికి జడుస్తాను నేను '' పరిహాసం, కర్కశత్వం మేళవించింది. తనబాణం తనకే తిరిగి వచ్చినందుకు సిగ్గుపడింది కాంతం

"సరే, మీ చదువు అయినట్టేనా ' ఏమయ్యా రాజా! కాస్త మా కాంతాన్ని పంపించు బాబూ '" అందామె

"ఇదిగో శకుంతలగారూ ' మీ రెవరసలు, నామీద అధికారం చెయ్యటానికి ముందు మీరు వెళ్ళిపోండి యిక్కడనుండి," ఉద్రేకంగా అంది కాంతం.

''నీవు వచ్చేయి అక్కా, వెళ్ళిపోదాం, ఛీ," విజయ్ విసుక్కున్నాడు

''వెళ్తాను కాంతం ఎంత హేళనగా పరిహసించినా, తోటి స్త్రీవని యింతలా చెప్పాను. జీవితంలో నువ్వు ఓడిపోయి, పుల్లతో పొడుచుకున్న కళ్ళకి పొగవేసి నీళ్ళు కారుతూంతే – నా దగ్గరకు వచ్చావంటే.. ఆప్యాయంగా తుడుస్తాను ఆ నీళ్ళు ... విధి విధాత, నిర్దయా లనే రెండువుత్తమ ధర్మాల్ని గుర్తుంచుకొని సముద్రంలోకి చూకు, ఒక్క క్షణమైనా ఆగకుండా ఆమె విజయ్‌తో తిన్నగా యింటికి వెళ్ళిపోయింది

విజయ్‌బాబు యింటికి వెళ్ళిపోయాడు శకుంతల వెళ్ళి కాళ్ళు కడుక్కుని అన్నం వడ్డించుకోబోతూ కాంతమ్మతో "వారు భోంచేశారా ' అమ్మా,' అని అడిగింది.

''లేదమ్మా ' ఆకలి. లేదన్నారు "

శకుంతల నెమ్మదిగా గదిలోకి వెళ్ళింది. ఆతడేదో చదువుకుంటున్నాడు కోపం నటిస్తున్నాడని గ్రహించిందామె

''ఏ పరీక్షకు కూర్చోబోతున్నారు యింకా చదువుకుంటున్నారు ?" నవ్వు నాపుకుందామె

ఆతడు మాట్లాడకుండా పేజీలు తిప్ప సాగాడు.

''అంతా కోపమే' భోజనం ఎందుకు మానినట్లు తమరు,'' శకుంతల ఆతని చేతిలోనుండి పుస్తకం లాగివేసింది.

"ఏం, యింత తీరిగ్గా అడుగుతున్నారు ? ఎలా తీరిక దొరికింది ? ప్రక్కయింటి మామ్మగారు జ్వరంగా వున్నారా ! లేక యింకెవరైనా కష్టంలో వున్నారా !" హేళనగా అన్నాడు. ఆతని కోపం గ్రహించిందామె.

''భోంచేసి మీ యిష్టమైనంత సేపు పోట్లాడండి నాకంతా తీరికే, పదండి "

''నా కక్కర్లేదు "

''అయితే నేనూ తిననులెండి ''

"నీవెందుకు మానుకోవాలీ?"

''ఎందు క్కోపంగా వున్నారు మీరు "

"నే నెవర్ని నీమీద కోపం తెచ్చుకోవటానికి "




''ఎవరని మాట్లాడా రింత సేపూ !'' ఆమె నవ్వు నాపుకుంది.

"పొరపాటే శకుంతలా! ను వెళ్ళి భోజనం చెయ్యి:'' విసుక్కున్నా డాతడు.

"సరేలెండి," ఆమె వెళ్ళిపోయింది విసురుగా. వంటింట్లో గ్లాస్లూ, గిన్నెలూ చప్పుడు. అన్నీ సర్దేసి, మంచినీళ్ళు త్రాగేసి, బిందెని తన్నేసి, ఆమె విసురుగా తలుపు వేయబోయింది

''వడ్డించు,'' పసిపిల్లాడిలా వచ్చాడు జగదీశ్‌బాబు శకుంతల ఆశ్చర్య పడ లేదు. ఆతడు వస్తాడని ఆమెకి తెలుసు

ఆమె తలుపు తీసి వడ్డించి గుమ్మాని కానుకొని నిల్చుంది ఆతడు అన్నం కలపడమేకాని ఒక్క ముద్దకూడా ఎత్త లేదు.

"నువ్వుకూడా వడ్డించుకో శకూ!"- వెరుగ్గా అన్నా డాతడు.

''ముందు మీరు కానివ్వండి. ఇద్దరు శకుంతలలు లేరిక్కడ. వడ్డించటానికీ, తినటానికీ... '

జగదీశుడు మాట్లాడకుండా భోజనం చేశాడు ఆతడు మాట్లాడకుండా తినటం చూచి వస్తూన్న నవ్వాపుకోవటానికి శకుంతల పైటచెంగు నోట్లో కుక్కుకుంది.

శకుంతల వడ్డించుకుంటూంటే అతడు పీట వాల్చుకుని కూర్చున్నాడు అక్కడే. శకుంతల నవ్వింది

''మీ అమ్మగారుంటే ఆమె ఒడిలోనే కూర్చుని వైద్యం చేసేవా రేమోకదూ!'' ఆమె పరిహాసం చేసింది. ''లోపలికి వెళ్ళి చదువుకోరాదూ!''

"చదువా! రేపేం పరీక్ష వుందీ?''

అమాయకంగా అన్నాడు. ఇద్దరూ ఫక్కున నవ్వారు. శకుంతలకు పొర పోయింది.

భోజనాలు పూర్తయి తలుపులు వేసి గదిలోకి వచ్చారు తెల్లని చీరెలో స్వచ్ఛంగా మెరిసిపోతోంది శకుంతల. టేబిల్ మీద చిందరవందరగా వున్న పుస్తకాల్ని ఆమె సర్దుతూంటే జగదీశు డామెవంకే చూస్తూ, "శకూ! నీ కింత ఓర్పూ, అందం ఎవ రిచ్చారు!" అన్నాడు దగ్గరకు వస్తూ ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"ఇదికూడా ఓ అందమే"

"కాదని ఎవ రంటారు? ఏదీ! శకూ! ఒక్కసారి నా వంక నవ్వుతూ చూడవూ!" జగదీశు డామె గడ్డంపట్టి ఆమె ముఖాన్ని పైకెత్తాడు. ఆమె కళ్ళల్లో కళ్ళుంచి చూస్తూ ఆమె తడబడి పోయింది.

"ఇంత మంచిదాన వెందు కవ్వాలి నువ్వు?" ఆమె నుదుటిని ముద్దుపెట్టు కున్నా డాతడు ఆమె అలా చూస్తూ వుండిపోయింది. తాను చేసినపనికి భయ పడుతూ చూశా డతడు

"ఎందు కలా చూస్తారు? మీ హృద యాన్ని మీరు స్పర్శించి పడుకోం డిక!" శకుంతల జగదీశుని జుత్తు సర్దుతూ అంది అతని పాదాలు కళ్ళ కద్దుకొని నమస్కరించి వెళ్ళిపోయింది, జగదీశ్ బాబు పరవశత్వంతో-ఆనందంతో నిండి పోయా డెంతగానో!

# 25

అపర్ణకు ఆరోమాసం వచ్చింది. ఆమెకు కొంచెం అయాసంగా, నలతగా కనిపిస్తే చంద్రానికి భయం. టానిక్కులు వాడుతూ ఆమెను జాగ్రత్తగా చూస్తూ, చిన్న విషయానికి కంగారు పడిపోతూ, హడావుడి చేస్తూంటాడు

"అంత అధైర్యపడకూడదు ఎక్కువ ప్రేమించే వస్తువులు మానవుల దగ్గర అట్టేకాలం వుండవు," అనేది అపర్ణ అత డా మాటలకి భయపడి కోప్పడేవాడు

అతడు రాత్రిపూట ట్యూషన్లూ, పగలు మిల్లుపనీ మాననేలేదు. ఆరోగ్యం క్రమంగా దిగజారిపోతోంది అపర్ణ ఎంత మొత్తుకున్నా వినడు. ఆతని కళ్ళు చాలా దెబ్బతిన్నాయి చూపు కూడా చాలా దెబ్బతిన్నట్లు ఆతనికే అనిపిస్తోంది అపర్ణకి చెప్తే భయపడి పోతుందని చెప్పలేదు

"అపర్ణా! నువ్విక ఏలూరు వెళ్ళిపోకూడదూ! అక్కడైతే నీ ఆరోగ్యం యింకా బాగుంటుందేమో..." భయ పడుతూనే వెల్లడించా డా రాత్రి

"ఏం, నాతో మాట్లాడుతూ గడిపే టైముక్కూడా మరో రెండు ట్యూషన్లు ఒప్పుకుందామనా!" నిష్ఠురంగా మాట్లాడిం దామె ఆతని షర్టుగుండీలు తీస్తూ

"నీతో వచ్చిన చిక్కే యిది!" ఆతడు విసుక్కున్నాడు.

నిజంగా అపర్ణ అన్నది ఆతని మన సులో మాటే ఇంకా ఆరునెలలు శ్రమిస్తే అయిదువేలూ పూర్తవుతా యన్న నమ్మకం బలపడిపోయిం దాతనికి

చంద్రం నాన్నగారికి పక్షవాతం అని తేలిపోయింది అరుణకి మాత్రం ఆ విషయం తెలియనివ్వ వద్దన్నా డాయన. 'ఈమధ్య అపర్ణావాళ్ళు ఎక్కడున్నారు బాబూ!' అని అడిగా డాయన చంద్రం ఆశ్చర్యపోయాడు రామ భద్రమ్మగారూ యీ పరిస్థితుల్లో చాలా బెంబేలు పడిపోయారు. తా ననుకున్నది ఒక్కటీ కలిసిరానందుకు ఆమెకు దిగులు కొండంత అవుతూవుంది 'అపర్ణ వుంటే' అన్న భావం పదే పదే వస్తూంది. చంద్రం యింటికి రావటం తగ్గించటం చూచి ఆతడుకూడా పెద్ద కొడుకులా తమ్ము విడిచిపెట్టేస్తాడేమో నని ఆమె వణికిపోతోంది ఈ మధ్య ఎవరో 'అపర్ణ చంద్రంతో విజయవాడ లోనే వుందటగా' అని వాళ్ళ నడిగారు. ఆ వార్తకు ఆ ముసలి హృదయాలు సంతోషించాయి. కాని 'లేదు' అన్న చంద్రం మాట విని చిన్నబుచ్చుకున్నా రిద్దరూ.

ఈ విషయం అపర్ణతో చెబుతూ "అమ్మా, నాన్నా మారుతున్నారు." అన్నా డాతడు ఆశగా అపర్ణ నవ్వు కుంది అందమైన అపర్ణ యింకా అందంగా వుంది సౌందాగా పవిత్రత పుట్టిపడుతూ...అపర్ణ నిండుగా వుంది.

"అపూ! నీకిప్పు డేం కోరిక లున్నాయ్! ఎటువంటి వూహలు ఉన్నాయ్ ఏ ఉత్తమ భావాలు నీలో పరుగెత్తుతున్నాయ్? కాస్త చెప్పు" ఆసక్తిగా అడిగాడు

"ఏం? నా వూహలూ, భావాలూ వుత్తమంగా వుంటే బంగారు కొండ సుగుణాంకుని పుట్టి మిమ్మల్ని వుద్ధ రించుతా డనేకదూ! మీ రడగటం!' ఆమె ఆతని అభిప్రాయాన్ని వెల్లడిం చేసింది "అయితేవినండి నాకు ఎందుకో ఎప్పుడూ ఎవరిమీదైనా సరే పోట్లాడా లన్పించుతోంది. అల్లరిపనులు చేయా లని ఆరాటంగా వుంటోంది"

"ఆఁ ఆఁ అపు! మహారాణీ! యింకా చెప్పావంటే నాకు పిచ్చెక్కి పోతోందని భయమేస్తోంది" వారించా డాతడు ఆమె ఫక్కున నవ్వింది

"అబ్బా!" ఆమె మూలిగింది

"ఏం! ఏమయింది అపూ" ఆత్రంగా అడిగా డాతడు

'ఏమవుతుంది? మీ చిలిపి దొరబాబు అల్లరిగా తిరుగుతున్నాడు బొంగరంలా,' అందామె తన కుడి డొక్కవంక చూపిస్తూ.

"ఏదీ చూడనివ్వు," ఆతడు తల వంచాడు కుర్చీలోంచి.

ఆ వంగటంలో ఆతని తల అపర్ణ నుదుటికి కొట్టుకుంది

"అరే !" అంటూ ఆతడామెను హృదయానికి హత్తుకొని నుదురు నిమిరాడు.

అపర్ణ ఆతనివైపు చూచి మందహాసం చేసింది. "పెద్దదొరలే యింత అల్లరి మనుషులైతే చిన్నదొర యింకా రెండాకులెక్కువే చదువుతాడు," అందామె

"అయినా ఫరవాలే దపూ ! యిద్దరం కలిసినా నువ్వు విసుక్కొని మమ్మల్నెప్పుడూ కొట్టవు." అన్నాడామెవంక చూస్తూ

"అబ్బో ! ఎంతఆశ దొరగారికి," ఆమె నేత్రాలు విశాలమయ్యాయి

"అపూ! బాబు పుట్టగనే ముందు వాడి కళ్ళు చూస్తాను నేను నీ కళ్ళకంటే పెద్దవే వస్తాయేమోకదూ !"

"మీ కెలా తెలుసో !"

"నాకు చెప్పాడు నిన్నరాత్రి అమ్మతో చెప్పకన్నాడు. చెప్పేశా."

"అబ్బ ! ఎంతప్రేమ మీకు వాడి అమ్మమీద," అందామె గర్వాన్ని అణచుకొని...

అపర్ణకు ఎనిమిదోమాసం ప్రవేశించింది చంద్రం ఆమె వద్దంటున్నా వినకుండా ఏలూరు వెళ్ళి శారదాంబగార్ని తీసుకొచ్చాడు. ఆమె వచ్చిన అయిదవ నాడు చంద్రంతల్లీ తండ్రీ బండిలో చంద్రంయిల్లు వెతుక్కుంటూ వచ్చారు.

చంద్రం తండ్రి మరీ లేవలేని స్థితికి వచ్చాడు. రామభద్రమ్మ. భయపడి, కొడుకుదగ్గరికి తీసుకువచ్చింది

అపర్ణని చూసి యిద్దరూ ఆశ్చర్యపోయారు సంతోషంతో ఆమె హృదయం పూగిపోయింది. ఆమె నఖశిఖ పర్యంతం అపర్ణనుచూస్తూ నిలిచిపోయింది

"ఏం అత్తయ్యగారూ ! మీ కోడల్ని, గుర్తుపట్టలేదా !" అంటూ అపర్ణ ఆమె పాదాలకు నమస్కరించింది

రామభద్రమ్మ అపర్ణను కౌగలించుకొని అట్టే నిలిచిపోయింది.

"ఎన్నోమాసం తల్లీ!" అడగలేక అడగలేక అడిగింది.

"ఇంకా రెండునెలలో నెలో ఓపిక వహించాలి, అంతదాకా మీ కోడల్ని క్షమించాలి," అందామె మామగారి ప్రక్క సర్దుతూ

చంద్రం సాయంకాలం వచ్చి ఆశ్చర్యపడ్డాడు తల్లిదండ్రుల్ని చూచి 'ఏం కథ' అని ప్రశ్నించా డాతడు కళ్ళతోనే.

"రసపత్తరమైనదే లేండి,"అందామె కళ్ళతోనే.

అపర్ణను చూచి - మామగారు కొంచెం సిగ్గుపడ్డారు. ఆయన ధన వ్యామోహం ఏమూలో ఇంకా మిణుకు



మంటూనే వుంది అపర్ణ నెలలు నిండుతున్నా మామగారికి శుశ్రూషలు చేయటము మానలేదు వయస్సు పైబడ్డ రామభద్రమ్మగారు అంతగా తిరగలేక పోతోంది పదిరోజులనుండి మామగారికి విపరీతంగా జ్వరం వస్తోంటే... శుశ్రూష అన్నీ అపర్ణే చేస్తోంది రామభద్రమ్మగారికి కాలూ చేయీ ఆడటం లేదు సేవ అంతా అపర్ణే చేస్తోంది మగతి విడినప్పుడాయన కోడలివంక చూచి నిట్టూర్చేవాడు

రామభద్రమ్మగారు యిది చూచి కళ్ళనీళ్ళు తుడుచుకునేది ఆ రోజు ఆయనకు జ్వరం మరింత హెచ్చుగా వుంది. చంద్రం గాభరా పడ్డాడు డాక్టరు రెండింజక్షన్లు యిచ్చి గంటగంటకూ మందు వాడుతుండమని చెప్పి వెళ్ళాడు. రామభద్రమ్మగారి మనసు ఆందోళితమై పోయింది ఓ ప్రక్క నీరసంగా పడుకుందామె

జ్వరతీవ్రతలో ఆయన పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నాడు అపర్ణ కాయన పసిపిల్లవాడిలా తయారయ్యాడు "అసహ్యించుకోవటం ఆమె ఎరుగదు," అనుకున్నాడు చంద్రం అపర్ణకు తొమ్మిదో నెల వచ్చింది ఆయాసంగా వుంటోందామెసంగతి అయినా విసుగుకోక సేవ చేస్తూనే వుంది ఆయనకి బట్టలు మార్చటం, గ్లూకోజు ఇవ్వటం, విసరటం అన్నీ ఆమే ఆమె విసు

రుతూ వుంటే చంద్రం పుచ్చుకొనేవా డప్పుడప్పుడు

ఆరోజు చంద్రం తండ్రికి కొంచెం జ్వరం తగిలింది ఆతనికి వేడినీళ్లు కాచి పట్టుకురాబోయింది అపర్ణ చంద్రం పెరట్లో ముఖం కడుక్కుం టున్నాడు రామభద్రమ్మగారు లేవలేక పోతుంటే శారదాంబగారు ఆమె ప్రక్క సర్దుతోంది. అపర్ణ వేడినీళ్లు తెస్తూ ఆయాసంగా మరి అడుగు వేయలేక పోతోంది.

"అబ్బ! కొంచెం ఇలా రండి' అని పిలిచింది చంద్రాన్ని

"ఏం అపర్ణా!'' అత డాతురతగా వచ్చాడు

"ఏం లేదు కాస్త ఈ చెంబు క్రింద వుంచండి..." అత డలా చేసి ఆమె వైపు ఆందోళనగా చూశాడు

"ఏం భయం లేదులేండి. కాస్త మిమ్మల్ని అనుకోనివ్వండి, ఆయాసంగా వుంది," అంది ఆతడి నానుకుంటూ

"అబ్బ, నీతో వచ్చిన గొడవే ఇది అపర్ణా నీళ్లు నే నివ్వలేనూ అన్నిటికీ బయలుదేరుతావు " నందలించా డాతడు.

ఆమె నవ్వింది నీరసంగా, "కాస్త గదిలోకి తీసికెళ్ళండి తర్వాత తేలిగ్గా కోప్పడుదురుగాని కాస్సేపు పడుకుం టాను '' అతనిమీదవాలిపోయి నడిచింది

చంద్రం ప్రక్క సర్ది ఆమెను పడుకోబెట్టాడు

''ఇద్దర్నీ మోశారు.'' అందామె నవ్వుతూ

''సరే ! చూస్తాడ కిక,' అని వెళ్ళి పోయా డతడు ఆమె తాను లేకుండా వుంటే విశ్రాంతి తీసికొంటుందన్న వూహతో

# 26

ఆరోజు శకుంతల అపర్ణను చూడ టానికి వెళ్ళా లనుకుంది ఉదయం జగ దీశునితో కూడా చెప్పింది అతడు తాను కూడా వస్తా నన్నాడు సరే నని అంగీక రించిం దామె హాస్పిటల్ కి వెళ్తున్నానని బయలుదేరాడు

'మీ కసలే మతిమరుపు కాస్త త్వరగారండి,'' హెచ్చరించింది మృదువుగా

కావలసిన బట్టలూ, అవీ సర్దటం మొదలుపెట్టింది అలమారులో నగలు వున్నాయని తాళంవేసింది. జగదీశుని సామానుకూడా పదిలపరచింది. అప్ప టికి పన్నెండుగంట లయింది

భోజనం చేద్దామని లేచిం దామె

"శకుంతలా ! శకూ !" జగదీశుడు ఆయాసంగా వంటిట్లోకి బూట్లకాళ్ళతోనే రాపోయాడు ఎంగారుతో

''ఆ ! ఆ ! పదండి ! ఏమిటి,' అం దామె వారించి

"ఎవరో ఒకాయన వచ్చి 'నువ్వు సత్యన్నారాయణ శకుంతల ఎలా

వుంది?'' అని నేను కాదనిచెప్పినా వినిపించుకోకుండా కౌగిలించుకు వూపి రాడనియ్యటంలేదు వదిలించుకునేసరికి తలప్రాణం తోకకి వచ్చింది," అని చెప్పా డతడు నవ్వుతూ

శకుంతల నివ్వెరపోయింది తన అనుమానం తీరిపోయి ట్లు సంబరపడిం దామె కాస్సేపటివరకూ మాట్లాడలేక పోయింది.

''ఆయనకి సుమారు అరవై ఏళ్ళుంటాయికదూ! మనిషి ఎర్రగా, లావుగా ఎత్తుగా వున్నాడా? ఎడమ కనుబొమ్మ మీద గంటు వుందా?'' ఆమె ప్రశ్నల వర్షం కురిపించింది.

''అరే! నీ కాయన తెలుసా! అయితే వుండు ఆయన్ని యింటికి తీసుకు రమ్మని చెప్పాను నౌకరుతో. వచ్చేస్తుంటాడు,'' అన్నాడు అతడు.

''రండి వస్తున్నాడేమో చూద్దాం!'' అని శకుంతల పరుగున వాకిట్లోకి వెళ్ళి నిలబడింది జగదీశుని కేమీ అర్థం కాలేదు ఇంత తొందరపడటం శకుంతల కేనాడూ లేదు. అతడు అమితాశ్చర్య పడ్డాడు అంతలో నౌకరు రిక్షాలోంచి ఆయన్ని దింపాడు. ఆయన కాలు ఒకటి కొంచెం వాచివుంది కళ్ళు ఎర్రగా వున్నాయ్ జుత్తు రేగిపోయింది శకుంతల ఆయన్ని చూస్తూ వుండిపోయింది శిలావిగ్రహంలా

ఆయన శకుంతలవంక తదేకంగా చూచి "అమ్మా! శకుంతలా! తల్లీ బాగున్నావా! నాతల్లీ! తల్లీ,'' ఆతడామెను కౌగించుకొని అధిక సంతోషంతో వెర్రిగా అరిచాడు జగదీశుడు తెల్లవోయాడు.

''ఉన్నాను! నాన్నా! వున్నాను,'' ఆమె నోటినుండి నాన్నా అన్నపదం మధురంగా దూసుకువచ్చింది శకుంతల కళ్ళవెంట బొటబొటా కారిపోతున్నాయి అశ్రుకణాలు ఆయన ఆమె కన్నీళ్ళు తుడుస్తూ "ఛ! తప్పమ్మా! కంట తడెందుకూ! నీ బావ యిక్కడే నీ దగ్గరే వున్నాడుగా'' ఓదార్చా డతడు.

''నాన్నా! శకుంతలకు నాన్నా! నేను? బావనేమిటి!'' జగదీశుడు ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయాడు

శకుంతల కొంచెం సేపటికి తన వుద్వేగాన్ని అణచుకో గలిగింది జరిగిన విషయమంతా తండ్రితో చెప్పింది. ఆయన మౌనంగా విన్నాడు జగదీశుడు మరింత ఆశ్చర్యపోయాడు సంతోషించాడు, శకుంతల తనదే నని

''ఉండు తల్లీ,'' అంటూ ఆయన కుంటుకుంటూ వెళ్ళి తన సూట్ కేస్ తెరిచి ఓ పుస్తకం తీసి అందులోవున్న ఓ చిన్నఫొటోని తీశాడు "చూడు బాబూ! నువ్వు సత్యనారాయణవో జగదీశుడవో!'' అన్నాడాయన ఫొటో చేతికిస్తూ.

కళ్ళు నులుపుకొని చూశాడు జగదీశుడు. అవి తనకు తొమ్మిదేం డ్లుండగా

తీసిన ఫొటో' ప్రక్కన అచ్చు శకుం తులవంటి చిన్నపిల్ల నిలబడివుంది

శకుంతలవంకా ఆ ఫొటో వంకా - ఎన్నోసార్లు చూశా డాతడు పూమొగ్గగా వున్న శకుంతల, విచ్చిన శకుంతలగా కళ్ళ కెదురుగా కన్పిస్తోంది ఆతని ఆనందానికి అవధులు లేకుండా పోయాయి

"శకుంతలా ' శకుంతలా'" ఆతడు గాఢంగా కౌగలించుకున్నా డామెను ఆమె కళ్ళలో కళ్ళుంచి తన్మయత్వంతో మైమరిచిపోయాడు తా నెక్కడున్నదీ ఏ స్థితిలోవున్నదీ తెలియడంలేదు శకుం తల ఉద్వేగస్థితిలో తన్ను తానే మరిచి పోయింది ఆ రెండు పవిత్ర హృదయా లకీ వారి మూర్తులుతప్ప ఆ విశాల విశ్వంలో ఏమీ విన్పించడంలేదు వారి నేత్రాలు దివ్యజ్యోతుల్లా వెలిగిపోతు న్నాయి ప్రణయజ్యోతుల్లా తీయని మధురభావాలతో నిండి కాంతు లీను తున్నాయి వారిద్ద రాస్థితిలో ఎంతో సే పుండిపోయారు నిశ్చలంగా, యోగిపుంగ వులవలె -

శకుంతలతండ్రి కళ్ళవెంట ఆనంద బాష్పాలు రాలుతున్నాయి, ఆ పవిత్ర మూర్తుల స్థితి చూచి

"శకుంతలా - జగదీశు లిద్దరూ ఆయన పాదాలకు నమస్కరించారు. ఆయన నోటినుండి మాట పెగిలిరావటం కష్టమయింది

"శుభమస్తు" ఆయనకంఠం పూడుకు పోయింది ఆనందంతో

శకుంతల జగదీశుని పాదాలకు ప్రణ మిల్లింది. అత డామెను లేవనెత్తి "శకూ ' నువ్వు నిజంగా దేవతవు," అన్నా డామె నేత్రాల్లోకి చూస్తూ శకుం తల చిన్నగా నవ్వి వూరుకుంది ఆ నవ్వులో కోటిమల్లెలు విరిశాయి చిన్న గర్వరేఖ మెరిసిం దామె హాసంలో - జగ దీశుడు మైమరిచిపోయా డా నవ్వులో

## 27

అపర్ణ శకుంతలను కౌగలించుకొని "ఆ భగవానుని ఆశీర్వచనం ఇన్నాళ్ళకు ఫలించింది," అంది, ఆనందాశ్రువులు రాల్చుతూ అరుణ తండ్రిస్థితిచూచి విలవిల లాడిపోయింది బాధతో ఆయన కూతుర్ని చూడగానే కంటతడి పెట్టుకు న్నాడు. అరుణతల నిమురుతూ వుండి పోయాడు - అపర్ణకు కొంచెం విశ్రాంతి లభించింది. తండ్రి పనులన్నీ తానే చేస్తోంది అరుణ చంద్రం హృదయం లోని ఆరాటానికి విశ్రాంతి లభించింది. శకుంతలా జగదీశులరాకతో ఆతనికి లేని బలం వచ్చినట్లయింది - కాని ఆతని దృష్టి పూర్తిగా పాడైపోయింది పుస్త కములోని అక్షరాలు అతికష్టంమీద గుర్తు పట్టగలుగుతున్నాడు. కళ్ళవెంట ఒకచే నీరు అపర్ణ కంటపడకుండా వుంచా లని శతవిధాల ప్రయత్నించాడు ఆ సాయంత్రం అపర్ణ ఆతని పాదాలవద్ద

యువ




కూర్చుని అరుణా - విజయ్‌లగూర్చి చెప్పుతోంది

"మీరెలాగైనా సరే అత్తయ్యగార్ని ఒప్పించండి అరుణకీ, విజయ్‌కీ మూడు ముళ్ళూ వేసేద్దాం ఇక నే నెప్పుడు మీ సాన్నిధ్యంలో విశ్రమించి కలలు కంటూంటాను''

'ఆ, ఆఁ, చూద్దాం'' అన్నా డాతడు.

'అబ్బా!'' అంటూ మూలిగిం దామె

చంద్రం గాభరాపడ్డాడు

'ఏమిటపూ! ఏమయింది?''

'కాస్త మీరు వెళ్ళి శకుంతల్నీ, అమ్మనీ పంపించడి,'' అం దామె.

"ఎందుకూ!''

''అబ్బ మీతో అంతా చిక్కే-మీకు-బుల్లిబాబు - దర్శనం కాబోతోంది, త్వరగా-'' ఆమెబాధలో మెలికలు తిరిగి పోతోంది

ఆతడు బయటికి పరిగెత్తాడు.

శకుంతలా, శారదాంబా, రామభద్రమ్మగారూ ముగ్గురూ గాభరాగా లోపలికి వచ్చారు ప్రసవవేదనలో ఆమె మెలికలు తిరిగిపోతోంది. మాతృత్వంకోసం ఎంతబాధ అనుభవించాలో ఆమె కర్థమవుతోంది ఉన్నకొద్దీ శక్తి సన్నగిల్లుతోంది

రాత్రి పదిగంటల కామె బాధ నివారణ అయ్యింది - మగపిల్లవాడు

తెలివివచ్చి గర్వంగా బాబును చూచుకొని పొంగిపోయిం దపర్ణ. చంద్రం యీ వార్త విని అమితంగా సంతోషించాడు అంతా ఆనందపడ్డారు బాబును చూచి.

"బావగారూ! మీకు సూర్యుడు పుట్టాడు," అంది శకుంతల

చంద్రం లేచాడు చీకటిగదిలో కూర్చున్న ఆతడు కళ్ళు నులుపుకూన్నాడు— "అరే మీరు లైటు లీసుకు

రాలేదా ! సూర్యుడు పుట్టిం దక్కడగా ! యిక్కడ వెలుగెలా వుంటుంది ." అతడు మళ్ళీ నులుముకున్నాడు కళ్ళకు నల్లనితెరకట్టినట్లుకన్పించుతోంది తనికి

"అరే! నా చేతిలో లైటు దివ్యంగా వెలుగుతోందే !" ఆమె ఆశ్చర్యపడింది

"ఆ! నిజంగానా! శకుంతలా! నా కేమీ కన్పించటంలేదు కన్పించటం లేదు అయ్యో! గ్రుడ్డివాణ్ణి నేను!" ఆతడు బిగ్గరగా అరిచాడు

"ఏమిటి? చంద్రం! ఏమి కన్పిచటం లేదు!" జగదీశ్ బాబు లోపలికి వచ్చాడు హడావుడిగా

"జగదీశ్! నాకు ఒక్క క్షణం కళ్ళివ్వు. నా చిట్టిబాబును ఒక్కసారంటే ఒక్కసారి చూచి పోతాను జగదీశ్! నువ్వు పెద్ద డాక్టరువి నాకు కళ్ళివ్వు." చంద్రం జగదీశ్‌ని పట్టుకు వూపేశాడు ఆవేదనతో అల్లాడిపోయాడు

"హుష్! మీరు పెద్దగా అరవకండి అక్క కీమాట తెలిస్తే ప్రమాదం" శకుంతల యీమాట అనగలిగింది.

అపర్ణ గుర్తురాగానే జగదీశుడు కరిగి పోయాడు బాధతో. అంత "అమృత మూర్తికి ఎంత కఠినశిక్ష! భగవాన్! నీ కలలు చిత్రాతిచిత్రంగా వుంటాయి," అనుకున్నా డతడు

చంద్రం కళ్ళకంతా శూన్యమే కన్పిస్తోంది.

"చంద్రం! నాకు సాధ్యం కాదిక నా ఫ్రెండ్ రఘునాథ్ యిక్కడే వున్నాడు. త్వరగా వెళ్దాంపద —"

"శకూ! నీ వెవరికీ ఏమీ చెప్పకు."

జగదీశుడు చంద్రంతో వెళ్ళిపోయాడు— డాక్టర్ రఘునాథ్ బ్యాటరీ వేసి పరీక్షించాడు మందంగా వున్న తెల్లని పొర ఏర్పడింది కన్నులకు

"జగదీశ్! యింతగా ముదిరిపోయే వరకు— నీ పేషెంటును నీ వెలా వుంచ గలిగావ్!" అతడు పెదవి విరిచాడు ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టర్ అలా అనగానే జగదీశుడు హతాశుడై పాతాళానికి క్రుంగి పోయాడు నిట్టూరుస్తూ.

"మెదడుకి ఓవర్‌వర్క్‌వల్ల కళ్ళకి బాగా దెబ్బతగిలింది ఆపరేషన్ చేస్తే ప్రాణానికే ప్రమాదం! లాభం లేదిక." నిరాశతో చెప్పాడా డాక్టరు

"చంద్రం! వెళ్దామా!" ఏలోకం నుండో వచ్చినట్లుందా పిలుపు

"జగదీశ్! నేను రాను, రా లేను. న న్నెక్కడైనా వదిలిపో నా అపర్ణ కేమిచెప్పను? ఇంత అన్యాయాన్ని ఆమె కేవిధంగా చూపను? వణికిపోయి, మాటాడలేని ఆ మౌనాన్ని నే నెలా భరించను? జగదీశ్, వెళ్ళు! నన్ను విడిచిపెట్టు!" చంద్రం కన్నీరు కారుస్తున్నాడు జగదీశుడు బాష్పతప్త నయనాలతో లేని గాంభీర్యాన్ని తెచ్చుకొని అనునయించాడు జగదీశుణ్ణి నీరసంగా అనుసరించాడు చంద్రం

బాబు పుట్టి మూడురోజు లైంది. చంద్రం అంతవరకూ అపర్ణ గదిలోకి రాలేదు. అపర్ణకు తన అంధత్వం ఎలా చూపించాలో అర్థంకాక భయపడి పోతున్నాడు చంద్రం ఈ విషయం తెలిసి యింట్లో అందరూ ... అన్నం ముట్టలేకపోయారు చంద్రం తండ్రి నిర్జీవంగా చూశాడు కొడుకువంక అపర్ణ మనస్సులో అనుమానం బయలు దేరింది "బావగారు వూరెళ్ళి యింకా రాలే దేమిటే?" అంది శకుంతల

"ఏప్పారు వెళ్ళారు శకూ?" అపర్ణ గుచ్చిగుచ్చి అడిగింది

"ఏమోనక్కా! ఏదో అన్నారు వచ్చేస్తారు రేపో ఎల్లుండో!" విశ్వసించిందామె బరువుగా అపర్ణ మౌనం దాల్చి కళ్ళు మూసికొంది భర్తకు-తన బాబుని, బాబు ముద్దుగొలిపే నేత్రాలు చూపి-మెప్పు పొందాలని - పొంగిపోవాలని-అతని నేత్రాల్లో గర్వరేఖలు చూచి మురిసిపోవాలని ఆమెకు ఆత్రంగావుంది

ఒకరోజు న పట్టుబట్టిం దామె చంద్రాన్ని చూప మని ఆమె కేదో అనుమానం - "ఒట్టు, చూపించకపోతే," అంది శకుతో. శకుంతల గభాలున లేచి వెళ్ళి చంద్రాన్ని తీసుకువచ్చి - గదిలో నిలబెట్టి-పరుగున వెళ్ళిపోయింది అంతా హాల్లో నిలబడి కళ్ళు తుడుచుకుంటు న్నారు ... ఏం అగ్నిపర్వతం పగిలి పోతుందో నని భయపడుతున్నారు-వణికి పోతున్నారు

చంద్రం హృదయస్థితి వర్ణనాతీతంగా వుంది. తడుముకుంటూ అపర్ణ మంచం సమీపించా డాతడు అపర్ణ అతణ్ణి చూచి కెవ్వు మని అరిచింది పసిబిడ్డని హృదయానికి కదుముకొని భోరున ఏడ్చింది. దగ్గరనున్న కుర్చీ తగిలి దానిపై కూర్చు న్నాడు చంద్రం

అపర్ణ కళ్ళముందు ప్రళయ మే ఆవిర్భవించింది "నా కీ జన్మ వద్దిక. వద్దు! భగవంతుడా! వద్దు! నా కీ కళ్లూ వద్దు! నా కేమీ వద్దు! ఆశా వద్దు! నిరాశా వద్దు! నన్ను యీ లోకంలో వుంచవద్దు ఈ భయానక దృశ్యం నేను చూడలేను!" ఆమె నేత్రాలవెంట అశ్రుధారలు అవిరళంగా కారిపోతున్నాయి ఆమె నిలువెల్ల వణికిపోతోంది చంద్రం చేతితో అపర్ణ ముఖాన్ని అందుకున్నాడు ... ఆమె కన్నీరు తుడిచాడు

"అపర్ణా నువ్వింతలా అలమటిస్తుంటే నే నేమవ్వాలి! నా బాబు కళ్ళు యిలా వున్నా యని నీవుతప్ప నా కెవరు చెప్తారు? నా అంధకారమయ జీవితంలో నీవే దీపంలాంటిదానవు అన్నిటికీ నీ మీదే ఆధారపడాలన్న నా కోరిక యిలా తీరింది అ ప ర్ణా! నా కీ లోకంలో . యింకా.. ఏముంది?" అత డావేదనతో వణికిపోయాడు.

కళ్ళనీరు కారుస్తూ అపర్ణ పేలవంగా చూస్తూవుండిపోయింది – దీర్ఘంగా నిశ్వసించి చంద్రం చేతుల్ని కళ్ళకద్దుకుంది.

"నా కింత పెద్దశిక్ష అని వూహించలేదు. ఈ శిక్షలోనే నా కర్మఫలం పండిపోనీ భగవాన్" ప్రార్థించిం దామె

పసిబిడ్డను ఆప్యాయంగా తడిమి చూచా డతడు అపర్ణ లోలోన కుమిలి పోయిం దా దృశ్యం చూడలేక.

"అహా, పాప పేరేమిటి ?"

"'సూర్యం' బావుంది కదూ ?"

పేలవంగా నవ్విం దామె ..

శకుంతల పేర ఆ రోజున జాబు వచ్చింది. విప్పి చదివిం దామె వ్రాసింది కాంతం

"ప్రియమైన అక్కా,

నిన్ను సంబోధించే హక్కు లేదని తెలుసు. కాని నీవు క్షమాశీలివి. క్షమించటం నీకు చేతనయినట్లు ఎవ్వరికీ కాదు నా పతనం పరాకాష్ఠ నందుకుంది. నీ వన్న మాటలు ఇప్పుడు గుర్తొస్తున్నాయి.

'జీవితం ఒక వీణ అనుభవాలు ఆ వీణియపై నున్న తంత్రులు. మనస్సు నాదం, ఇందులో ఏది అపవిత్రమైనా ఆ వీణానాదం అనవసరం, అతి హేయమూ' అని

నా తుది ఘడియలు సమీపించాయి. కానీ నీ క్షమాసంపద కావాలన్పించింది అందుకే వ్రాశాను

క్షమిస్తావ్ గదూ.
కాంతం"

'హు పిచ్చి పిల్ల. ఇన్నాళ్ళకు, జీవన చరమాంకంలో జీవిత విలువల్ని గుర్తించింది ఆమె ఆత్మకు శాంతి ప్రసాదించు భగవాన్,' అన్న దా క్షమాశీలి మనస్సు.



# శ్రీనివాస కళ్యాణం

“కళ్యాణి' అక్షరాలా మీ కూతురు! మరొకళ్ళా మరొకళ్ళా కాదు, నేను నచ్చజెప్పడానికి” ఖంగుమంటున్న తల్లిగొంతు విని, అప్పుడే సినిమానుంచి వచ్చి మేడమీదికి పోబోతున్న కళ్యాణి మెట్లమీదే నిలబడిపోయింది

“అయితే కళ్యాణి పెంకితనం వేస్తుందంటావా?” సాలోచనగా అన్నట్లుంది పద్మనాభయ్య గొంతు.

ఏమిటో, తల్లీ తండ్రీ తననుగురించే మంతనాలు' అలాగే నిల్చుని వినసాగింది కళ్యాణి.

“అతడు ఐ. ఏ. యస్ అట ఢిల్లీలో ఉద్యోగం. ఇప్పుడు చూడకపోయినా వెనక ఏడెనిమిదేళ్ళ క్రితం చూచాను. చాలా అందంగా వుంటాడు బుద్ధిమంతుడు అటువంటి సంబంధం పోగొట్టుకుంటే మళ్ళీ తేలేం”

“మహాప్రభో, అవన్నీ సరే, నాకెందుకు? ముందు కూతురికి నచ్చచెప్పుకోండి”

“నువ్వు మెల్లగా చెప్పు ఒప్పుకోకపోతే నెను తర్వాత చెప్తాను”

“ఏమోమరి! ఆవిడ ఖచ్చితంగా చెప్పేసింది, పెళ్ళికొడుకును అది స్వయంగా చూచుకోవాలని. నా వల్ల కాదు యిక ఒప్పించటం అయినా కూతురికి పెంకెతనాలు నేర్పటం మీ వంతూను, దాన్ని దారికి తేవటం నావంతూనా?” అంటూనే వెళ్ళిపోయింది కమల

విషయం అర్థమైంది కళ్యాణికి నవ్వుకొంటూ వెళ్ళిపోయింది తన గదిలోకి ఎందుకో ఈ తలిదండ్రుల కింత తొందర, పెళ్ళిజేసి తరిమెయ్యాలని! అప్రయత్నంగా పెదవులపై చిరునవ్వు నిలచింది! తన పెళ్ళి చెయ్యటానికి తండ్రి చేసే ప్రయత్నాలిన్నీ అన్నీ అని చెప్ప నలవికాదు కొన్ని తండ్రికయిష్టమైతే కొన్ని తల్లికి నచ్చవు. ఆ యిద్దరికీ నచ్చినవాటిని అన్నయ్యలిద్దరూ 'సెన్సారు' చెయ్యాలి ఆ తర్వాత దాని భోగట్టా తనవరకూ వస్తుంది ఇక వాళ్ళలో ముఖ్యంగా తనకు కొట్టొచ్చినట్టు లోపాలేకాని సుగుణాలు కానరావు. నిర్మొహమాటంగా వద్దని తెగేసిచెప్తుంది, అదే తల్లికి కోపకారణం ఆమె కిష్టమైన వాటికి యిక కూతురు అడ్డు చెప్పడం ఆవిడ దృష్టిలో అలవిగానంత మహాప

ఆరెకపూడి కౌసల్యాదేవి

రాధం, సిగ్గులేని పని "ఇప్పుడు సిగ్గుపడి, తర్వాత నే నేడ్చి మిమ్మ ల్నేడిపించే కంటె ఇప్పుడే సిగ్గును త్రోసిపారేసి జీవితమంతా సుఖపడటం తెలివైన పని." అంటుంది కళ్యాణి ఆ వాదోపవాదాల వేడిలో ఒక్కోరోజు అసలు తల్లీ కూతుళ్ళు మాట్లాడుకోరు కూడ. 'ఏమైనా నాన్నగారు నా పక్షం, నా కేం భయిం?' అనుకొంటూంటే లోగడ జరిగిన పెళ్ళిచూపుల తతంగాలు గుర్తుకొచ్చాయి

ఒకసారి ఒక పెళ్ళి సంబంధం వచ్చింది, అట్టే పెద్ద ప్రయత్నాలు చెయ్యకుండానే పద్మనాభమూ, కొడుకులిద్దరూ పెళ్ళి చూచివచ్చారు. "చాలా బాగున్నాడు ఆస్తిపరులు. ఇద్దరే కొడుకులు. ఇతడే పెద్దవాడు, బి కాం. పాసై మద్రాసులో ఆడిటర్ కోర్సు చదువుతున్నాడు తప్పక పాసౌతాడు అందరూ అరవై వేలూ, యాభై వేలూ యిస్తామంటున్నారు కాని చదువుకున్న పిల్ల కావాలని కొడుకు ముచ్చటపడుతున్నాడు గనుక కొంచం తక్కువ కట్నమైనా మనమ్మాయిని చేసుకుంటారట ముప్ఫై వేలకు మాత్రం తక్కువ తీసుకోరట," అని చెప్పారు, ఇంటి కొచ్చి ఆ మాటలు కళ్యాణి వింది విన్నట్టే మర్చిపోయింది అమె దృష్టి ఎంతసేపూ చదువూ, పుస్తకాలూ, స్నేహితులూ మీదనే వుంటుంది కాని యింకో గొడవ పట్టదామెకు

వారం రోజులు పోయాక పెద్దన్నయ్య శ్రీహరి భోజనం చేస్తూ చెప్పాడు. అందరూ అక్కడే వున్నారు. 'మనం ఆ సంబంధం వదులుకోవటం మంచిది నాన్నా' ఇవాళ వాళ్ళ దగ్గర్నుంచి వుత్తరం వచ్చింది పెళ్ళికొడుకు తల్లి తండ్రీ మేనమామా వస్తారట కాని అతడు రావటం లేదట అంటే అందులో కుంభకోణ మేమిటో ఆలోచించావా ? ఈ రోజుల్లో స్వయంగా చూడకుండా పెళ్ళి చేసుకొనే వాళ్ళెక్కడైనా వున్నారంటావా ?"

"పోనీ, రాకపోతే నేం ? మనం చూచాముగా, బాగానే వున్నాడు ?" అన్నాడు పద్మనాభం

తల్లిముఖం సంతోషంతో ఎంత ప్రకాశవంతమైందో చెప్పటం కష్టం. "పిల్లవాడు అంత బుద్ధిమంతుడన్న మాట ! తప్పకుండా చేసెయ్యాల్సిందే "

' ఊఁ చాల్లే, బుద్ధిమంతుడట, బుద్ధిమంతుడు !" విసుక్కున్నాడు శ్రీహరి "అసలు రహస్యం ఏమంటే పడికాయి కొంచెం కుంటిఅట ఆ రోజు మా ముందు ఒక్క పది నిముషాలు మాత్రం కన్పించాడు ఆ కుంటి కన్పించకుండా ఎలాగో జాగ్రత్తగా నడిచాడు కాబోలు ఇక్కడికి వస్తే రహస్యం బయటపడిపోతుందని రావటంలేదు "

' అలాగా ' నిర్ఘాంతపోయారు




పద్మనాభమూ, చిన్నకొడుకు మురళీని.

"పోనీ అవొక పెద్దలోపమా—అన్ని విషయాలూ నచ్చినప్పుడు?'' అంది కమల

"చాల్లే వూరుకో, ఏ మంత ఖర్మ వచ్చిపడిందని కుంటివాడికీ, గ్రుడ్డివాడికీ కట్టబెట్టడం? వద్దని వ్రాసేస్తాను,'' అంటూ లేచి వెళ్ళిపోయాడు తండ్రి. వింటూన్న కళ్యాణికి కోపం రాలేదు. 'పాపం అందంగా వున్నా, కుంటివాడనే బాధ పోనీ గుణం మంచిదైతే రూపానికే మొచ్చె?' అనుకొని లోలోన జాలి పడింది కాని ఆ భావాలను పైకి వెల్లడించే ధైర్యమూ లేదు, అలవాటూ లేదు

"పోనీ వచ్చివెళ్ళారు మనకేం నష్టం? ఇప్పుడు చెయ్యం అని చెప్దాం. వొత్తిగా రావద్దని నిష్ఠురంగా చెప్పెయ్యడమేం మర్యాద?'' అన్నాడు మురళి.

"వచ్చి వెళ్ళారు; పిల్ల నచ్చలేదనే మాట వుండిపోవటానికా? వాళ్ళలోపం చెప్పుకోరు. మనమీద ఏదో వాదును వేస్తారు అసలనవసరం అతడిక్కడికి రావటం లేదన్నవాడు ఆ మాటమీదే నిలబడితే సంతోషించేవాడిని. తనలో లోపం వుండి, పిల్లమాత్రం గొప్పగా వుండాలని ఆశ ఈ వూరొచ్చి వాళ్ళనీ వీళ్ళనీ అడిగి ఎటువంటివాళ్లో ఆరా తీశాడట ఇంటి చుట్టూ, కాలేజి చుట్టూ ప్రదక్షిణ చేసి వెళ్లాడట, అమ్మాయిని చూడటానికి కన్పించిందట, నచ్చిందట. అందుకే ఈ ఉత్తరం వచ్చింది పిల్లను చూడాలని తన కున్నంత పట్టింపూ, దాని కూడా తన విషయంలో వుంటుందని ఎందుకనుకోడు? మిగతావిషయా లన్నీ ఎలా వున్నా, సూటిమార్గాలు వదిలేసి అడ్డుత్రోవలు త్రొక్కేవాళ్ళంటే నా

కి సహ్యం అటువంటి ప్రవర్తనలలోనే మనుష్యుల స్వభావాలు బయటపడేది." అన్నాడు ముగించుకుంటూ శ్రీహరి.

"ఇదంతా విన్నాక నాకూ బాగుండ లేదు ఏమైనా అల్లరిరకమేమో అన్పిస్తోంది; వద్దులే," అంది కమల.

అంతా విన్న కళ్యాణి ఆశ్చర్యపోయింది అంతవరకు అటువంటి ఆలోచనలే చెయ్యని ఆమె మొదటిసారిగా 'వివాహమంటే ఏమిటి?' అని ఆలోచించసాగింది

పైకి అన్నదేకాని కమల ఆ సంబంధాన్ని చూస్తూ చూస్తూ వదలలేక భర్తకూ కొడుకులకూ తెలియకుండా చాటుగా ఆరా తీయించింది. చాటుగా జరిగిన దర్యాప్తులో తేలిన విషయాలనుకూడా చాటుగానే వుంచి, కిమ్మనకుండా వూరుకోవలసి వచ్చింది. వారు చెప్పుకున్నంత ఆస్తిపరులు కాదు కొడుకులు యిద్దరే కాదు, యింకా పిల్లలున్నారు పెండ్లి కుమారుడు చదువుతున్న సి ఎ. కోర్సు ఈ జన్మలో పాసవగల ఆశలేదు కట్నం ఎక్కువ రాబట్టటానికి పెండ్లి అయ్యేవరకూ అదొక నాటకం. వివాహమయ్యాక ఆ వున్న బి కాం. డిగ్రీతోనే ఏదో చిన్న వుద్యోగం చేస్తాడు, లేదా అరక చేతబట్టాడు

నవ్వుకుంది కళ్యాణి. 'ఇన్ని మోసాలతో ఎందుకో ఆ పెళ్ళిళ్లు!' అంతే రెండురోజుల్లో అంతా మర్చిపోయి చదువు. స్నేహితులలో పడిపోయింది తర్వాత యేవో రెండుమూడు సంబంధాలొచ్చినా, అంత చెప్పుకోదగినవీ. గుర్తుంచుకోదగినవీ కాదు ఈలోగా బి ఎస్‌సీ పూర్తై చదువు మానేసింది కళ్యాణి. కొంత వయస్సూ, చదువూ రావటంవల్లా, చదువూ వ్యాపకం లేక తీరికగా వుండటం వల్లా ప్రతివిషయాన్నీ పరిశీలనగా చూడడం, తెలివిగా తర్కించుకుని ఒక నిర్ణయానికి రావడం అలవాటయ్యాయి కళ్యాణికి ఆ సమయంలోనే ఒక పెళ్ళిసంబంధం వచ్చింది. ఈసారి ఇదివరకులాగా తన కేమీ పట్టనట్లు ప్రవర్తించి, తలిదండ్రుల నిర్ణయానికి వదిలెయ్యలేకపోయింది కళ్యాణి తనకు తెలియకుండానే తనలో భవిష్యత్ జీవితంపై కొన్ని కొన్ని అభిప్రాయాలూ నిర్ణయాలూ ఏర్పడటం తెల్సుకొని తనే ఆశ్చర్యపోయింది గతంలో జరిగిన పెళ్ళిచూపులవీ గుర్తుకువచ్చి కొంచం తనలో తనే చీకాకుపడింది

ఒకనాడు తండ్రి పద్మనాభయ్యగారు పెండ్లికుమారుడి ఫోటో యిచ్చాడు కళ్యాణికి. మౌనంగా అందుకుని తండ్రి వెళ్ళిపోయాక తీసి చూసింది

'గొప్ప అందగాడు!' అన్న తండ్రి మాటలు అబద్ధంకాదు "ఎక్కడో ఏదో ఉద్యోగమట, బుద్ధిమంతుడట. మంచిదే. అయినా అసలువిషయం తెలిసే వరకూ వాళ్ళు చెప్పినదే నిజమని నమ్మ




లిగా?" అంది కళ్యాణి తల్లితో

"చాల్లే అందరూ ఒక్కలాగే వుంటారా? ఆ ముఖంలోనే వుంది అతడి మంచితనమంతా!" అంది కమల మందలింపుగా

"ఓహో, ఫోటోలో మనిషి రూపంతో బాటు స్వభావంకూడ ముద్రపడి పోతుందని యివ్వాళ క్రొత్తగా వింటున్నాను," అంది కళ్యాణి హేళనగా

'ఫోటోలో మనుషుల గుణాలూ, రాసుకున్న సెంట్లూ అత్తర్లూ పడవ్ అత్తయ్యా.'' అంది నవ్వుతూ మురళి భార్య ఇందిర, కళ్యాణికి సపోర్టుగా.

"నోరుమూసుకుని అవతలికి పొండి, పెంకెగుణాలూ, పెంకెమాటలూను," అని కమల కసురు కోవడంతో వదినా మరదళ్ళిద్దరూ గప్‌చిప్‌గా బయటకు జారుకున్నారు

"అంత అందగాడూ విద్యావంతుడూ ఉద్యోగస్థుడూ యింతకాలం వూరికే వుండిపోయాడంటావా వదినా, వయస్సు కూడా తక్కువేమీకాదు. ఎక్కడో చిత్తూరు జిల్లావాడు, ఏలోపమూ లేనిదే యింతవరకు రావడం అనుమానాస్పదమే,'' అంది తర్వాత కళ్యాణి రహస్యంగా ఇందిరతో

"ముందుగా వాళ్ళంత వాళ్ళే కబురంపడం, మధ్యవర్తులద్వారా ప్రయత్నించడం చూస్తే నాకూ అనుమానంగానే వుంది కళ్యాణీ అవన్నీ ఆడపిల్ల తండ్రి చేసే ప్రయత్నాలు మరి. అయినా ఎవరో కొందరు మోసగాళ్ళను చూచి అందర్నీ అనుమానించకూడదు. మంచివాళ్ళే నేమో? ఎలాగో నీగురించి తెల్సి, బింకం దేనికని, సూటిగా కబురంపారేమో?"

"అంతే కావచ్చు. ఇంత కాలం తగిన పిల్ల దొరకక అన్వేషిస్తున్నా

దేమో ' ఊరికే అనుమానపడకు.'' అన్నాడు వెనుకనుంచి అంతా విన్న మురళి అంతతో సంభాషణ ఆగిపోయింది.

ఒకనాడు ఆ ఎదురు చూస్తూన్న పెళ్ళివారు రానే వచ్చారు

"పెళ్ళికొడుకు అన్నా, వదినా మాత్రమే వచ్చారు; అతడు రాలేదు కళ్యాణీ.'' అంది ఇందిర కళ్యాణి గదిలోకి వచ్చి.

శ్రద్ధగా డ్రెస్ చేసుకుంటూన్న కళ్యాణి కొంచెం కలవరపడింది. ఓ పావుగంట పోయాక తల్లితోబాటు, అందరూ కూర్చున్న హాల్లో అడుగెట్టి, పెళ్ళి పెద్దన్నయ్య ప్రక్కన కూర్చుంది సోఫాలో ఎందుకో అకారణంగాగుండెలు టకటకా కొట్టుకో నారంభించాయి. "ఏం ప్రశ్న లడుగుతారో యేమో? వాళ్ళు భార్యాభర్త లిద్దరూ గ్రాడ్యుయేట్సట ఇద్దరూ ఉద్యోగం చేస్తున్నారట. మంచి స్టయిలిష్‌గా వున్నారు. ఆవిడ టకటకా యింగ్లీషులో మాట్లాడేస్తోంది నాన్నగారి తోనూ, అన్నయ్యలతోనూ బాబోయ్, నాన్నగా రెదుట నోరే ఎత్తలేని నేను, అన్నయ్యలతోకూడా భయపడ్తూ మాట్లాడే నేను యిహ వాళ్ళముందసలు నోరెత్తగలనా'' అనుకొంటూన్న కళ్యాణికి శరీరమంతా చెమటపట్టేసింది అలా నేల చూపులు చూస్తూన్నదల్లా "ఉద్యోగం ఏమీ చెయ్యటం లేదా? ఫ్రాకేనే వున్నావామ్మా?" అన్న ప్రశ్న విని ఒక్కసారి అదిరిపడింది తలెత్తబోయింది కాని, అతల సేమొచ్చి పడిందో మరి ఎంత ప్రయత్నించినా పైకి లేవలేదు. సమయానికే ఈ కంఠస్వరం కూడా ఎక్కడికి పారిపోయిందో, ఎక్కడా అయిపులేదు

'ఉద్యోగం అవసర మేముందండీ? ఏదో సర్దాగా చదివించాం. ముందు ముందు ఖర్త చెయ్యా లనుకుంటే చేస్తుంది,'' కూతురి తరఫున పద్మనాభం చెప్పాడు.

'నీ పే రేమిటమ్మా, ఏం చదువు కున్నావమ్మా?' అని పాత ధోరణికాక 'ఉద్యోగం చేస్తున్నదా, ఫ్రా ళ్ళే ం గలదా?' అనే కొత్త ధోరణిలో ప్రారంభమయ్యాయి ప్రశ్నలు' 'పోనీ, తెలుగులోనే ప్రారంభించింది కొంతలో కొంత మేలు.' అని లోలోన తృప్తి పడింది కళ్యాణి.

"అమ్మాయికి వంటంతా వచ్చు నాండీ?'' ప్రతి చదువుకున్న పడుచు యొక్క తల్లీ ఎదుర్కోవలసిన సామాన్య గడ్డు ప్రశ్న!

"సందేహమా? ఇవ్వాళ మీరు రుచి చూడబోతున్న వంటకాలన్నిటిలో అమ్మాయి చెయ్యివుంది కావలిస్తే అడగండి, చెప్తుంది,' నవ్వుతూ సమాధాన మిచ్చింది కమల.

"అబ్బే, అవసరం లేదండి, ఊరి




కేసే అడిగాను," అంది ఆవిడ.

కళ్యాణికి మాత్రం లోలోపల చిరాకు కల్గింది. ఛ, దాని కల్చరంతా ఎక్కడ తగులడింది? చదువుకుంటే మాత్రం, సంసారి కుటుంబాలలో పిల్లలకు పనీ పాటా నేర్పుకోరా?' అన్నయ్యలూ వదినలూ వాళ్ళకు చేస్తున్న అతిమర్యాదలు మరీ జుగుప్సాకరంగా కన్పించాయి. 'ఎంత పెళ్ళివారైతే మాత్రం మరీ అంత అడుగులకు మడుగులొత్తాలా? అయినా అదికూడా నాలా ఒకప్పుడిలా పెళ్ళిచూపుల బాధ అనుభవించే వుండుంటుంది. ఈ మాత్రందాని కింత భయం దేనికి?' కళ్యాణి మనస్సులో కలిగిన ఈ విసుగుదల, చికాకుల ఆలోచనలో సిగ్గు మాయమైపోయి ఛాతికంటుకు పోయినతల లేచియథాస్థానం పొందింది.

"సంగీతం వచ్చాండీ అమ్మాయికి?" మరో ప్రశ్న.

శ్రీహరి కలుగజేసుకున్నాడు. "అలా కూర్చున్నావేమిటి కళ్యాణీ? ఏవో అడుగుతున్నారు, సమాధానం చెప్పు."

ఆ అన్నయ్య గదమాయింపుకి భయపడినట్లుంది 'వచ్చునండీ,' అంది మెల్లగా కళ్యాణి. 'హమ్మయ్య, బాగానే వున్నాను కంఠం ఏమీ అయిపోలేదు' అనుకొని తృప్తిపడింది కళ్యాణి, కంఠం సవరించుకుంటూ.

"వోకలా, ఇన్‌స్ట్రుమెంటలా?"

"వీణ వాయిస్తానండీ," అంత ధైర్యంగా చెప్పగలుగుతున్నందుకు తనలో తనే మురిసిపోయింది.

"వాయించు వింటాం."

'తప్పుతుందా, అమ్మ! భగవంతుడెందుకేర్పాటు చేశాడో ఈ పెళ్ళిచూపులు? మెల్లగా లేచి వీణదగ్గర కూర్చుంది. రోజూ నిముషంలో కుదిరి వచ్చే శ్రుతి పదినిముషాలకు కూడా సరిగా

కుదరలేదు. ఎలాగో శ్రుతి చేసుకుని వాయించబోయేసరికి వ్రేళ్ళు తేలిపోవడము మొదలెట్టాయి నాదం బాగా రానేలేదు. తాళం తడబడిపోయింది ఏ వారం రోజుల క్రితమో భోజనం చేసినట్టు, శరీరమంతా నీరసపడిపోయింది తన వాయిద్యం అసలే సచ్చలేదు మహా విద్వాంసురాలు కాకపోయినా, శ్రవణానందకరంగా వాయించగల నేర్పువుంది, మరి ఈ రోజు ఆ నేర్పు ఎక్కడికి ఎగిరి పోయిందో!

"చాలా బాగుందమ్మా. వింటూంటే నిద్ర వస్తోంది నాకు," అంది సదరు పెండ్లికుమారుడి వదినగారు; ఆమెపేరు 'సుగుణ' అట

చివుక్కుమంది కళ్యాణికి; ఎంత అవహేళన!

"లైట్‌మ్యూజిక్ వచ్చా?"

ఈసారి తెగించింది. "రాందండీ," కావాలనే అబద్ధమాడింది

"మా మఱిదికి హిందీపాట లంటే ఇష్టంలెండి అందు కడిగాను"

"హిందీ అసలు రాదండీనాకు." మరో అబద్ధం.

"మరీ అంత సింపుల్‌గా వున్నావేమిటి? మా మఱిదికి 'ఫాషన్'గా వుండి ధైర్యంగా మాట్లాడే పిల్లలంటే ఇష్టం"

విస్తుబోయి చూచింది కళ్యాణి

"నా దగ్గఱ మా మఱిదికి చాలా చనవులే నాకు తన విషయాలూ, అభిప్రాయాలూ అన్నీ చెప్తాడు అతడు గెజిటెడ్ ఆఫీసర్ ఉద్యోగం చేస్తున్నది దుర్గాపూర్. అటువంటి ఇంటర్నేషనల్ సిటీలో నిత్యం రకరకాల ప్రజలతో ఆఫీసర్లతో చెయ్యిచెయ్యిరాసుకు తిరగవల్సుంటుంది? ఇలాటి పాతపద్ధతులు పనికిరావు చాల 'మోడరన్'గా వుండాలి, 'సోషల్'గా తిరగాలి"

ఒక్కసారి జల్లుమంది కల్యాణి గుండె వేషంలోనూ, నాలుగువీధులు చుట్టబెట్టి రావడంలోనే వుందన్నమాట, ఫాషనంటే మరి ఈ శల్యపరీక్షలూ, పిచ్చి ప్రశ్నలూ, సంగీతం దగ్గరనుంచీ పాడి విన్పించమనడమూ పాత పద్ధతులని తెలియలేదు కాబోలు ఈ వన్నెల విసనకఱ్ఱకు!"

భోజనాలకు లేవారు ఇక భోజనం చేస్తున్నంతసేపూ ఆ సుగుణ అవిరామంగా మాట్లాడ్తూనేవుంది. ఎవరి మట్టుకు వారికే చెవులు పాడైపోతాయన్నంత భయం వేసింది. ఆమెకూ భర్తకూ టేబులుకు ఒకప్రక్క వడ్డించారు మరోప్రక్క శ్రీహరీ, భార్యా, మూడవప్రక్క మురళీ, ఇందిరా, నాల్గవ వైపు పద్మనాభమూ, కమలా కూర్చోవడానికి ఏర్పాట్లు చేశారు. కల్యాణీ, మరొక దూరపుబంధువూ వడ్డన చూస్తున్నారు "భర్తప్రక్కన కూర్చోవడం 'ఎటికేట్' కాదండి. మరొకరి ప్రక్క




కూర్చోవడం మర్యాద." అంటూ చటుక్కున సుగుణ లేచి మురళి ప్రక్క కుర్చీలో కూర్చుంది. విస్తుపోయిన ప్రేక్షకు లందరూ తేరుకోవటానికి ఐదు నిమిషాలు పట్టింది. ఆ సందడిలో కల్యాణి ప్రక్కగదిలోకి జారుకుంది. కల్యాణిబదులు ఇందిర వడ్డన కుపక్రమించింది పాపం వేణుగోపాల్ ప్రక్క కుర్చీ ఖాళీగానే వుండిపోయింది!

"అయితే అబ్బాయిపేరు రాధాకృష్ణాండీ? ఆయనకూడా వస్తే యింకా సరదాగా వుండును మీ కలుపుగోలుతనం నాకు చాలా నచ్చింది," అంటూ పద్మనాభయ్య అసలు విషయాలలోకి దిగాడు భోజనం కానిస్తూ మనుషులు దబదబా మాట్లాడే తీపిమాట లన్నిటిలోనూ తేనె వుందని భ్రమిస్తాడాయన, లౌక్యం అంతగా తెలియదు.

"అక్కరలేదండీ, నాకు నచ్చితే అతడికి నచ్చినట్టే," అంది సుగుణ

"ఓహో, సంతోషం మీకతడంత గౌరవ మిచ్చాడంటే పరాయి యింటి నుంచి వచ్చినా, అత్తవారింటిలో అంత బాగా కలిసిపోయారన్నమాట, సందేహం లేదు; మా అమ్మాయికూడ మీలో కలిసిపోతుంది. ఇంతకూ తమకు అమ్మాయి నచ్చినట్లేనా?"

"ఆ! ఏదో కొంచెం ఒక చాయ తక్కువైనా, సన్నంగా వున్నా ఫర్వాలేదులెండి. పిల్ల అందంగానే వుంది. మీ సంబంధం వచ్చిన దగ్గర్నుంచీ అక్కడ మాకు పోటీలు మరీ ఎక్కువై పోయాయండీ. సమాధానం చెప్పలేకుండా వున్నాము. నలభై యిస్తామని ఒకరూ, యాభై యిస్తామని ఒకరూ, సరే, మీ అమ్మాయి చదువుకున్నదీ. మంచి సాంప్రదాయం అని యిక్కడికి వొచ్చాము."

ప్రక్కగదిలోనుంచి వింటూన్న ఆమెకు హఠాత్తుగా అతడి కంఠం విన్పించింది.

"ఇంతకూ మీ రెంత యిస్తారో చెప్పారుకాదు"

"చెప్పడాని కేముందీ. ఓ యిరవై కంటె ఎక్కువిచ్చుకోలేము కాని అమ్మాయి చదువూ, రూపమూ, గుణమూ, కుటుంబ సాంప్రదాయమూ ఆలోచించాలి మీరు," అన్నాడు పద్మనాభం

"అవన్నీ సరే అనుకోండి కాని ఈ రోజుల్లో డబ్బు ప్రధానం కదా మాకు అక్కడే యాభై యిస్తామంటే మీరు మరీ అందులో సగం చెప్తారేమిటి? అంతకంటె ఎక్కువ చెప్పాలికాని" అంది సుగుణ.

"మీ రలాగంటే ఎలా? ఎలాగో మీరు పని కానివ్వాలి ఇంకొక్క అయిదు వేసుకోండి పోనీ. అంతకంటె యిచ్చుకోలేను"

"మరి మీ రలాగంటే మా వాడికి చెప్పి చూడాలి, ఏమంటాడో మరి?"

"చెప్పవలసిన బాధ్యత మీది మరి." అంది కమల కలుపుగోలుతనంగా "మీరూ మరోయింటినుంచి ఆ యింటికి వెళ్ళినవాళ్ళే కదా, మనం మనం ఒకటి"

"అయ్యో కాదండీ మరి? ఆ మాట కొస్తే నా కసలు కానీ కట్నం పుచ్చుకోలేదు. 'నీ అందం చూచి అన్నయ్యే పూరికే వరించాడు. నీలాటిపిల్లే వుంటే నేనూ అలాగే చేద్దునేమో!' అంటుంటాడు మరిది నవ్వుతూ. కాని అందరూ ఒకలాగే వుంటారాండి మరి? మావారు నా అదృష్టంకొద్దీ పూరికే చేసుకున్నారు మరి మా అబ్బాయి పెద్ద ఆశలమీదున్నాడు ఈ కట్నంతో ఒక మేడ కట్టుకోవాలనీ, ఒక ఎయిర్ కండిషన్‌గది ఏర్పాటు చేసుకొని, కారు కొనుక్కోవాలనీ ఒక రకాల కోరికలు పెట్టుకున్నాడు మీరిచ్చేదాంట్లో అల్లుడికోరిక ఒకటైనా తీరవద్దూ?"

"మరి మీ రలాగంటే చెప్పలేం," అన్నాడు పద్మనాభం

భోజనాల దగ్గర్నుంచి లేచారు కాస్సేపు పోయాక తిరుగు ప్రయాణమయ్యారు సుగుణా, వేణుగోపాల్‌లు

"నచ్చజెప్పి చూస్తాను మా తమ్ముడికి అయినా అతడు నా తమ్ముడు కాని, కుమారుడు కాదు చూడండి అతడికి యింకా ఎక్కువిచ్చేవా ళ్ళుంటే పోగొట్టుకొని మీ సంబంధం చేసుకుంటాడని అనుకోను." అన్నాడు వేణుగోపాల్ వెళ్తూవెళ్తూ

సుగుణకు మంచి పండుపూపాయల చీరా, జాకెట్టుగుడ్డా సిద్ధం చేస్తోన్న తల్లి దగ్గరకు వెళ్ళింది కళ్యాణి "ఇంకా ఏమీ కుదరనిదే అంత ఖరీదైన చీర అలా పెట్టడ మెందుకమ్మా?" అనడిగింది మెల్లగా




"కుదిరినా కుదరకపోయినా అది ఆ వారమష్టా," అంది కమల నవ్వుతూ

"వద్దు, ఇలా ఎంద రొస్తే ఎన్ని పెట్టి పంపిస్తాప్, అయితే అవుతుంది, లేకుంటే లేదు మరీ యింత ఖర్చా? అయినా అవుతుందని నాకు నమ్మకం లేదు, నా కేమిటో వెగటుగా వుంది వాళ్ళను చూస్తోంటే"

"నోరు మూసుకుని నీ గదిలోకి వెళ్ళు, నా కాడ్డే సలహాలు చెప్పక అయినా నీ కసలు ఏదీ కుదరడం యిష్టం లేదు ఇలాగే వుండిపోవాలనా ఏమిటి? అతడా మన్మధుడు: ఉద్యోగస్థుడు. పెద్దలు చూస్తే తను చూడక్కర్లే దన్నాడట ఎంత బుద్ధిమంతుడు!"

గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయింది కళ్యాణి. ఆ స్తోత్రం వినలేక. వెనక మరో బుద్ధిమంతుడు కూడా యిలాగే సెలవిచ్చినట్టు ఆమె అప్పుడే మర్చిపోయినట్లుంది!

స్టేషన్నుంచి తిరిగివచ్చిన అన్నయ్య మురళిగదిలోకి వెళ్ళింది కళ్యాణి సుడిగాలిలా. "అయ్యిందా వెళ్ళేవరకూ కాళ్ళు ఒత్తడం! ఇహనైనా నా మాటేమైనా కాస్త విన్పించుకొనే తీరిక చిక్కిందా?" అనడిగింది కోపంగా.

"మర్యాదలు చెయ్యకపోతే ఎలాగే మరి? ఏమంటావింతకూ నువ్వు?"

"నాకు వాళ్ళొద్దూ అని ఖచ్చితంగా అంటాను అయ్యిందేదో అయ్యింది కాని ఇహ వాళ్ళసంగతి ఎత్తకండి"

అదేమిటి?" అప్పుడే అక్కడికొచ్చిన పద్మనాభం, శ్రీహరీ, కమలా, అందరూ ఆశ్చర్యపోయారు

"ఆ ఠీవీ, దర్పం, ఆ అందం - అతగాడు మీ అల్లుడైతేనే చాలు మీకు." అంది ఆవిడ, సుగుణ వెళ్తూవెళ్తూకూడా. నీ కేమిటి యిలా పాడుబుద్ధి పుట్టింది ?" అంది కమల కూతురిపై చికాకు తెచ్చుకుంటూ.

"సుగుణకాదు, దుర్గుణ అను సరిపోతుంది. చూడగానే తెల్సిపోయింది నా కావిడ తత్వమెలాటిదో. ఆవిడ చెప్పినంత 'ఫార్వర్డ్' గా నే నుండనూలేను. మరీ అంతగా వదిన నేత్రాలనే చూస్తూ వదిన మెదడుతోనే ఆలోచించే అప్రయోజకుడు నా కక్కరనూ లేదు."

కూతుర్ని పరీక్షగా చూచాడు పద్మనాభం. "వాళ్ళ ప్రశ్నలూ వాటితో విసుగెత్తినట్టున్నావ్. తర్వాత మాట్లాడుకుందాంలే. దాన్ని కాస్సేపు ఒంటరిగా వదిలెయ్యండి," అంటూ అందర్నీ క్రిందకు తీసుకుపోయాడు పద్మనాభం.

రాత్రి భోజనాలదగ్గర "ఏం నిర్ణయించుకున్నావమ్మాయ్ ?" అనడిగాడు శ్రీహరి చెల్లెల్ని.

"నా నిర్ణయ మెప్పుడూ ఒక్కటే అన్నయ్యా."

"ఏమిటసలు నీ అభ్యంతరం ?" సూటిగా అడిగాడు పద్మనాభం.

"అన్నీ అభ్యంతరాలే. అతడికి తల్లీ, అక్కచెల్లెళ్ళు వుండగా ఒక్క అన్నా వదినలే రావడమేమిటి చూచుకోవటానికి ? అసలు ప్రాముఖ్యత తల్లిది కదా ! అతడు పెద్దవాడు; ఉద్యోగం చేస్తున్నవాడు. ఒక వ్యక్తిత్వమంటూ ఏర్పడ్డవాడు, పూర్తిగా బాధ్యత వదినకొదిలేసి కళ్ళు మూసు కూర్చోవడమేమిటి, అసహ్యంగా ? పైగా పాతిక, యాభై అంటూ ఆ బేరాసారా లేమిటి, గొడ్ల బేరాలకుమల్లే ?"

"ఒక్కో కుటుంబం పద్ధతి ఒక్కోలాగుంటుంది. అయినా అవన్నీ పెద్దవాళ్ళాలోచించవలసిన విషయాలు నువ్వు కాదు," అన్నాడు శ్రీహరి తీక్ష్ణంగా.

"ఒప్పుకో నన్నయ్యా. నేను వెళ్ళబోయే కుటుంబంవిషయం నేనుకూడా ఆలోచించడం అవసరం. వున్నంతసేపూ ఆవిడ మాటలూ, ప్రవర్తనా అన్నిటిలోనూ నాకు అసభ్యతే కన్పించింది. ఆలోచించిచూస్తే మీకూ అసహ్యంగానే కన్పిస్తుంది."

"ఆడవాళ్ళు అసూయాపరులు !" అని నవ్వాడు మురళి.

"అంత సూక్ష్మగ్రాహిణులుకూడా!" ఖంగుమంది కళ్యాణికంఠం. "ఇంటి కోడలి కుండవలసిన చనవూ, అధికారాలకూ, వెకిలితనానికీ భేదం తెలియని దాన్ని కాను నేను. ఆవిడ 'ఎటికేట్'లు పాటించవలసింది, టీపార్టీ - డిన్నర్ పార్టీలలోకాని యిటువంటి సభ్యకుటుంబాలలోకాదు. మరదియొక్క ప్రత్యేకతలు వదిన చెప్పవలసినతీరు అదికాదు," అంటూనే అక్కడినుంచి లేచి వెళ్ళిపోయింది.




"నా ఖర్మ, ఇలాంటి పెంకెఘటం నా కూతురవ్వడం," అని కమల నుదురు కొట్టుకొంది. "ఇంతకూ ఈవిడ పెళ్ళి చేసుకోబోయేది ఆవిడనా, ఆవిడ మరదినా?" అనికూడా అంది.

"ఊరుకో కమలా. అమ్మాయి మాటలలో అర్థం లేకపోలేదు," అని పద్మనాభం గంభీరంగా అనడం వెళ్ళిపోతున్న కళ్యాణి వినకపోలేదు.

ఆ తర్వాత కమల నాల్గురోజులు మాట్లాడలేదు కూతురితో. ఒకనాడు కళ్యాణి భోజనానికి డైనింగ్ హాల్లోకి వెళ్తూండగా వంటగదిలోనుంచి మెల్లగా మాటలు విన్పించాయి.

"మనమ్మాయి చాలా అదృష్టవంతురాలమ్మా," అది మురళికంఠం

"ఏమిటి?" కమల అడగుతోంది

"దుర్గాపూర్‌నుంచి నా స్నేహితుడొకడు వ్రాశాడు — అతడొకసారి రిజిష్టర్‌మారేజ్ చేసుకుని ఎవరోపిల్లని వదిలేశాడట. అసలుకూడా పేరుకు తగ్గట్టు సాక్షాత్తూ రాధాకృష్ణుడేనట అతడి అన్నా వదినాకూడ తక్కువ వాళ్ళేం కాదట అసలు మనం ఏవిధంగానూకూడ ఆలోచించకూడని మనుష్యులట ఇంకా చాలా వ్రాశాడనుకో, నీతో చెప్పకూడదు చిన్నదైనా కళ్యాణి చాలా తెలివైనదే..."

ఏమీ విననట్టు చటుక్కున వంటగదిలో కెళ్ళింది కళ్యాణి సంభాషణ ఆగిపోయింది

"ఏం? ముహూర్తం పెట్టించమని ఏ దుర్గుణ లెటరు వ్రాసిందేమిటి?" అంది హాస్యంగా మురళి నవ్వి పూరు

కున్నాడు. తల్లి ముఖం త్రిప్పుకుంది అప్పటినుంచీ పోష్టులో ఏ ఉత్తర మొచ్చినా 'మీ దుర్గుణ వ్రాసిందేమో!' అని పుడికించటం పరిపాటైంది కళ్యాణికి.

అడుగడుగునా యిటువంటి మోసా లెదురవ్వడంతో బెదిరిపోయి అసలు కూతురి పెళ్ళివిషయం ఎత్తడం మానే శాడు పద్మనాభం సునాయసంగా ఒక ఏడాది గడచిపోయింది కమలకు మాత్రం నిద్ర పట్టడంలేదు రోజుకు పదిసార్లైనా కూతురి కింకా పెళ్ళి కాలే దనే బెంగ వ్యక్తపరుచ్తుంటూంది. ఇక భర్తా, కొడుకులూ కళ్యాణిపెళ్ళి చెయ్య టని నిశ్చయించుకుందో యేమో, తన అన్నగారికి కబురుపంపింది నెల్లాళ్ళ క్రితం ఓనాడాయన ఒకబ్బాయిని వెంట బెట్టుకొచ్చాడు బి ఎల్. పాసై ప్రాక్టీసు చేస్తున్నాడట, హైదరాబాద్‌లో కొం చెం యిటువంటి పరీక్షలలో రెండు మూడుసార్లు అనుభవం సంపాదించడం వల్ల కళ్యాణికూడా నదురూ బెదురూ లేకుండా కూర్చుంది.

చిరునవ్వుతో ఒక స్నేహితురాలితో మాట్లాడుతున్నట్టు చదువూ, హాబీలూ అన్నీ చాలా సరసంగా అడిగా డతడు కళ్యాణికూడ సరదాగానే సమాధానాలు చెప్పింది 'ఫర్వాలేదు. మంచివాడే.' అనే సదభిప్రాయం ఏర్పడుతూ వుం టూండగానే అయిష్టమైన పని జరిగి పోయి, సద్భావమంతా చెదిరిపోయింది

"చూడండీ, మా స్నేహితు డొకడికి వివాహమైంది. సెవెంత్ ఫారం పాసైం దని చెప్పి పెళ్ళి చేశారు ఆమెకు ఏ బీ సీ డీలు' కూడా రావు. అంచేత మీ చదువును నేను పరీక్ష చేసుకోవాలి," అన్నాడు

ఒక్క కళ్యాణికే కాదు, ఆ మాటలు విన్న అందరి ముఖాలూ అప్రసన్న మయ్యాయి అందరికంటెముందు కళ్యాణే ఆ షాక్‌నుంచి తేరుకుంది.

"యస్ యూ కెన్ ఎగ్జామిన్ మై ఇంగ్లీష్ నాలెడ్జి (అలాగే, ఇంగ్లీషులో మీరు నా తెలివిని పరీక్షించుకోవచ్చు)" అంటూనే టేబిల్‌మీది ఇంగ్లీషు పేపరు తీసి చకచకా చదివేసింది "అర్థంకూడా చెప్తుంటూరా?' అంటూ చెప్పేసింది. పెన్ను తీసి పేపరుమీద ఇంగ్లీషులో అతడిపేరు రాసింది.

"ఇదిగో మీ పేరు వ్రాసూ ఇంగ్లీ షులో వ్రాసేశాను ఇంకా ఏం వ్రాయ మంటారో చెప్పండి"

అతడు చకితుడై గ్రుడ్లప్పగించి చూడడం తప్ప ఏమీ మాట్లాడలేక పోయాడు. అతడే కాదు. అందరి పరి స్థితీ అలాగే వుంది

'ఏమండీ, నా చదువుమీద నమ్మకం కలిగిందా? నేను నచ్చానా మీకు" చిలిపిగా అడిగింది కళ్యాణి

అతడు బిత్తరపోయాడు.




“నా డిగ్రీ తీసుకొచ్చి చూపించమంటారా పోనీ ?”

“నోనో, వద్దండీ” అతడు ఖంగారుగా అన్నాడు. “మీరు మరీ ‘అఫెండ్’ అయ్యా రనుకుంటాను?” అన్నాడు కళ్యాణిని పరీక్షగా చూస్తూ.

“లేదండీ. దాని కేముందీ ? అనుమానాలు తీర్చేసుకోవడం మంచిదేగా ? అయితే మీకు నేను నచ్చానా ?”

“ఇంకా అనుమానమా ?” సిగ్గు మిళితమైన చిరునవ్వుతో అన్నాడు

“ఆల్‌రైట్, మరి నేను మిమ్మల్ని పరీక్షించుకోవద్దూ ?” అంది సీరియస్‌గా.

అతడు బిక్కముఖం వేశాడు.

“మీ డిగ్రీ తీసుకొచ్చారా మరి మీతో? చూడందే నాకు నమ్మకమెట్లా?”

అతడి నేత్రాలు విపరీతంగా చలించాయి.

“పోనీండి, ఏదీ, ఇంగ్లీషులో ఓ పది నిముషా లేమైనా మాట్లాడండి మీ ఇంగ్లీషూ, తెలివీ అందులో తెల్సుకుంటాను.”

“అదేమిటి ? నన్ను మీరు పరీక్షించటమా ?” ఎలాగో ధైర్యం చేసి అడుగగలిగాడు.

“ఏం, నన్ను మీరు పరీక్ష చేసుకున్నట్లే. వింత ఏముంది ?” అమాయకంగా అడిగింది

“మగవాళ్ళు పరీక్ష చేసుకోవడం క్రొత్తకాదు.” అన్నాడు సగం ఏడుస్తూనే

“అదేమో నాకు తెలియదుగాని, డబ్బిచ్చి కొనుక్కొనే వస్తువును మంచి చెడ్డలు తెలియకుండానే కొనేసుకుంటారా ?”

“ఆ !” అంతకంటె మాట్లాడలేకపోయాడు.

"సరే. మీరు నాకు నచ్చలేదు వెళ్ళిరండి నమస్తే," అంటూ లేచి లోపలికొచ్చేసింది వచ్చేనవ్వు నాపుకొంటూ.

"ఇక ఈ పెంకెదాని కీ జన్మలో పెళ్ళికా" దని నిశ్చయించుకుంది కమల

"బాగా నే బుద్ధి చెప్పింది రెడ్డూ అంచేతే మే మెవరమూ కలుగజేసుకోలేదు," అన్నారు తండ్రీకొడుకులు ఆ తర్వాత వారంరోజులవరకూ సాధిస్తూనే వుంది కమల కూతుర్ని

"పోనీలేమ్మా ఇలాటి చెత్తరాయుళ్ళతో పెళ్ళవడంకంటె, కాకపోతేనే మంచిది మళ్ళీ యిటువంటి అవకాశం కలుగుతుందో లేదో అన్నట్టు రాజసం ఒలకబోస్తూ ఠీవిగా కూర్చోవటం, చెత్త ప్రశ్నలు వెయ్యడమూనూ — అసహ్యాం నాకు," అంది కల్యాణి

గతంలో జరిగిన ఈ పెళ్ళిచూపుల సంకలనమంతటినీ తెరలు తెరలుగా గుర్తుకు తెచ్చుకోవడంతో అలలు అలలుగా నవ్వువచ్చింది కల్యాణికి.

మళ్ళీ ఈ రాబోయేవా రెలావుంటారో! మళ్ళీ ఓచిన్న గాలిదుమారం రేగుతుంది కాబోలు! ఛ, ప్రేమించి పెళ్ళి చేసుకున్నవా ళ్ళెంత అదృష్టవంతులు? ఈ వెధవ తతంగమంతా వుండదు వాళ్ళకు

'ఏమిటమ్మోయ్? నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్? కాస్త మాకూ్కడా చెబుదూ" అంది. ప్రవేశంతో కల్యాణి ఆలోచనల కంతరాయం కల్గింది

"ఏంలేదు వదినా. సినిమాలో విషయమేదో గుర్తుకు వచ్చింది," అంటూ లేచింది

భోజనాల దగ్గర అసలు సంగతి మెల్లగా కూతురి చెవిన వేశాడు పద్మనాభం 'వెనక మేం గుంటూరులో వుండేటప్పుడు — అప్పుడు ఇంకా నువ్వు పుట్టలేదు — రఘురామయ్యగారని నాకో ముఖ్యస్నేహితు డుండేవాడు ఆయన కొడుకుపేరు శ్రీనివాస చక్రవర్తి — అప్పుడు ఏడేళ్ళవాడు, ముద్దొచ్చేవాడు ఇప్పుడు ఐ. ఎ ఎస్. అయి ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడట. ఇప్పుడు సెలవుపెట్టివచ్చి గుంటూర్లో తలిదండ్రుల దగ్గరే వుంటున్నాడట పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నాయి నీ కన్ని విధాలా తగినవా డని నే ననుకుంటున్నాను కల్యాణీ"

కళ్యాణి మౌనంగా వింటోంది

"ఏ పిల్లను చూచినా అత దేదో ఒక వంక పెడుతున్నాడని అన లతడిని చూచుకోవడానికి వెళ్ళొద్దని ఆంక్ష పెట్టాడట తండ్రి చూచుకోవలసిన అవసరం లేదు కూడాను ఇప్పుడు చూచుకోక పోయినా వుభయకుటుంబాలం ఒకరికొకరం వెనక బాగా తెల్సినవాళ్ళమే అంచేత ఇక ఈ పెళ్ళిచూపుల తతంగం పెట్టుకోదలచుకోలేదు. అది నీకూ్కడా అయిష్టంగానే వుందికదూ?"

ఆశ్చర్యాన్ని మించిన అనుభూతి

పొందింది కళ్యాణి తన చికాకును అడ్డుగా పెట్టుకొని ఆయనపనిని సమర్థించుకుంటున్నాడు తండ్రి!

"నిన్న మెడ్రాస్‌లో కన్పించాడు రఘురామయ్య అతడు చెప్పేవరకూ అతడికొడుకు సంగతి నాకు గుర్తే లేదు తెల్పినకటుందా ఆవ్వడంవల్ల మోసాలూ, విచారాలూ ఏమీవుండవు. అందుకే ఇద్దరం అక్కడే ఒక నిర్ణయాని కొచ్చాం. అన్ని విషయాలు మాట్లాడుకున్నాం. పైసాకట్నం తీసుకోనేందుకూ అంగీకరించలేదు కొడుకును విక్రయించుకోడట ఎంత ఉన్నతభావాలు! ...... ఈ పదిహేడవ తారీఖునే వివాహం ఈ క్షణంనుంచీ ఆ ప్రయత్నం మొదుంచే కాని పనులవ్వవు' కూతురి సమాధానాని కెదురు చూడకుండానే వెళ్ళి పోయ్యాడు

విస్మయ విస్ఫారిత నేత్రాలతో చూడడమేగాని ఏమీ మాట్లాడలేకపోయినది కళ్యాణి. ఆ మాటలలో అధికారమూలేదు, శాసనమూలేదు, తన స్థిర నిర్ణయాన్ని గంభీరంగా తెలియజేశారు. అంతే ఇంక దానికి తిరుగు లేదన్నమాట! తను ఆడింది ఆటగా సాగించే తండ్రిలో—తనను భుజాలపై మోసి పెంచిన అతడి లాలనలో—సంతానంపట్ల మృదుత్వం మాత్రమే ప్రదర్శించే అతడి ప్రేమలో ఇంత కఠినత్వంకూడా దాగివున్నదా? పెండ్లిచూపుల తతంగం విసుగ్గా వుందని కేవలం దానిని తోసిగించివేయడంకన్న మార్గంలేదా! నడుస్తున్న దారపై గోతులు కన్పిపిస్తున్నాయని, పూర్తిగా కళ్లుమూసుకు నడిస్తే ఆ గోతులలో పడిపోమూ?

తండ్రిగారి నిర్ణయం కళ్యాణికి ఏమాత్రమూ నచ్చలేదు ఆరాత్రి నిద్ర పట్టలేదు

ఉషఃకాంతిలో బద్ధకంగా నిద్ర మేల్కొంటోంది ప్రకృతి కాంత పక్షుల మేల్కొలుపులతో పూలబాలల స్వాగతాలతో మానవలోకం పైనందిన కార్యక్రమంలో అడుగు పెడుతోంది మందమందంగా వీస్తూన్న ఉదయ పవనాలు కుసుమ సౌరభాలనూ, ఆలయం లోని జేగంటల గణగణలనూ మోసుకొస్తున్నాయి

పొగడచెట్టు క్రింద పొందికగా కూర్చుని ప్రాంగణమంతా తిలకిస్తోంది కళ్యాణి తులసికోటదగ్గర పూజ చేస్తోంది కమల సుస్నాతయై పట్టువస్త్రాలు ధరించి పవిత్రంగా దేవతార్చన చేస్తూన్న తల్లి సాక్షాత్తూ లక్ష్మీదేవిలాగే కన్పట్టింది కళ్యాణికండ్లకు కమలకంటె ముందుగానే తులసికోట ప్రక్కనున్న శిరీషవృక్షం, తన కుసుమ సంతానాన్ని అతులసీపాదుకలపై రాల్చి తన భక్తి ప్రపత్తులను వెల్లడి చేసుకొంది. తెల్లని పాలరాతిపై పగడాలు తాపిన చందాన్ని గుర్తుకు తెస్తూన్నాయి, వత్తుగా రాలిన

ఆ పారిజాతాలు, నందివర్ధనం చెట్ల నిండైన శ్వేతవర్ణ పుష్పాలు; ఒక ప్రక్క కెంపు లీనుతున్న కుసుమాలతో మందారాలు ఉత్తరపుగోడ పొడవునా సూర్యనికొరకు ఎదురు చూస్తూన్న ప్రొద్దుతిరుగుడుపువ్వులు, మరో ప్రక్క అప్పుడే విడుస్తూన్న తెల్లని ఎర్రని గులాబీలు; నాగ్గుమూలలా త్రాళ్ళ ఆదా రాలతో గోడలపై కెగబ్రాకిన కాశీ రత్నం పూతీగలు; ఉషఃకాంతిలో రంగు పింగుల, రకరకాల సుమబాలలు! పసి పాపల అమాయక వదనాలను, సుందర యువతీ ముఖారవిందాలనూ గుర్తుకు తెచ్చే పూలభామలు! 'వసంతాగమవేళ రెమ్మ రెమ్మకు ఒక పూలపల్లకి' ఎక్కడో ఎప్పుడో చదివిన వాక్యం ఆ నిర్మల వాతావరణంలో గుర్తుకు వచ్చింది కళ్యాణికి ఎంత సుందరభావం!

పూజ ముగించి ప్రదక్షిణ చేస్తూన్న కమల పొగడచెట్టు క్రిందికి పరికించి చూచింది. "ఎవరూ, కళ్యాణీ?" అంది ప్రశ్నార్థకంగా. అప్పుడప్పుడే విడుగు తున్న చీకట్లలో మనిషివివరం తెలియక

"అవునమ్మా, నేనే నీపూజ మధ్యలో అడ్డ మెందుకని యిక్కడ కూర్చు న్నాను నీతో ఓ సంగతి మాట్లాడాలి," అంటూ లేచి దగ్గర కొచ్చింది కళ్యాణి

పూజ చేసిన పువ్వులు రెండు తీసిచ్చి కుమార్తె నుదుట పూజాకుంకుమ దిద్దింది కమల ఆప్యాయంగా ప్రసాదం చేతిలో పెడ్తూ "ఏమ్మా, ఇంత ప్రొద్దున్నే లేచావు? ఆ సూర్య దేవికన్నా ఉద యించనున్నావో!" అంది నవ్వుతూ

ప్రతిగా నవ్వుతూ "తూర్పునైనే ఉదయిస్తాడు లే కాని ఒక్కసారి కూర్చోమ్మా" అంది కళ్యాణి తులసి ప్రక్కన చతికిలపడ్తూ.

"ప్రొద్దున్నే నా కెక్కడ తీరిక కూర్చోవడానికి? అయినా నీకు పని ఏమిటి! ఏ వందో యాభైయ్యో కావా లేమో వెళ్ళి మీ నాన్నగార్నడుగు," అంటూ కదలబోయింది కమల

"అబ్బ, కాదమ్మా. ఒక్కసారి వినిపో, మళ్లా అన్నయ్యలు వదిన లొస్తే నీతో యిక చాటుగా మాట్లాడే అవకా శమే వుండదు వింటే వేళాకోళం చేస్తారు." అంది తల్లి కొంగు పట్టుకుని.

"అయితే త్వరగా చెప్పు ఏమిటో,"

వచ్చి కూర్చుంది కమల.

"మరి...మరి కోప్పడకుండా విను. నాకు మీ మాట కాదనాలని కాదు కాని ఒక్కసారి అతడిని చూడాలని వుందమ్మా ఇదేమంత పెద్ద కోరిక, చెప్పు," జాలిగా తల్లి ముఖంలోకి చూచింది

ఆ మాటలు వింటూనే కమల వ్రేళ్ళు అప్రయత్నంగా బుగ్గలు నొక్కు కున్నాయి కళ్ళు పెద్దవి చేస్తూ "ఇదేం కోరిక? సంసారి లక్షణమేనా? వా ళ్లేమో చూచుకోనక్కర్లేదని గౌరవంగా



చేసుకొంటూంటే నువ్విలాగంటావా? బెట్టుసరిగా వుండవలసిన మగవాళ్ళు కదా! వాళ్ళంత పెద్దమనిషితరహాగా వుంటే – నీ ఫొటో అయినా పంపమని లేదే, నువ్వతడినే చూడాలా? అనలీ పెళ్ళివ్వడం యిష్టం లేనట్టుందే! నాకు చూడగా..."

"ఇష్టాయిష్టా లతడిని నేను చూచిన తర్వాతి మాటలు. అతను ఒప్పుకున్నారంటే నా సంగతి వినేవుంటారు బాగానే వుంటుందనెవరో చెప్పి వుంటారు. నేను మాత్రం అతడిని చూచుకోవాలి" తాపీగా సమాధాన మిచ్చింది.

"ఆఁ మరే చెప్పారు. అక్కడికి నువ్వే తిలోత్తమవు, అతడు మన్మధుడూ నలకూబరుడూ కాకపోయాడు. తల్లీతండ్రీ ఎవర్ని తెస్తే వాళ్ళని కిమ్మనకుండా చేసుకోవాలి. కాని యిదేం పెంకెతనం? నీ బాగోగులు మాకు తెలియవూ? మా కాలంలో మే మెరుగుదుమా యివన్నీ?"

"ఏమిటమ్మా నీ గొడవ? నీ కాలంలోనే కాదు – ఈ కాలంలో కూడా

నువ్వెంగని వనేకం నే నెటుగుదును రోజులు మార్తాయి. దాని కేం గాని అమ్మ వైనందుకు ఈ మాత్రం కోరిక తీర్చలేవామ్మా ?"

"చిన్నప్పు డెప్పుడో చేస్తే మరి మీ ఇష్టప్రకారమే జరుగును ఇంతదాన్నై ఇంత చదువుకొని, టొత్తిగా బొమ్మలా ఎలా కూర్చోగలను ? నాకూడా యేవో కొన్ని ఆశలు వుంటాయిగదూ ?"

"ఒంటే మీ నాన్నగార్నే అడుగు ఆయనవగ్గర నోరు లేవదు మళ్ళీ. నా దగ్గరే ఈ వేషా లన్నీ నీ పెంకె కోర్కెలు నేను తీర్చలేను" కోపంగా లేచిపోయింది కమల

"నాన్నగార్నే అడగగలిగితే నీవఱకూ రావడం దేనికో ?" కన్నీళ్ళ పర్యంత మైంది కళ్యాణి

"పెడుచదువులూ, కెడబుద్ధులూను" సణుక్కుంటూ నిష్క్రమించింది కమల

అచేతనంగా అటే చూస్తూ కూర్చున్న కళ్యాణి, అట్లా ఎంత సేపు కూర్చుందో.

"ఏం చెల్లాయ్ ? వసంతోదయం గూర్చి ఏమైనా కవిత్వం వ్రాయబోతున్నావా ?" అన్న చిన్నన్నయ్య మురళి కంఠం విని వులిక్కిపడి చూచింది

బాలభానుని బంగారు కిరణాలలో మునిగి తేలుతోంది జగం తన పరధ్యానానికి తానే సిగ్గుపడ్తూ లేస్తూన్న కళ్యాణి తన వెనుక కిలకిలలు విని వెనక్కు తిరిగి చూచింది మందారచెట్టుక్రింద ముఖం కడుక్కుంటూన్న ఇందిర "అంత పరధ్యానం వచ్చిందేం కళ్యాణీ ? ఈ సుందర వాతావరణంలో ఏ సుందరాకారుడైనా తలపుకు వచ్చాడా ?" అంటూ హాస్యం చేసింది

చిరుకోపం వచ్చింది కళ్యాణికి "నీ మాట పూర్తిగా కాదనగల సాహసం లేదు వదినా నాకు అనుభవంవల్ల గల వచ్చే అభిప్రాయాలు కదా !"

తన విసురును తనకే త్రిప్పికొట్టిన ఆడపడచు అతితెలివికి ఆశ్చర్యపోయింది ఇందిర

కళ్యాణి ఓడమె మెట్లెక్కుతుండగా ఎదురైన పెద్దవదిన "ఏమండోయ్, తమ రింత ఉదయమే లేచారు ? ఏదో విపరీతముం దివ్వాళ ?" అని పలకరించింది

"యేమో మరి, మెలకువ వొచ్చేసింది" అంటూ వెళ్ళిపోయింది కళ్యాణి.

ఆరసు పేపరు తిరగేస్తున్న పద్మనాభం వుషోసులా లోపలికి ప్రవేశించిన కళ్యాణిని చూచి ఆశ్చర్యపోయాడు "ఏమమ్మా ఇంత పెందరాళే లేచావు? పెళ్ళైతే ఎలానూ సాగదు ఇప్పుడైనా సుఖపడక పోతే ఎలాగ? నీ కేం పనుంది గనక అప్పుడే లేవటానికి ?" అనడిగాడు

వస్తూ ప్రశ్న, ప్రతివాళ్ళూ అదే మాట నేను ఎనిమిది గంటలకే కాని లేవకూడదని ఎక్కడైనా రాసి వుందేమిటి ?" అని లోలోన చిరాకుపడింది




కళ్యాణి తండ్రికి దగ్గరగా కుర్చీ లాగి కూర్చుని ఏదో చెప్పేలోగా కళ్యాణి నేత్రాలకు అప్పుడే అటుగా వస్తూన్న తల్లి కన్పించింది. వస్తూ మాటలు విన్న పడటం వల్ల ఆమె ముఖం అప్రసన్నంగా వుంది

కాస్త ముందుగా లేచినంత మాత్రాన ఏరేం అరిగిపోదులెండి మీ కూతురు అసలు మీ గారాబమే దాని పెంకెతనాన్ని ఇంత వరకూ తెచ్చింది." అంది కూతుర్ని చురచురా చూస్తూ

కళ్యాణికి కోపమొచ్చేసింది. "అందు కేగా త్వరలో ఇంట్లోంచి తరిమెయ్యా లని చూస్తున్నావు? ఆ తర్వాత అరచి గీపెట్టినా ఈ రోజులు రావు ఇక్కడున్న న్నాళ్ళూ యింతే కనుమరుగైతే మాత్రం ఎక్కడలేని ప్రేమలూ కురిసిపోతాయి నీలాటివాళ్ళకి.' విసురుగా అనేసి లేచి వెళ్ళిపోబోయింది

"వెళ్ళిపోతావేం? తండ్రితో ఏదో మంతనాలకు పిల్చావుగా?" అంది కమల కొంచెం కరిగిపోతూ. 'పాపం నిజమే పెళ్ళయ్యాక ఈ సుఖముంటుందా? నా యిష్టమైనప్పుడల్లా దానిని చూచుకో గలనా?' అన్పించిందామెకు

"ఏం కావాలమ్మా? ఇలారా," అని పిల్చాడు పద్మనాభం కూతుర్ని

"ఏంలేదు నాన్నా నాకో యాభై రూపాయలు కావాలి. మా స్నేహితుల మందరం యివ్వాళ అమరావతి వెళ్ళి

చూచిరావా అనుకున్నాం. మళ్ళీ రేపు సాయంత్రాని కొచ్చేస్తాం." అంది కళ్యాణి.

మాట్లాడకుండా డెబ్బై రూపాయలు తీసిచ్చాడు పద్మనాభం. సంతానం ముగ్గురిలోనూ చిన్న దవ్వడంవల్లనో ఎందుచేతనో, కొడుకు లిద్దరికంటె కూతురు కళ్యాణిపైననే అతడికి చాలా అభిమానం ఆమె ప్రవర్తనపై అతడి కెక్కడలేని నమ్మకం, ఆమె విజ్ఞానంపై అమిత గౌరవం

ఆ దృశ్యం చూడగానే కమలకోపం నెత్తి కెక్కిపోయింది. "అదుగో అదే నే ననేది అది యాభై అడిగితే మీ రింకో పదెక్కువిచ్చారు ఇంత విచ్చలవిడిగా పెంచితే రేపు ఆ వెళ్ళినకుటుంబంలో యిది ఇమడగలదా అని? చదువుకున్న న్నాళ్ళూ తిరిగింది చాలదూ? చదువు మాని యింట్లో కూర్చున్నాకకూడా ఈ పిక్నిక్‌లూ, షికార్లూ ఏమిటి ఇరవై ఏళ్ళు నెత్తి కొచ్చిన పిల్లకి? ఈ ఆడవాళ్ళంతా బయల్దేరిపోతే వీళ్ళ ప్రయాణం క్షేమంగా సాగుతుందన్న హామీఏమిటి?"

తేలికగా నవ్వేశాడు పద్మనాభం. "బి యస్సీ. పాసైన నీ కూతురి కేం ఫర్వాలేదు కమలా వెళ్ళిరానీ కాని వివాహానంతరం వాళ్ళ అదృష్ట మేమిటో మనకు తెలియదుకదా! ఈ నాల్గురోజు లైనా వాళ్ళ కోరికలు మనం తీర్చక పోతే ఎవరు తీరుస్తారు చెప్పు? ఊఁ, అంచేత దా న్నేమీ అనకు. వెళ్ళి రామ్మా కళ్యాణీ." అంటూ సర్ది చెప్పే శాడు పద్మనాభం. తనలో తను గొణుక్కుంటూ నిష్క్రమించింది కమల ఆమె కేమిటో ఎవ రేం చెప్పినా సబబుగానే తోస్తుంది. పాపం

ప్రొద్దున్నే హుషారుగా వచ్చిన కళ్యాణిని చూచి కొంచం ఆశ్చర్యం పోయింది పద్మ స్నేహితురాం డ్రిద్దరూ గదిలో కూర్చుని మంతనాలు సాగించారు ఒక అరగంటలో బయల్దేరారు.

"అబ్బ, ఈ పంజాబీడ్రెస్‌లో నువ్వు రోజూకంటె ఆకర్షణీయంగా వున్నావే కళ్యాణీ అబ్బా – ఈ రెండుజడలు నీ కెంత అందం తెచ్చిపెట్టాయో! రోజూ రెండుజడలు వేసుకోరాదూ నువ్వు?" పద్మ కళ్యాణి చుట్టూ తిరుగుతూ కామెంట్స్ పాస్ చేస్తోంది

"ఛీ, కాస్త ఆడదానిలా ప్రవర్తించుదూ," విసుక్కుంది కళ్యాణి. "నాకీ బట్టలు క్రొత్తచేసి చస్తూంటే నీ వర్ణన లేమిటి మధ్యన?"

"అదుగో, అదే వద్దనేది మనం కాలేజీలో ఎన్నిరకాల ఫాన్సీడ్రెస్సులు వేశాం? క్రొత్తా జంకూ లేకుండా స్వేచ్ఛగా నడపగలగాలి మామూలుగా వుండు. దొంగచూపులు చూచావంటే అందరి దృష్టి నీ మీదనే వుంటుంది మరో సంగతి – మనం సాయంకాలం ఇంటికి తిరిగివచ్చేవరకూ ఒక్క తెలుగు




మాట రాకూడదు. హిందీపరీక్షలు పాసైన తెలివంతా ఇప్పుడు చూపించాలి లేదూ ఇంగ్లీషులోనే కానిద్దాం"

గుంటూరు స్టేషనులో దిగి పద్మా, కళ్యాణీ త్వరత్వరగా నడవసాగారు.

"నా మేకప్ చెరిగిపోలేదు కదా, చూడు." అంది కళ్యాణి

"లేదు. ఫస్టుగా వుంది కాని మన వూరు వదలగానే నీ జంకు పోయినట్టుందే? ఫ్రీగా నడుస్తున్నా విప్పుడు." అంది పద్మ నవ్వుతూ

"నిజమేనే. ఏదైనా క్రొత్తపని పరిచితుల మధ్యకంటె అపరిచితుల దగ్గరే ధైర్యంగా చెయ్యగల్గుతాం"

ఇంట్లో పద్మనాభయ్యా, శ్రీహరీ చెప్పుకుంటూండగా, రఘురామయ్యా ఇంటికి వెళ్ళేదారీ అదీ జాగ్రత్తగా విని వున్నది కళ్యాణి పెద్దన్నయ్య భోజనానికి వెళ్ళగా చూచి అతడి టేబుల్ మీది నుంచి వాళ్ళ అడ్రస్ సంగ్రహించింది. ఈ అన్ని సేకరణలవలనా గమ్యస్థానం సులభంగానే జేరుకొన్నారు

"కళ్యాణీ జాగ్రత్త అంతర్నాటకంలో నీపేరు సురయా నా పేరు రజియా తెలుగుభాష నిషిద్ధం." ఆవరణలో అడుగుపెడ్తూ మరోసారి తగ్గుస్థాయిలో ఆజ్ఞాపూర్వకంగా హెచ్చరించింది పద్మ

గేటుకు దగ్గరగా పెద్దవేపచెట్టు. కుడి ప్రక్కన షెడ్డులో స్టుడీబేకరు కారు ఆవరణనిండా వృత్తాకారాలలో అందమైన రకరకాల పూలమొక్కలూ,

వాటి తీరుతెన్నులు. చిత్రవిచిత్ర రీతులలో కత్తిరింపబడిన క్రైన్ కోటకూర, మొక్కల మధ్యన ఫౌంటెన్ తమ పోషకులయొక్క కళాహృదయాన్ని చాటుతున్నాయి ఎదురుగా పెద్దదీ, చిన్నదీ కాని రెండతస్తుల భవనం గోడలన్నీ లేత ఆకుపచ్చని రంగుపై లేగులాబి వర్ణపు లతలు చిత్రింపబడి వున్నాయి వెంటిలేటర్లకు ఖరీదైన రంగుల అద్దాలు, గుమ్మాలకు, కిటికీలకు అందమైన సిల్కు కర్టెన్లు, గేటుదగ్గఱ కాపలా మనిషి! వారు చాలా ధనవంతులన్న విషయాన్ని చాటుతున్నాయి

"క్యా, మాలిక్ ఘర్‌మే హై?"

అంటి సురయా గేట్‌కీపరు నుద్దేశించి

వాడు కంగారుపడ్తూ చూచాడు

"డాక్టర్‌సాబ్ లోన వుండెనా?"

తెలుగు తెలియనట్లు యాసగా అడిగింది రజియా

"అమ్మగారూ, అబ్బాయిగారు వున్నారు అయ్యగారు వూళ్లో లేరు." అన్నాడతను వాళ్లను ఆశ్చర్యంగా చూస్తూ

"అదృష్టవంతులమే" అన్నట్టు ఒకరి ముఖం ఒకరు సంతోషంగా చూచుకున్నారు సురయా, రజియా ఆవరణ దాటి, వరండా మెట్లెక్కి హాలులో ప్రవేశించారిద్దరూ నేలనిండా కాశ్మీర్ తివాచీ, ఖరీదైన సోఫాసెట్, ఒక గోడపై రవివర్మ చిత్రం, మరోగోడపైన అందమైన లాండ్‌స్కేప్, హాల్లోనే మేడమెట్లున్నాయి

ఇద్దరూ హాల్లో నిల్చుని 'ఏం చేయడమా' అని సందేహిస్తూండగా ప్రక్కగదిలోనుంచి ఒక నలభైయేళ్ళ పుణ్యస్త్రీ హాల్లోకి వచ్చింది బొట్టూ, కాట్టూ, అలంకరణా, నడకా చాలా హుందాగా వున్నాయి మరీ పాతకాలం కాదు, మరీ నాగరికం కాదు. అన్నిటినీ మించి చాలా అందంగా వుంది

రజియా ఆమెకు అభివినయంగా నమస్కరించి, "నమస్తే మాతాజీ! హం ఏక్ ఛోటా కామ్‌కేలియే ఆయా కృపా కర్‌కే థోడే సమే ఆప్ హమ్‌సే బాత్ చీత్‌కర్ సకియేగా (మేము ఒక చిన్న పనిమీద వచ్చాం, దయవుంచి కొద్ది సేపు మాట్లాడగలరా?)"

నమస్కారానికి ప్రతినమస్కారం చేసింది కాని ఆమె కీ భాష పూర్తిగా అర్థం కాలేదు సోఫాలో కూర్చోమని సౌంజ్ఞ చేసి, తానొక కుర్చీలో కూర్చుంది కొంత సేపు యిద్దర్నీ పరీక్షగా చూచి 'హిందూస్తానీయులా?" అని ప్రశ్నించిందావిడ

"జీ హాఁ," అంటూ మళ్ళీ ఏదో అనబోయిన రజియా ఆవిడముఖం విసుగ్గా పెట్టడం చూచి ఆగిపోయింది, హా.. పూర్తిగా తెలియని భాషాయె మరి!




అంతలో మేడ మెట్లపై సవ్వడి విని ముగ్గురూ అటు తిరిగారు. మేడ దిగి వస్తూన్న యువకుడు హాలులో వారిని చూచి సందేహిస్తూ ఆగిపోయాడు. అతనెక్కడికో వెళ్ళబోతున్నట్లుంది! తీసు చూడగా

"రా బాబు, నీ క్కెవరో భాష నాకు తెలియకుండేదు." అంది ఆ గృహిణి.

రజియా, సురయా అతడిమీదనుండి దృష్టి మరల్చుకోలేకపోయారు. గొప్ప ముఖవర్చస్సు, బంగారువర్ణపు శరీర చ్ఛాయ, నిండైన విగ్రహం, హుందాగా దర్పంగావున్న నడక, ఎదుటివారిని కట్టి వెయ్యగల చూపులు, వెయ్యిమందిలోనైనా ప్రత్యేకంగా కన్పింపజేసే ఏదో విశిష్టత వుందతడిలో.

అటు వచ్చి ఒక కుర్చీలో కూర్చుంటూ "గుడ్ మార్నింగ్ సిస్టర్స్. మే ఐ నో హూ యుఆర్. (సుప్రభాతం. మీ రెవరో నేను తెల్సుకోవచ్చా సోదరీ?)". ఆ గంభీర కంఠస్వరం విని యింకా ముగ్ధులైపోయారు వారు. పద్మ కళ్యాణిచేతిని నొక్కింది రహస్యంగా 'జాగ్రత్త' అన్నట్లు.

రజియాకూడ యింగ్లీషులోనే అందుకుంది — "మేము యిక్కడే మెడిసిన్ చదువుతున్నాము. ఇటీవల ఈ ప్రక్క వూళ్ళో జరిగిన అగ్నిప్రమాద బాధితుల సహాయార్థం ధనం వసూలుచేస్తున్నాము. మీబోటి ఉదారు లందరూ......"

రజియావాక్యం పూర్తి కాకుండానే అతడు జేబులోంచి ఒక పదిరూపాయల

నోటు తీసిచ్చి "ఇక నాకు పనుంది సెల విప్పండి." అని మృదువుగా అంటూ లేచాడు. రసీదు యివ్వబోతుంటే మందహాసం చేస్తూ వెళ్ళిపోయాడు. అందుకోకుండానే. అతడితల్లికి నమస్కరించి రసీదు బల్లమీదుంచి వెళ్ళిపోయారు సురియా, రజియా

"అతడు ఎంత సౌమ్యుడు కళ్యాణీ, ఎంత ఉదారత! ఎంత గంభీరత!" అంది పద్మ దారిలో

కళ్యాణి తలవంచుకు నడుస్తూ ముసి ముసి నవ్వులు నవ్వి పూరుకుంది.

"అబ్బో. అప్పుడే సిగ్గు వచ్చేసిందేమిటి?" హేళనచేసింది పద్మ

"ఎక్కడా వెకిలిపోకడేదేదు ఎంత పెద్దమనిషితరహాగా ప్రవర్తించాడు!" అంది పద్మ తిరిగి

ఆదివారం ఉదయం కళ్యాణి గదిలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు కళ్యాణీ పద్మా

"నిన్ను చాలా అభినందిస్తున్నాను కళ్యాణీ. నీవు రాబోతున్నభర్త నిజంగా శ్రీకృష్ణభగవాను డంతటి సౌందర్యవంతుడూ, గంభీరుడూను." అంది పద్మ.

"సంతోషించాం కాని నిన్ను నవరజా. తెలివైన ఆడ పెపరైనా సరే శ్రీరామచంద్రునితో వనవాసమే కోరుకుంటుంది కాని పదహారువేల ఎనమండ్రుగురు సవతలమధ్య శ్రీకృష్ణుడితో భోగాలు మాత్రం కోరుకోబోదోయ్." అని నవ్వింది కళ్యాణి

పద్మకూడా నవ్వేసింది "నిజంగా మనం గొప్పసాహసమే చేశాం కళ్యాణి. కాలేజీలో పాస్ట్ డ్రెస్సుల అనుభవం ఇప్పుడు బాగా వుపయోగపడింది ప్రతివిద్యా జీవిత కాలంలో ఎప్పుడో ఒకప్పుడు వుపయోగపడి తీర్తుంది"

"చాలా కృతజ్ఞురాల్ని పద్మా, నీ సహాయమే లేకుంటే అవమానాలతో అనుమానాలతో అప్పుడే కాలిపోతున్నా వుండేదాన్ని"

"సరేకాని మంచి ఇంగ్లీషు పిక్చర్ వుంది వెళ్దామేమిటి? శాంసన్ అండ్ డెలైలా"

"ఓ తప్పకుండా"

ఇద్దరూ తయారై వెళ్ళబోతూంటే విమల చూచి "ఎక్కడికి" అంది

"సినిమా కమ్మా"

ఉగ్రురాలై పోయింది విమల "చాల్లే, ఇంక నాల్గురోజుల్లో పెళ్ళి బంధువులంతా దిగుతున్నారు. నువ్వింకా సినిమాలూ షికార్లూ అని యిలాగే విచ్చలవిడిగా తిరుగు చూచినవాళ్ళు హర్షించాలా?"

"ఇందులో తప్పేముంది? అయినా బంధువులొస్తే నేనేంచెయ్యాలి? మర్యాదలు చెయ్యటానికి మీరున్నారుగా?"

"వాదించావు కాని నడు లోపలికి పద్మా. నువ్వు వెళ్ళమ్మా, కళ్యాణి ఇప్పుడు రాదు"

పద్మ మరి మాట్లాడకుండా వెళ్ళి పోయింది. కళ్యాణికి చిన్నిళ్ళపర్యంత మైంది. 'ఛీ అడుగడుగునా ఆంక్షలే' అని తల్లిపై విసుక్కుంటూండగా పద్మనాభం ఎవరినో వెంటపెట్టుకు లోపలికొచ్చాడు.

"చూడు కమలా ఈయన గొప్ప జ్యోతిష్కుడట మహాశాస్త్రి బ్రాహ్మణుడట." అని పద్మనాభం చెప్తూండగానే ఇంట్లో అందరూ అతడి చుట్టూ చేరిపోయారు. తివాచీ వేసి గౌరవంగా కూర్చోబెట్టింది కమల.

సినిమా ప్రోగ్రాం ఆగిపోయిందని కోపంగా వున్న కళ్యాణికి ఆ గడ్డం మనిషిని చూస్తే చికాకు పుట్టుకొచ్చింది. "ఎప్పుడో ఏదో జరిగితే యివ్వాళ అది యితడు చెప్తాడట వెర్రి నమ్మకాలు." అని విసుక్కుంటూ తన గదిలోకి పోబోతూంటే తండ్రి మాటలు అడ్డుపడ్డాయి "రామ్మా కళ్యాణీ. నీ చేయి వారికి చూపించు ఈయన గొప్ప జ్యోతిష్కులట."

కళ్యాణి కదలలేదు "ఇంకా ఎందుకు నాన్నా? ఇన్నాళ్ళూ పెళ్ళెప్పుడెప్పుడని ఆత్రంగా కన్పించిన జ్యోతిష్కుడికల్లా చూపించేవాడవు ఇప్పుడు నీ బెంగ తీరిందిగా?"

"అయితేనేమ్మా? ఒక్కసారి ఇలారా చూడనియ్యి. ఇంకా బెంగ పూర్తిగా తీరలేదుగా."

అసలే కోపంగా వున్న కళ్యాణికి విసుగుదల అధికమైంది "నాకివేం నమ్మకం లేవు నాన్నా." అని పోబోయింది.

ఇక కమల కోపం ఆపుకోలేకపోయింది "అన్నిటికీ వెంకెతనమే. దానికిలా చెల్లుతోంది." అంటూ కూతుర్ని కఠినంగా చూస్తూ.

"పోనీ కళ్యాణీ నీకింత పట్టుదలేమిటి?" అన్నాడు శ్రీహరి అనునయంగా.

"పిల్లా ఎందుకో అడుగుతున్నామ్మా కళ్యాణీ," అంది పెద్దవదిన లక్ష్మి.

"ఏగతాళి అక్కర్లేదు వదినా," చురుగ్గా చూస్తూ వెళ్ళి ఆ జ్యోతిష్కుడి దగ్గర కూర్చుంది "నాన్న దగ్గరకొచ్చిన యే జ్యోతిష్కుడు వట్టిచేతులతో వెళ్ళాడు గనుక?" అంది నిరసనగా. జ్యోతిష్కులపై పద్మనాభానికి గల వెర్రి అభిమానం చూస్తే ఆమెకు తలనొప్పి.

"తప్పు కళ్యాణీ," మందలించాడు శ్రీహరి.

ఆ జ్యోతిష్కుడు కళ్యాణి వామ హస్తం పట్టుకొంటూ ఆమె ముఖం పరిశీలనగా చూశాడు. ఎందుకో కనుబొమలు ముడిచాడు. అదే సమయంలో



పోయినా చాలా సంతోషంగానే వున్నావే!' అహంభావి అయిన ఆడపడచును ఏదో విధంగా వుడికించటానికి చూస్తుంటుందామె.

ఆమె మాట ఆసరాగా తీసుకుని ఇందిర బయల్దేరింది "అవునమ్మా, మా అన్నగారింత ప్రేమగా చూస్తా ననుకోలేదు "

కళ్యాణికి కోపమొచ్చేసింది కాని మౌనంగా వూరుకుంది ఎదురుగా భర్త వున్నాడు. అతడి సమక్షంలో తల్లిచేత చీవాట్లు తినడం యిష్టంలేదు

"ఏం కళ్యాణీ, మీ వదిన లేమిటో అడుగుతున్నారు ?" కొంటెగానవ్వుతూ కవ్వించాడు శ్రీనివాస్. దానితో కళ్యాణి పూర్తిగా సహనం కోల్పోయింది.

"పాపం, మీ పంతమే నెగ్గిందని సంతోషిస్తున్నారు కాబోలు పెద్దవాళ్లందరూను మిమ్మల్నందర్నీ 'ఫూల్స్'ని చేసి నేను స్వయంగా వెళ్ళి ఆయన్ని చూసుకొచ్చాను. తెలుసా?" సగర్వంగా ఒక్కసారి అందర్నీ చూచింది కళ్యాణి

"ఆఁ!" అన్నలు. వదినలు, తల్లి, తండ్రి కడకు శ్రీనివాస్ కూడ ఆశ్చర్యంగా నోరావలించారు

కళ్యాణి చెప్పసాగింది "నేనూ పద్మా అమరావతీ గుహలు చూడటానికి వెళ్తామని చెప్పలేదూ! ఆ రోజు నే గుంటూరు వెళ్ళి ఈ అమరేంద్రుణ్ణి చూసివచ్చాము. పంజాబీ డ్రెస్ వేసి ఎవ్వరూ గుర్తుపట్టలేనంతగా తయారయ్యాం. అగ్నిప్రమాదబాధితుల సహాయార్థం డబ్బు వసూలు చేస్తున్నామంటే దర్జాగా పదిరూపాయలిచ్చేశారు. రశీదైనా ఏమిచ్చామో చూచుకోకుండా. జ్ఞాపకం ముందా సార్?" అంది సగర్వంగా. భర్తవైపు తిరిగి, "పదిలంగా దాచాను మీపది"

"ఓహో, అదా సంగతి. నిన్నెక్కడో చూచినట్టే అన్పిస్తోంది కాని, ఇన్నాళ్ళనుంచీ గుర్తే తెలియలేదు. పూర్తిగా హిందీలో వుంది ఆవాళ నీ వ్యవహారం మరి... ఆరోజు నీ చెంపమీద పెద్ద పుట్టుమచ్చ వుండాలి. కొట్టొచ్చినట్టు కన్పిస్తూ?" సరసంగానే వుంది శ్రీనివాస్ ధోరణి

పకపకా నవ్వింది కళ్యాణి "మేకప్ ట్రిక్స్‌లో నేను చాలా దిట్టనండోయ్." అంటూ

"అమ్మమ్మో, ఇలాటి భార్యతో అన్నగారెలా వేగుతారో!" అంది కళ్ళు త్రిప్పుతూ ఇందిర

"నిజంగా ఫస్ట్‌క్లాస్ అడ్వెంచర్ చెల్లాయ్ మెచ్చుకు తీరాలి నిన్ను," అన్నాడు మురళి. చాల విషయాలలో ఆ అన్నాచెల్లెళ్ళిద్దరిదీ ఒకటే అభిప్రాయాలు

కమల మాత్రం బెదరిపోతోంది అల్లుడికి మాగ్రహం కల్గుతుందోనని ఆమెకు కూతురిపై ఎప్పుడూ ఇవ్వాళ వచ్చినంత కోపం రాలేదు. అల్లుడెదురుగా వుండిపోయాడు కాని లేకపోతే కళ్యాణి నేంచేసి వుండేదో ఆమెకే తెలియదు. కూతుర్ని అనవసర చదువులు చదివించి ఇలా తయారుచేసినందుకు ఇప్పుడైనా పద్మనాభం బుద్ధి వచ్చి గట్టిగా లెంపలు వాయించుకుంటాడని నమ్మింది ఆమె. కాని భర్త ముఖం ఇదివరకటికంటె చిరునవ్వుతో ఆనందంగా వెలిగిపోవడం చూచి కమల కోపం అధికమైపోయి భర్తను మింగేసేట్టు చూచింది

ఆమె భావాలను గమనించనట్టే కూతురిపై దృష్టిత్రిప్పాడు పద్మనాభం. "ఎందుకింత శ్రమపడ్డావ్ కళ్యాణీ? నువ్వు మౌనంగా వూరుకున్నావు; పైపెచ్చు




నేను చూచిన అబ్బాయేకదా అని ఎంగీకారమే అనుకున్నాను కాని మాటమాత్రం నాతో అంతే పెళ్ళిచూపు లేర్పాటు చెయ్యమా? నేను నీ కోరిక ఏది తీర్చ లేదు చెప్పు?"

"మీతో చెప్పలేకపోయాను నాన్నా. అమ్మతో చెప్తే కోపగించుకొంది ఇంకేం చెయ్యను?" అంది జాలిగా కళ్యాణి

"పోనీలె చదువుకున్న పిల్ల నన్పించావ్. నాకదే సంతోషం." అన్నాడు గర్వంగా

ఇహ ఆ తండ్రి కూతుళ్ళ సంభాషణ వినలేక పోయింది కమల. అంత దారుణమైన పని చేసిన కూతుర్ని తండ్రి మందలించబోగా సగర్వంగా లాలిస్తూంటే చూడలేక లేచి విసురుగా లోపలికి పోబోయింది. పద్మనాభం నవ్వుకున్నాడు.

"అత్తగారూ," శ్రీనివాస్ పిలుపు విని విస్తుపోయింది కమల. "వారంతా అమ్మాయి ఘనతను శ్లాఘిస్తూంటే మీ కోపం మొస్తోంది పోనీ అల్లుడి ప్రతాపం విన్నైనా మెచ్చుకుందురుగాని. కూర్చోండి" అన్నాడు ఆదోరకంగా నవ్వుతూ

అందరికళ్ళూ ప్రశ్నార్థకంగా అటు తిరిగాయి

"కళ్యాణీ." కొంటెగా పిల్చాడు శ్రీనివాస్

"ఏం మహాశయా?" అంది కళ్యాణి చిలిపిగా

"వివాహానికి ముందు ఒక జ్యోతిష్కుడు నీ హస్తం చూచాడు గుర్తుందా?" అన్నాడు బలవంతంగా నవ్వాపుకుంటూ

"ఊఁ అయితే?" అంది సందేహంగా కళ్యాణి

"కొంపతీసి నువ్వే నేమిటోయ్ బావా?" అన్నాడు మురళి శ్రీనివాస్ వీపు చరుస్తూ

"సందేహమా? నీ అభిప్రాయమేమిటో చెప్పిస్తానన్నానుగా చెప్పు కళ్యాణీ,"

"మీనాన్నగారివగ్గఱ కొచ్చిన జోతిష్కులందరికంటె పెద్ద బహుమానం కొట్టేసినవాడిని నేను," అన్నాడు చిలిపిగా కళ్ళు చిలికిస్తూ,

కళ్యాణి ముఖం కందగడ్డైపోయింది

అందరూ ఆశ్చర్యపోయారు. అంతా ఏమిటో సినిమాలాగుంది వారికి

మళ్ళీ శ్రీనివాస్ చెప్పాడు "ఏ అమ్మాయిని చూచినా వంక పెడ్తున్నానని నేను మాడటానికి వీల్లేదని శాసించారు నాన్నగారు అందుకా అవతారం ఎత్తవలసివచ్చింది మరి ఏం"

"మహా గొప్పపనేకాని నేనే ముందు చూచాను,' నెగ్గినట్టు అంది కళ్యాణి వెక్కిరిస్తూ

"నువ్వారికే చూశావుకాని, నేను వివాహానికి ముందే పాణిగ్రహణం చేశాను నేనే నెగ్గినట్టు." వెంటనే అన్నాడు శ్రీనివాస్.

మురళి కల్పించుకున్నాడు "ఆడపిల్ల ఆమాత్రం సాహసించడంలో అందమందికాని, మనం అంత మాత్రానికే ఘనకార్యమని మురిసిపోతే ఎల్లా బావగారూ మా చెల్లెలే నెగ్గింది." అని చెల్లెల్ని సమర్థించాడు

"బాగానేవుంది," అంది కమల ఏమి అనటానికీ తోచక

తృప్తిగా నిట్టూర్చాడు విశ్వనాథం, "ఇందులో నెగ్గడం ఓడటం ఏమీలేదు ఎవరి సాహసాలను వారివి తేటలను వారు ప్రదర్శించారు శివధనస్సును అతి తేలికగా విరిచిన శ్రీరామచంద్రునికే ఎక్కువ తక్కువలు నిర్ణయించడం కష్టం వారిద్దరికీ దీటైన జంట అనాలి అంచేత చక్రవర్తిగారూ, నాకు అమ్మాయి వివాహంనాటికంటెకూడ ఈనాడెక్కువ సంతోషంగావుంది. అన్నివిధాల యింత అపురూపమైన పిల్లని ఎవరి చేతులలో పెట్టేస్తానో అని రాత్రింబవళ్ళు మధనపడేవాడిని ఇకనాకు ఏచింతాలేదు" అన్నాడు ఆనందభాష్పాలతో

"సాటిలేని దీ కళ్యాణం. కళ్యాణీ శ్రీనివాసుల కళ్యాణం," కొంటెగా పాడ్తూ నేలిచేశాడు కళ్యాణి చిట్టి మేనల్లుడు



సంధ్యారుణకిరణాలు ప్రపంచమంతటా పరుచుకుని వున్నాయి. మెల్లిగా దివాకరుడు పశ్చిమాద్రిచాటుకు పోతున్నాడు. ఇంతవరకూ జరిగిన సంఘటనలన్నీ 'గతాలుగా' మారటానికిది నాంది. సజీవ ప్రాణికోటి ఆయుర్దాయంలో ఒకరోజు మెల్లిగా చెరిపివేస్తున్నాడు కాలపురుషుడు. సంధ్యాదేవి, ఉదయంనుంచీ సూర్యుని వెన్నంటి పరుగెడుతోంది. సప్తాశ్వరథారూఢుడైన దినకరుడామె రాకను గుర్తించలేదు. రాబోయే ముందు చూపులోనే పరుగెడుతున్నాడు. సంధ్యాదేవి వగరుస్తూ ఆగిపోయింది. నిస్పృహలో నిలిచిపోయింది. తాను మార్తాండుని చేరుకోలేకపోయింది. అతగాడప్పుడే పశ్చిమదిక్సౌధంలో అడుగుపెట్టేశాడు! ఇప్పుడేం చేయాలి? వెనుక్కి మరలి పోలేనో? ఊహూఁ, వ్యవధిలేదు. పోనీ ఇక్కడే నిల్చుని రేపటివరకూ నిలిచివుండేం? అందుకూ అవకాశంలేదు. అన్నివేపులనుంచీ అంధకారం వ్యాపిస్తోంది. నిశాకన్య తనను గేలిచేస్తూ, గర్వంతో గంతులువేస్తూ వస్తోంది. సంధ్యాదేవి కర్తవ్యవిమూఢురాలై, వెలాతెలాపోతూ నిల్చుంది. ఆమె సంధ్యారుణవర్ణం, సిగ్గుతో, అవమానంతో మ్రగ్గి, మ్లానమైంది. విజృంభిస్తున్న నిశాకన్యముందు, సంధ్య అవమానభారంతో తలవంచుకుని, ఆ చీకటిలో లీనమైపోయింది

---

పసని నిర్మల ప్రభావతి

మెట్ల కిరువేపులా కూర్చునిఅడుక్కునే నానాజాతి బిచ్చగాళ్ళూ. అంగ వికలులూ, తమ జోలెలూ, డబ్బులూ, పాత్రలూ తీసుకుని దిగి వస్తున్నారు కొండ మీదినుంచి దిగివస్తున్న యాత్రికుల సంఖ్యకూడా పలుచబడుతోంది. చూస్తుండగానే మెట్ల బాటంతా నిర్మానుష్యమైపోయింది నల్లిశలా పరుచుకుంటున్న అంధకారాన్ని తొలగిస్తూ విద్యుద్దీపాలు వెలిగాయి దూరంనుంచి చూస్తే, మెట్ల ప్రక్కగా వెలుగుతున్న దీపాలు, కోటీశ్వరుడైన భక్తుడు, వీడుకొండలవానిపై గల భక్తికి నిదర్శనంగా సమర్పించుకున్న వజ్రాలహారంలా వుంది '

మీనాక్షి మెల్లగా మొదటిమెట్టుమీద అడుగుపెట్టింది

ఎందరో చెప్పారు 'ఈ చీకట్లో, మెట్లదారిని పోతానంటావేమి టమ్మా, తెల్లవారనీ బస్సు లెన్నో వెడతాయి. లేదా పగలు ఎంతోమంది యాత్రికులు నడిచి వెళ్తుంటారు వారితోపాటు నువ్వూ పోదూగానీ...'

మీనాక్షి విన్పించుకోలేదు

ముప్పై సంవత్సరాలు పైబడి, జీవితంలో ఎన్నోరకాల అనుభవాలు చవిచూచిన తన కింకా చీకటిని చూచి భయ మేమిటి ?

కానీ ఈమెట్లన్నీ ఈ నిశాసమయంలో తను ఎక్కగలదా ? ఎక్కడేనా త్రోవ తప్పితే ? మొక్కలపర్వతం ఎక్కటం మహాకష్టమంటారు అది అధిగమించటం సాధ్యమా ? ఎక్కడేనా జారిపడితే ? ఏమెట్టుమీదనుంచి కాలుజారి అగాధంలో పడి నామరూపాలులేకుండా పోవాల్సిందే !

ఊహూం ? అలా హతమైపోదు తను. ఈ మెట్లేమిటి ? ఈ అంధకార మేమిటి ! ఇంతవరంటే ఎన్నో జీవితానుభవాల సోపానాలను అధిగమించి వచ్చింది తను ! రాగద్వేషాల కతీతమైన సమస్థితి నీనాడు మనసు సాధించింది ఇంకా చీకటి వెలుగుల తారతమ్యమూ, జీవన్మరణములకు సంబంధించిన భీతీ తనకేమిటి ?

మీనాక్షి కృతనిశ్చయురాలైంది

మెట్ల కిరువేపులా వున్న పలురకాల వృక్షాలమీదునుంచి, నానావిధపక్షి, క్రిమి కీటకాది ప్రాణికోటి రకరకాల శబ్దాలు చేస్తున్నాయి అమావాస్య దగ్గరకు వస్తున్న రాత్రి కావటంచేత, చీకటి దట్టంగా వ్యాపించింది. చుక్కలు జిగేలుమంటూ వెలుగుతున్నాయి, చీకటిలోనే తమ అందం ప్రస్ఫుట మౌతుందంటూ ! పైన నింగి, క్రింద నేల, మధ్యలో తను !

మానవజీవితమే ఒక మహాకావ్యం. అందులోని వివిధ సంఘటనలే, నవరస భరితఘట్టాలు. వాస్తవిక జీవితంలోని కొన్ని దృశ్యాలే కొందరు కవుల రచనలకు



పునాదు లవుతుంటాయి... కానీ ఆ వాస్తవిక సంఘటనలలోకూడా కొన్ని నమ్మ శక్యంకానంత అతిశయోక్తు లనిపించేంతటి అసహజంగానూ వుంటాయికూడా !

పాదాలు అడుగులు వేస్తున్నాయి. నోరు గోవిందనామసంకీర్తన చేస్తోంది. మనసు గత జీవితంలోని ఘట్టాలన్నిటినీ వరుసగా ఏర్చి, కూర్చి, చక్కటి కథలా రూపొందిస్తోంది : మనోనేత్రంలా గతించిన ఘట్టాలను, దృశ్యాలుగా చూస్తున్నాయి.

చిన్నతనంలో మీనాక్షినిగురించి, ఎవరికేనా చెప్పేటప్పుడు పార్వతమ్మ కళ్ళల్లో కించిత్‌గర్వం తొణికిసలాడుతుండేది ! అంతలోనే దుఃఖంకూడా క్రమ్ముకు వచ్చే దామెకు.

"మా మీనాక్షి వయసుకు చిన్నదేకానీ, ఆలోచనాశక్తి ఎక్కువండీ. ఇంట్లో ఏదేనా గొడవ జరుగుతుందని పసికడితేచాలు, చిన్నవాణ్ణి తీసుకుని బయటికి వెళ్ళి పోతుంది. పిల్లాడు భయపడతాడని దానిభయం !"

అబ్బ ! ఎంత గడ్డురోజులు !

విశ్వనాథం డిగ్రీచదు వెలా చదివాడో, స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగం ఎలా సంపాదించాడో, వూహాతీత మైన విషయంగా నిలిచిపోయినా, అతగాడికిత్రాగుడు మాత్రం సర్వస్వం అనేసంగతి మీనాక్షికి తెలుసు. విశ్వనాథం ప్రాణస్నేహితుడూ, మద్యపాన సహచరుడూ అయిన రామారావు, చీకటిపడగానే ఇంటిముందు నిలిచి,

"విశ్వం రావోయ్! అలా వెళ్ళొద్దాం సరదాగా" అని కేక వెయ్యటమూ, "వస్తున్నా నుండరా రామూ! ఒసేవ్ పార్వతీ! నేనలా వెళ్ళొస్తా!" అని తండ్రి ప్రతిసమాధానం, మీనాక్షికి మూడోఏడు వచ్చినప్పట్నుంచే బాగా గుర్తు

ఆ "అలా" "సరదా" అనేమాటలకు, తప్పతాగి రావటమనే అర్థమని ఏడో సంవత్సరం వచ్చేలోపలే గ్రహించింది మీనాక్షి

తప్పతాగి తూలుతూవచ్చే అతగాడికి, త్రోవలోవున్న ప్రతి వస్తువునూ తన్నెయ్యటమే అలవాటు అవి సజీవ నిర్జీవ ప్రాణులనే భేదంకూడా గమనించడు

ఒకరోజు మీనాక్షి బొమ్మలకు చీరెలు సింగారించి, అలిసి, అలా నేలమీదే పడుకుంది విశ్వనాథం రావటమూ, ఆయన కాలిదెబ్బకు బంతిలా ఎగిరి, గోడకు పోయి తల తగలటమూ, ముఖంమీద కలిగినగాయం నాటికీ నేటికీ మచ్చగానే మిగిలిపోయింది మరెప్పుడూ ఆయన వచ్చేవేళకు అలా త్రోవలో పడుకోవటం కాదు సరికదా, ఎదురుగాకూడా రాలేదు ఒక్కోసారి పార్వతమ్మ నతగాడు కొడుతుంటే, గదిలో తలుపువాటునుంచి నక్కి, నక్కి చూడటంమినహా మరేమీ చెయ్యలేకపోయేది.. బయటికి వస్తే, ఆదెబ్బలూ, తనకూ తగుల్తాయేమోననే భయంతో, అమ్మ దెబ్బలు తింటోందనే దుఃఖంతో, నాన్నమీద కోపంతో, వెక్కిళ్ళు వినిపించకుండా క్రుక్కి క్రుక్కి ఏడవటంకూడా పరిపాటైపోయింది

పార్వతమ్మ మీనాక్షిని దగ్గరకు తీసుకుంటూ అడిగింది. 'అమ్మాయీ! నీకు చెల్లెలు కావాలా? తమ్ముడుకావాలా' అంటూ

"తమ్ముడే కావాలమ్మా! బొద్దుగా తెల్లగావుండాలి నేనూ ఎక్కింటి శ్యామలలా, తమ్ముణ్ణి ఎత్తుకుని ఆడిస్తుంటాను"

అమ్మ కళ్ళల్లో ఎందుకో నీళ్ళు రావటం చూచి ఆశ్చర్యపోయింది మీనాక్షి

"అలాగే అమ్మాయీ! నువ్వూ, తమ్ముడూ బాగా ఆడుకుందురుగానీ .."

అమ్మెందుకేడుస్తోందో అర్థంగాలేదు... రాత్రి నాన్న కొట్టినందుకేమో!

"నాన్నకింత కోప మెందుకమ్మా! నిన్నెందుకలా కొడతాడు," అంది సంశయంగా

"అబ్బే! కొట్టలేదమ్మా .. నేనే తట్టుకుని పడ్డాను .' అమ్మ ఏడుస్తూనే, నవ్వుతూ, అబద్ధం చెబుతోం దెందుకో!

నాలుగురోజులు తిరక్కుండానే, ఇంట్లో చక్కటిబాబు నిలిచాడు

శ్యామలావాళ్ళ తమ్ముడికంటెకూడా బాగున్నాడు బాబును "రవి" అంటోంది తను అమ్మకూడా అదేపేరు ఎంతో బావుం దంటోంది .. రవి దోగాడ్తుంటే,



కూర్చుంటుంటే, నడుస్తుంటే, మీనాక్షి కెంతో ముచ్చట వేస్తోంది అస్తమానూ వాడితోడిదే లోక మయింది

కానీ ఒకే ఒక సందేహం పీడిస్తోంది.

బడికి పోతూ పోతూ, పిలవటానికి శ్యామలావాళ్ళింటికి వెళ్తుంది మీనాక్షి. అక్కడ తనక్కనిపించే దృశ్యం ఎంతో ఆశ్చర్యకరమైనది తన కేనాడూ అనుభవంలోకి రానిది. శ్యామలావాళ్ళ నాన్న, శ్యామల నొకవేపు, వాళ్ళ తమ్ముడి నొకవేపు ఒళ్ళో కూర్చోపెటుకుని నవ్విస్తుంటాడు మంచి మంచి కథలు చెబుతుంటాడు. ఒక్కోసారి ఏవేనా కొనుక్కుతినమని డబ్బులుకూడా ఇస్తుంటాడుట!

మరి తన నాన్నో" ఎప్పుడూ దగ్గరకు రమ్మనడు పొరపాటున ఎదురుపడితే కసురుకుంటాడు ఓసారి రవి ఏడుస్తూ వెళ్ళాడు నాన్నదగ్గరకి పాపం! వాడి కేం తెలుసు తండ్రితత్వం! చెంప పగిలిపోయేలా కొట్టాడు' గబగబ పరుగెత్తి బాబును చంకనేసుక పరుగెత్తింది. ఎంతసేపటికో తగ్గాయి వాడి వెక్కిళ్ళు!

పార్వతమ్మ అప్పుడప్పుడూ పిల్లల్నిద్దర్నీ దగ్గర కూర్చోబెట్టుకుంటుంది...

''మీ రిద్దరే నా ప్రాణాలు తల్లీ!'' అంటూ ఏడుస్తుం దెందుకో

పిల్లలకూ ఏడుపొస్తుంది

''ఛ ఛ, ఏడవకూడదమ్మా! పాపిష్టిదాన్ని' పిల్లల్ని కంగారు పెట్టాను!'' ఆమె గబగబ కళ్ళు వత్తుకుంటుంది.

సాయంత్రం పెందరాడే అన్నం పెట్టి, ''ఇక పడుకోండమ్మలూ! నాన్న వచ్చే వేళ్ళకు నిద్రపోతారుకదూ? లేకుంటే నాన్న క్కోపం వస్తుంది."

నిద్ర రాకున్నా, గదిలో రవిని పక్కలో పడుకోబెట్టుకుని కళ్ళు మూసుకుంటుంది మీనాక్షి! నాన్న వస్తున్నశబ్దం తనకు బాగా పరిచయమే!

''ఆ నీలవేణి చూడు, నే వెళ్ళేసరికే రంభలా ఎదురొస్తుంది. నవ్వులతో కేరింతలతో కవ్విస్తుంది నువ్వూ వున్నావు ఎందుకూ? చింపిచేటలా! అస్తమానూ పిల్లల్ని వెంటేసుకుని మడిదానిలా...''

ఒకరోజు విశ్వనాథం కేకలు ఇంట్లో ప్రతిధ్వనిస్తున్నాయి! ''ఆ నీలవేణి" ఎవరో అర్థం కాలేదు... కానీ ఎప్పుడూ లేనిది అమ్మ ఈరోజు రెచ్చిపోయి, జవాబు చెబుతోంది నాన్నకు!

"ఇంటి పనిపాటలూ, పిల్లల సంరక్షణా మానుకుని, రంభలా మిమ్మల్ని కవ్వించటానికి నే నేం ఆ పడుపుముండని కాదు. నా కా బిడ్డలే సర్వస్వం మీకోసం వాళ్ళనికూడా సరిగా చూడటం లేదు. మీరు వచ్చేసరికే వాళ్ళని అన్నాలుపెట్టి గదిలోకి తరిమేస్తున్నాను... ఏనాడేనా తండ్రి ఆదరణ వాళ్ళకుందా? ఏ నిముషమేనా ప్రేమగా దగ్గరకు తీసుకున్నారా వాళ్ళను? పెద్దదానికి ఊహ తెలిసింది కాబట్టి, అది మీ ఛాయలకే రాదు! వాడు మిమ్మల్ని చూస్తేనే హడలి పరుగెత్తుతాడు! ఇంకా రంభలా అలంకరించుకుని ఎదురుపడాలని, అనటానికేనా నో రెలా వస్తోందీ? మీ కా తాగుడూ, ఆ సానివాళ్ళే సర్వస్వం...కానీ నా కా బిడ్డలేప్రాణం!''

అమ్మ ఒళ్ళుమరచి అరుస్తోంది.

''ఎదురు చెప్పటం కూడా నేర్చుకున్నావే!" నాన్న దెబ్బలచప్పుడులో, అమ్మ ఏడుస్తూ అంటున్న మాటలు విన్పించటం లేదు! భయంతో గడ్డకట్టుకుపోయింది మీనాక్షి! ఇలాటి సమయంలో రవి లేస్తే? అమ్మయ్యో! భయపడి పోడూ? రవిని మరింత దగ్గరగా లాక్కుని పడుకుంది!

వారం రోజులుగా పార్వతమ్మ జ్వరం విశ్వనాథానికి చీమకుట్టినట్లయినా లేదు ఎప్పుడో వస్తాడు... వచ్చినట్లుగానే వెళ్ళిపోతాడు!

పక్కింటిపిన్ని సాదకాలు ఇస్తోంది అన్నంమాత్రం వండుతోంది మీనాక్షి, ఆమెకు మందులు ఇస్తూ!

''అమ్మలూ!'' పార్వతమ్మ మెల్లిగా పిలిచింది.

బౌన్సుగ్లాసులో మందు వంచుతూ, అదక్కడే పెట్టి, గబగబ దగ్గరకువచ్చింది మీనాక్షి.

తల్లి శరీరంలో, చూపులో కూడా ఏదో తెలియని భేదం కన్పిస్తోంది...

"ఏమ్మా?"

"తమ్ముణ్ణి జాగ్రత్తగా చూచుకుంటావుగదూ?" అమ్మ కళ్ళల్లో నీళ్ళు, అప్పటి కప్పుడు గంగాజలంలా వూరి నదిలా ప్రవహిస్తున్నాయి చెంపలమీదుగా...

"చూస్తానమ్మా!"

అమ్మ హృదయానికి హత్తుకుంది ఘట్టిగా!

సంజెచీకట్లు, మెల్లిగా చిక్కబడుతున్నాయి.

హఠాత్తుగా పార్వతమ్మ పలకటం మానేసింది! గుండెదడ ఎక్కువౌతోంది మీనాక్షికి! ఇల్లంతా చీకటి! రవి, తనుతప్ప ఎవ్వరూ లేరు... పెరటిగోడదగ్గరికి పరిగెత్తి పక్కింటి పిన్నిని కేకేసింది...

"పిన్నీ! పిన్నీ! అమ్మ పలకటంలే దెందుకో... నాకు భయం వేస్తోంది... రవి ఏడుస్తున్నాడు... ఒక్కసారి రా పిన్నీ!"

---

ఆవిడ హడావుడిగా వచ్చింది.

' నేను ష బాబుని చూస్తుంటాను మీనాక్షీ! నువ్వెళ్ళి మ నాన్నగారిని పిల్చుకు రామ్మా ' ఊ! త్వరగా!"

తన కేమీ కన్పించటం లేదు. పరికిణీ పైకి పట్టుకుని, ప్రాణాలు పిడికెట్లో పట్టుకుని పరుగెత్తుతోంది రామారావుగా రింటిముందు ఆగేసరికి వగరుస్తోంది...

"నాన్న వచ్చాడాండీ? మా అమ్మ పలకటం లేదు..." కంగారులో, దుఃఖంలో మాటకూడా రావటంలేదు

రామారావుగారి భార్య లక్షమ్మ, పిల్లాణ్ని చంక నేసుకు వచ్చింది... "ఇక్కడికి రాలేదమ్మా, ఎక్కడుంటారని వెతుకుతావు తల్లీ! నే వస్తా పద..." ఆమె వచ్చింది

పార్వతమ్మ కొద్దిగా కళ్ళెత్తి చూచింది

"అమ్మలూ, మీ నాన్న రాలేదూ?"

"ఊహుం"

"ఎక్కడున్నారు?"

' ఎక్కడుంటారు పార్వతమ్మా ' మీ ఆయనకూ, మా ఆయనకూ ఓ ఇల్లని నియమం వుందా?" లక్షమ్మ కళ్ళలోకూడ నీళ్ళు నిలిచాయి

"పిల్లలను జాగ్రతగా చూడమని, నా మాటగా వా రొస్తే చెప్పండి లక్షమ్మగారూ. ఇక నా కే కోరికా లేదు..." అమ్మ మూతలుపడుతున్న కనుకొలకుల్లో రెండేరెండు నీటి బిందువులు అలాగే నిలిచిపోయాయి!

లక్షమ్మగారు ఏడుస్తూ కంగారుగా బయటికి పరుగెత్తి, అందర్నీ కేకలేసింది! పరిస్థితి కొద్దికొద్దిగా అవగాహన కాగానే మీనాక్షి దుఃఖం కట్టలు తెంచుకుంది. ఏదీ తెలియని రవి అయోమయంగా ఏడుస్తున్నాడు

ఇరుగుపొరుగువారంతా పోగయ్యారు

"ఇకనయినా ఆ పాపిష్టివా డెక్కడున్నాడో పిల్చుకురండి ఎవరేనా!" పక్కింటి రామయ్యగారి కేకతో, ఎవరో వెళ్ళారు.

కాస్సేపట్లో విశ్వనాథం వచ్చాడు. భార్య మృతకళేబరంమీద పడి ఏడ్చాడు.

"వెధవ! వెధవ ఏడుపూ పీడూను. బ్రతికుండగా ఆ ఇల్లాలిని కన్నెత్తి చూచాడా?" అంటున్నా రెవరో

"ఇప్పుడుమాత్రం? అది నిజంగా ఏడుపే నంటవా ' తాగుబోతువాడికి ఏడు పెంత సేపులో రావాలి? నవ్వెంతలో రావాలి?" మరెవరిదో గొంతు...



# పిల్లలను ప్రేమించుటయే చాలును మీ కుటుంబమును నిర్ణయించుకొనుటకు



తల్లిదండ్రుల ప్రేమ, అనుభూతులపై [illegible] సమూహాయము ఒక నిర్ణీత పరిరక్షణ చర్య తనయొక్క పిల్లలకు సరిపడు ఆహారము, బట్టలు, మరియు విద్య ఇవ్వగలుగుట

## సంతోషమునకు పథకము

ఎప్పుడైతే పిల్లలకు కావలసినవి ఇవ్వగలుగుదురో వారిని పోషించగల శక్తియున్నదో అప్పుడే వారిని కలిగియుండవలెను మీ కుటుంబము ఎప్పుడూ మీ సంతోషమునకు మూలాధారమై యుండవలెను

## అభివృద్ధికి పథకము

మీ రాబడి ఎంతయునను [illegible] మునకు మేలైన భోజనము, వస్త్రధారణ మరియు విద్య మీరు మీ కుటుంబమును నిర్ణయము చేసుకొన్నప్పుడు [illegible] ఇవ్వగలుగుదురు ఇది మీ స్వవిషయములో ఒక ముఖ్యమైనది మీ దేశ విషయములోనూ కూడ



మీ ఊరిలో వున్న కుటుంబ నియంత్రణ కేంద్రము సందర్శించండి.

అక్కడ వున్న డాక్టరు ఒక స్నేహితుడూ సలహాదారుడేకాక మీకు, మీ కుటుంబమును నిర్ణయము చేసుకొనుటలో సహాయపడును

**మీయొక్క కుటుంబము ఆరోగ్యమైన కుటుంబమయిన దేశము పటిష్ఠమగును**

DA 65/521



పార్వతమ్మ నిర్జీవ శరీరంకూడా, పిల్లలమధ్యనుంచి మాయమైంది.

మర్నాడే పార్వతమ్మ తల్లీ, తమ్ముడు వేణూ వచ్చారు కబురు తెలిసి విశ్వనాధాన్ని వాళ్ళేవేవో తిట్టారు

''పిల్లల్ని మేం తీసికెడతాం, నా బిడ్డను చంపినట్లే, వీళ్ళనీ ముగిస్తావు...'' అంది అమ్మమ్మ ఏడుస్తూ...

''నాన్న చంపలేదమ్మమ్మా, అమ్మే చచ్చిపోయింది...'' మీనాక్షి మాటలు మధ్యలో వుండగనే అమ్మమ్మ కేకలేసింది.

''ఇంకా అవొక్కటే తక్కువ తల్లీ, చంపలేదులే మీ నాన్న... చచ్చేలా చేశాడు...!'' అమ్మమ్మ పొంగివస్తున్న దుఃఖాన్ని అణచుకొనబోయిందేగానీ, అది ఆగలేదు.

విశ్వనాధం అన్నీ వింటూ మౌనంగా వున్నాడు. దేనికీ జవాబు చెప్పటంలేదు.

*　　*　　*　　*

అమ్మమ్మగారి వూరుచూచి చాలా ఏళ్ళయింది. తన కెప్పుడో ఐదోఏట కాబోలు, అమ్మతో ఇక్కడికి వచ్చింది పచ్చని పంటపొలాల గట్లమీద, కుతూహలంగా నడిచింది మీనాక్షి. వేణు మామయ్య వేలుపట్టుకుని జొన్నచేలు చూస్తూ, మామయ్య కొట్టిఇచ్చే చెరుకులు తింటూ ఎంతదూరం నడిచినా అలసటరాలేదు.

కపిలబావులూ, ఆ బావులలోనుంచి పెద్ద బక్కెట్లతో నీళ్ళు తోడుతూంటే. తన కెంతో వింతగా వుండేది. అల్లాగే గంటలతరబడి నిల్చుండి, చూస్తుండిపోయేది ఆ దృశ్యాన్ని. అప్పుడు తన కన్నీ తమాషాలే! ఆశ్చర్యార్థకాలే! పాలు పితకటం, పైరుకోయటం, కుప్ప నూర్చటం, ఏదో వాళ్ళు పాడేపాటలూ, ఏతాము, బండ్లు తోలుకురావటం, ఒకటేమిటి, పల్లెలో కనిపించే ప్రతి దృశ్యమూ తనకు కొత్త వింత! ఒక్కొక్కసారి అలాటి వేహోచూస్తూ, ఎంతకూ ఇంటికి రాకుంటే, అమ్మ సన్నసన్నగా చివాట్లు పెట్టేది మామయ్య నవ్వేవాడు.

"దీన్నో మోతుబరీ రైతు కిచ్చి పెళ్ళి చేసేద్దాం అక్కయ్యా. పల్లెటూళ్ళో వుంటూ, నోరు తెరుచుకు చూస్తుండొచ్చు జీవితాంతం.."

అమ్మ, అమ్మమ్మ అందరూ నవ్వేవాళ్ళు

మళ్ళీ ఇప్పుడా పల్లెటూరికి వస్తోంది ఇది ఇక్కడే వుండాలని చెబుతోంది అమ్మమ్మ

అమ్మ చనిపోయింతర్వాత రవికి మరీ భయం ఎక్కువయింది ఎవ్వరిదగ్గరకీ రాడు... అందరివేపూ బెదిరిచూస్తాడు ఒక్క అక్కదగ్గరే వాడికి చనువూ, నిర్భయమూ, అస్తమానూ అంటిపెట్టుకు వుంటాడు, అమ్మమ్మ దగ్గరకూడా వెళ్ళడు... వేణుమామయ్యను చూచినా వాడికి భయమే రాధమ్మత్తయ్య దగ్గరికి ససేమిరా వెళ్ళడేమిటో!

మామయ్య కొడుకు రమేష్, సరిగ్గా రవి వయసువాడే వాడూ ఇప్పుడిప్పుడే అన్నిమాటలూ స్పష్టంగా చెప్పగలుగుతున్నాడు రవిలానే. రవీ, రమేష్ జట్టుగా ఆడుకుంటున్నారు... కొద్దికొద్దిగా రవి అమ్మను మర్చిపోగలుగుతున్నాడు

*　　　　*　　　　*　　　　*

మీనాక్షి సెకెండుఫారమ్‌లో చేరింది. పూర్వంలా ఇప్పుడు కపిల బావులనూ, దున్నుతున్న అరకలనూ, కోతల కూలీలనూ, కళ్ళార్పకుండా చూడాలనే కుతూహలమూలేదు... వూరుకూడా చాలా మారిపోయింది ఆ పెద్దబావుల దగ్గర ఇంజన్లు పెట్టారు ఎలిమెంటరీ బడిగా వున్న ఆ చిన్నపాక స్థానంలో ఇప్పుడు పెద్ద భవనమూ, అందులో హైస్కూలు వెలిశాయి కిరసనాయిలుబుడ్డి దీపాలు పోయి, కలవారికి విద్యుద్దీపాలూ, కొద్దివారికి పెద్ద లాంతర్లూ వచ్చాయి... మనుషులూ మారారు. కొత్తగా నాగరికత నేర్చుకొన్నారు... రోజులు చల్లగా, ప్రశాంతంగా సాగిపోతున్నాయి స్కూలు కెళ్ళిరావటమూ, రవి, రమేష్‌లతో ఆడుకోవటమూ, అత్తయ్యకూ, అమ్మమ్మకూ పనిచేయ్యటమూ, రాత్రి కాగానే


కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే

రవిని నిద్రపుచ్చి పుస్తకాలు పట్టుకు చదువుకొని. నిద్రపోవటమూ దినచర్యగా మారింది.

ఆ రో జెందుకో బడినుంచి వచ్చేసరికే అందరూ ముభావంగా వున్నారు. ఏమీ అర్ధంగాలేదు మీనాక్షికి...అమ్మమ్మ కళ్ళు వత్తుకుంటోంది. "ఏమిటమ్మమ్మా ఏడుస్తున్నా వెందుకూ?'' మెల్లిగా పక్కకు జేరి అడిగింది మీనాక్షి.

''ఏమని చెప్పనమ్మా, ఏం చెబితే నీ కర్ధమవుతుంది ? ఏనాడూ ఇక తండ్రి వున్నాడనే ఆశకూడా లేకుండా చేశాడు అప్రాచ్యుడు.'' అమ్మమ్మ కళ్ళు తుడుచు కొంటూంది.

అర్థం కాలేదు

మామయ్య చీదరించుకుంటూ లోపలికి వచ్చాడు ''అక్కయ్యను మింగింది చాలక, మరోపిల్ల గొంతు కోశాడు దరిద్రుడు. ఇద్దరు పిల్లలు అందులోనూ బాగా వూహ తెలిసిన పెద్దపిల్లుందనే ఆలోచనేనా లేకుండా, ఈ వయసులో... రెండోపెళ్ళి ! చేసుకునేవాడికి లేకపోయినా, పిల్ల నిచ్చేవాళ్ళకేనా లేకపోయింది కాబోలు "

కొద్దిగా అవగాహ నయ్యింది ''ఎవ రమ్మమ్మా" మెల్లిగా అడిగింది.

"ఇంకెవరమ్మా ? మీ నాన్న ! మరో అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడట... అంటే మీకు సవతి తల్లిని తయారుచేసి పెట్టాడన్నమాట ''

సవతితల్లి ! సవతితల్లులను గురించిన కథలెన్నో తను విన్నది. సినిమాలలో కూడా చూచింది వాళ్ళెంతో దుర్మార్గులు, పిల్లను చంపుకు తింటారట, అష్ట కష్టాలూ పెడతారట. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు మీనాక్షికి. ఆమె లేతహృదయంలో సవతితల్లుల రాక్షసకృత్యాలను గురించిన అనేక దృశ్యాలూ, ఘట్టాలూ- తలలెత్తు తున్నాయి. ఇప్పుడు నాన్న పెళ్ళి చేసుకున్న ఆమె ఎలా వుంటుందో, పేరేమిటో ఒకవేళ ఎప్పుడేనా నాన్నను చూడాలని, రవిని వెంటబెట్టుకునిపోతే, తమను ఏం చేస్తుందో ? అనేక కుశంకలు పొడసూపుతున్నాయి. అస లెందుకు వెళ్ళటం ? తను, రవి, చక్కగా ఇక్కడే వుండి చదువుకుని, పెద్దవాళ్ళవుతారు. సవతితల్లి దగ్గర కష్టా లెందుకుపడాలి ?

ఇలాటి వూహ రాగానే, మీనాక్షి హృదయం కాస్త తేలికపడింది రవిని మరో సారి శరీరమంతా నిమిరి పడుకుంది. పిచ్చివెధవ ఎప్పుడో తప్ప అమ్మనుగురించి అడగటంలేదు.

''అమ్మ ఇక మనదగ్గరకు రాదా అక్కయ్యా?" అంటాడు.

# యూనిట్లు మీకు...




మీరు యూనిట్ ట్రస్టులో పెట్టుబడి పెడితే మీకు మంచి లాభాలు వస్తాయి ప్రతి సంవత్సరం పెట్టుబడి పెట్టేవారు రూ 1000/- వరకు 6.1% రాబడి పన్ను లేని మొత్తాన్ని సంపాదించారు మీ మూలధనం స్థిరంగా ఉంటుంది ఇంకా ఏమి కావాలి యూనిట్లు మీ సొమ్మును ఒకే స్థలంలో మూలపెట్టి ఉంచవు-వాటిని మీరు సులభంగా నగదుగా మార్చుకోవచ్చును




యూనిట్ ట్రస్టు మీ సొమ్మును వివిధ పరిశ్రమలలో పెట్టుబడిగా పెడుతుంది ఈవిధంగా మీ సొమ్ము, దేశ ఉత్పత్తిని పెంచి అధికంచేసే పరిశ్రమల అభివృద్ధి చెందడానికి తోడ్పడుతుంది.




మీ సొమ్ములో కొంత భాగాన్ని యూనిట్ ట్రస్టు రక్షణ పరిశ్రమలలో పెట్టుబడిగా పెడుతుంది. కాబట్టి మీ యూనిట్లు జాతీయ రక్షణకు కూడా ఉపకరిస్తాయి

యూనిట్లు దేశం మొత్తంలో ఉన్న 4000 పెద్ద పెద్ద బ్యాంకు కార్యాలయాలన్నిట్లలోను లభిస్తాయి స్టాకు బ్రోకర్ల వద్దను లభిస్తాయి ఒక యూనిట్ విలువ రూ 10/- మీరు వాటిని మా 10/ ధరలో కొనండి యూనిట్ల యొక్క అమ్మకపు ధర తిరిగి వాటిని కొనే ధర ప్రతిరోజూ ప్రస్తుతపు ప్రకటించబడుతుం..

ఉత్తమమైన దానిలో పెట్టుబడి పెట్టండి




## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

హెడ్ ఆఫీసు బొంబాయి బాంబే లైఫ్ బిల్డింగ్ 45 వీర్ నారిమన్ రోడ్ పోస్టు బాక్సు నెం 2000.
బ్రాంచి ఆఫీసులు:కలకత్తా రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా (ఏనెక్స్)13 నేతాజీ సుభాష్ రోడ్ పోస్టు బాక్సు నెం552
DA 65-498 మద్రాసు రిజర్వు బ్యాంకు బిల్డింగ్ ఫోర్టు గ్లాసిస్ హైకోర్టు

''వస్తుందిరా రవీ. మనం పెద్దవాళ్ళ మయ్యాక వస్తుంది.'' అని సమాధానం చెబుతుంది అబద్ధంతో.

''అలా అయితే మనం త్వరగా పెద్దవాళ్ళ మవుదాం అక్కయ్యా'' అంటాడు వాడు

"అల్లాగే...బజ్జో...'' మెల్లిగా చిచ్చికొడుతుంటే వాడు నిద్రపోతాడు. అప్పటి కా ఆలోచన మానేసి!

ఇప్పుడు వాడికి సవతితల్లిని గురించి చెప్పాలా? వద్దా? అనే ప్రశ్న వేధిస్తోంది! వద్దు... భయపడ్తాడో ఏమో!

తన క్లాసుమేటు జయకూ్కడా సవతితల్లే! కానీ ఆవిడ జయనూ, వాళ్ళ చెల్లెలినీ ఎంత ప్రేమగా చూస్తుందనీ? ఎప్పుడూ తిట్టదు, కొట్టదు, కష్టాలుపెట్టదు... కోపంగా ముఖం పెట్టదు, చిరునవ్వు నవ్వుతూ, ఎన్నో కథలు చెబుతుందట! చక్కగా ముస్తాబు చేస్తుందట, ఒకసారి జయే చెప్పింది.

"మీనాక్షీ! మా అసలమ్మ ఎప్పుడప్పుడు కొట్టేది... ఈ అమ్మ అసలు కొట్టదు తిట్టదు... ఎంతో ప్రేమగా చూసుకుంటుంది...''

తన సవతితల్లి కూడా ఇలా ఎందుకుండకూడదూ? ఏమో!

ఇంట్లో అమ్మమ్మదగ్గ రెప్పుడు కూర్చున్నా ఇప్పుడు కొత్తగా వచ్చిన "పిన్ని" (సవతితల్లి)ని గురించిన కథలే! మరి వీళ్ళ కప్పుడే ఆమెనుగురించి ఏం తెలుసో? మాటల సందర్భంలో పిన్ని పేరు "వసుంధర'' అనిమాత్రం తెలిసింది.

థర్డ్ ఫారమ్ సంవత్సరం పరీక్షలయిపోయాయి రవి, రమేష్ ఒకటోక్లాసులో చేరారు. చక్కగా చెడ్డీ చొక్కా వేసుకుని, భుజాలకు సంచీలు తగిలించి, చెట్టా పట్టా లేసుకుని బడికి వెళ్ళొస్తున్నారు. మామయ్యకు మరోపాప కలిగింది! బొద్దుగా చక్కగా వుంది!

కానీ ఎందుకో అత్తయ్యలో మార్పు వచ్చింది ఇంతకుముందులా, ప్రేమగా చూడటంలేదు. మాటిమాటికీ కసురుకుంటోంది! చిరాకు పడుతోంది! రవిని చూస్తే మరీను! మామయ్యకూడా మారిపోతున్నాడు ..ఏవో వంకలతో మీనాక్షికి చీవాట్లూ, రవికి దెబ్బలూ తగుల్తున్నాయి!

ఓరోజు, జయా వాళ్ళింటి కెళ్ళొచ్చేసరికి ఇంట్లో ఏదోగొడవ జరుగుతోంది.

అమ్మమ్మగొంతు పెద్దగా విన్పిస్తోంది. బెదురుతూ లోపలికి వెళ్ళింది మీనాక్షి!

"పోనీలేమ్మా రాధా! ఇద్దరూ చిన్నపిల్లలే! రవిమాత్రం ప్రాయసముద్రుడా? అందులోనూ తల్లిలేని బిడ్డ... ఏదో ఆటల్లో.. "

అమ్మమ్మ మాటింకా పూర్తికాలేదు. రాధమ్మత్తయ్య కేకలు మిన్నుముట్టాయి!

"...అలా అని ఎంత ఓదార్చుకున్నా అల్లరికి హద్దుపద్దూ వుండక్కర్లా? ఈ రోజు కొరికినా, నోరు మూసుకు వూరుకుంటే, రేపు పగలరానిచో టెక్కడేనా తగిలేలా కొడతాడు. నా బిడ్డను పోగొట్టుకోవాల్సిందే కదూ?"

"అంత పెద్ద అపశకునమ్మాట లెందుకమ్మా? ఇప్పుడేమయిందనీ?"

"ఇంకా ఏం కావాలి? మీరు పెద్దవాళ్ళనే గానీ, అత్తయ్యా. . ఒక కంట్లో నీరూ, మరో కంట్లో పాలూ మీకు ..ఛీ..."

మీనాక్షి మెల్లిగా అమ్మమ్మ వెనకగా వచ్చి నిలబడి పమిటకొంగు నలుపుతోంది రాధమ్మకు మరింత ఆసరా చిక్కింది

"చూశారా! వయసొస్తున్న ఆడపిల్ల... అలా వూరువూరంతా చుట్టివస్తోంది. అదేమని అడిగే పాపాత్ముల్లేరు... ఆ మాటంటే నేను చెడ్డదాన్ని అవునా!"

అమ్మమ్మ ఏదో చెప్పబోయింది మామయ్య గర్జించాడు అమ్మా నీ మనవరాలి మీద మనవడి మీదా, నీకు ఎక్కువ ప్రేమవుంటే వుండొచ్చుగానీ, వాళ్ళనలా తల్లిలేని పిల్లలనే సాకుతో హద్దుపద్దు లేకుండా తయారుచేస్తున్నావు... రాధ మాటల్లో తప్పేముందీ"

అమ్మమ్మ పెద్దగా ఏడ్చింది "అయితే మీ ఇష్టం వచ్చినట్లు దండించండిరా వాళ్ళిద్దర్నీ! తల్లేనాడు చచ్చిందో, వాళ్ళకు తండ్రి వున్నా లేనివాడు కావటంతో, అనాదే. దిక్కులేని వాళ్ళయ్యారు వాళ్ళిద్దరూ!"

ఇక ఆమె అక్కడ వుండకుండా వచ్చింది పక్కగదిలోకి.

(సశేషం)

Printed and Published by Sri A Sudhakar Rao for Yuva Concerns and Printed at Yuva Press, 5-9-88 public Garden Road, Hyderabad-1.
Controlling Editor Sri "CHAKRAPANI."

